'హాసం'
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

46

**Also available on net:**
**www.haasam.com**

ముఖచిత్రం
'నీకు నేను.. నాకు నువ్వు'
లో శ్రేయ



## హాస్యం





## సంగీతం




'హాసం' పత్రికా ప్రపంచానికి ఒక మేలు కొలుపు. ప్రతి పదిహేనురోజులకు వచ్చే పౌర్ణమి. ఆచార్య తిరుమల గారి వ్యాసాలు ప్రతి ఉపాధ్యాయుడు తెలుసుకోవలసిన తెలుగు అమృత గుళికలు. ఇటీవల మా జిల్లా మొత్తం మీ పేరడీ పాటలతో మార్మోగింది. ఆ పేజీ పత్రికకే హైలేట్. ఎడిటోరియల్ చాలా సందర్భోచితంగా వుంటున్నది. కాలానుగుణంగా ఇంటర్నెట్‌లో కూడా పత్రికనుంచడం వల్ల ఇతర దేశాలలోని తెలుగు వారికి 'హాసం' ఒక వారధిలా శోభిల్లుతుందని ఆశిస్తూ....

**-రేజేటి వెంకటేశ్వర్లు, గుంటూరు.**

'హాసం' పత్రిక ఉనికిని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను. ప్రవాసాంధ్రుడిగా వుంటూ తెలుగు సినిమాలు, టెలివిజను, ఇతర తెలుగు పత్రికలు వగైరాలతో తెలుగు తనాన్ని చాలినంతగా అలవర్చుకొన్నానని అనుకునేవాణ్ణి. కానీ 'హాసం' చదువుతున్నప్పుడు అర్థమైంది. ప్రముఖుల వ్యాసాలు, అభిప్రాయాలూ ఎంతో మనోల్లాసాన్ని స్తున్నాయి. 16-30 జూన్ సంచికలో ఘంటసాల వారి గురించి మీ ఎడిటోరియల్‌లో రాసిన పద్ధతి చూసి హర్షాతిరేకంతో కళ్లనీళ్ల పర్యంతం అయ్యాను.

**-భాస్కర జనార్థనరావు, బెంగుళూరు**

నేను హాస్యానికి, హాసానికి వీరాభిమానిని. అన్ని శీర్షికలు వినూత్నంగా, ఆకర్షణీయంగా ఉంటున్నాయి. తన కామెడీ సీరియల్‌తో పాఠకులను విరగబడి నవ్విస్తున్న ఇలపావులూరి మురళీమోహనరావుగారు మిస్టర్‌పెళ్లాం వంటి క్లాసిక్ కామెడీ సినిమాను నవలగా రాయడం ముదావహం. ప్రారంభం చాలా ఆసక్తికరంగా ఉంది. ఇది నవ్వులపంట పండిస్తుదనడంలో మాకు సందేహం లేదు.

**-జి.సాయిబాబా, బోడుప్పల్**

ఈ మధ్య 'హాసం' పాత పత్రికలను చూడటం జరిగింది. పత్రిక చాలా బావుంటుంది. ముఖ్యంగా ప్రముఖుల వ్యాసాలు. ఆ పాత మధురమైన సినిమా పాటలను ప్రచురించడం ముదావహము. కానీ ఆ ఆనందము ఈ తరం పాటల తీరుతెన్నులను గమనించడం వల్ల మాయమగుచున్నది. ఉదాహరణకు 16-31 జులై సంచికలో 74వ పేజీలో జానపద గేయబ్రహ్మ కొసరాజు వ్రాసిన పాట 'చెక్కిలి మీద చెయ్యి చేర్చి చిన్నదాన' పాటలో ఎంత హుందాతనముందో అదే సంచికలో 39వ పేజీలో చంద్రబోస్ గారు రాసిన 'నన్నేదో సెయ్యమాకు నడుముకాడ..' వింటే ఎంత అసభ్యంగా దిగజారుతున్నాయో తల్చుకుంటే చాలా బాధగా ఉంది.

**-ఎస్.సి.శేషాచార్య, హైదరాబాద్.**

'హాసం'16-31 జులై సంచికలో రాజేంద్రప్రసాద్ గురించి వ్రాసిన ఇష్టాగోష్టి చదివి పులకరించిపోయాను. 'పెళ్లిపుస్తకం' ఆద్యంతం ఓ దృశ్య కావ్యం. 'మాయా బజార్' తర్వాత ఒక్క సీను కూడా అనవసరం అనిపించని సినిమా ఇది. బాపుగారు, రాజేంద్రప్రసాద్‌గారు, రావు గోపాలరావుగారు ఆంధ్రులకి దేవుడిచ్చిన వరం. నిత్యం ఒత్తిడితో నలిగిపోయే నాలాంటి వారికి 'హాసం' ఒక స్ట్రెస్ రిలీజింగ్ టానిక్. కాకపోతే నెలకు రెండుసార్లే పుచ్చుకోమని పిస్క్రైబ్ చేసాడు దేవుడు.

**-రమణ శాస్త్రి, సంగారెడ్డి**

**'హాసం' 1-15 ఆగస్టు సంచికలో వ్రాసిన సంపాదకీయంలో 'హాసం క్లబ్'ల స్థాపన గురించి వ్రాశారు. చాలా సంతోషం. నిస్వార్థమైన, నిత్యజీవితంలో తబ్బిబై వివిధరకాల మానసిక ఒత్తిడిలకు లోనౌతున్న వారందరికీ కాకుండా అందరూ ఇటువంటి క్లబ్బులకు వచ్చి పాలుపంచుకోవటం ఆరోగ్యానికి మంచిది. ఇందుకు నా వంతు బాధ్యతగా నిజామాబాదు టౌనులో 'హాసం' క్లబ్ స్థాపించాలని నిర్ణయించుకున్నాను. ఇందుకు మీ నుండి సహకారం అందిస్తారని ఆశిస్తూ**

**-ఎం. రామస్వామి, నిజామాబాద్**

16-31 జూలై నెల పత్రికతో ముళ్లపూడి వెంకటరమణ ఇద్దరుమిత్రులు సీరియల్ సమాప్తంతో సినిమా చూసినట్లే వుంది. డా॥ శ్రీమతి కొఠారి వాణీచలపతిరావు గారి అయోమయం జగన్నాథం కథ బాగుంది. ఈ పక్షం చౌచౌ చౌరస్తా శీర్షికలోని తాళాభక్తుల లక్ష్మీప్రసాద్ గారి పేరడీ పాట 'కరిచిందిలే కరిచిందిలే..' హైలెట్.

**-జగన్‌మోహన్, సోమల,చిత్తూరుజిల్లా**

'హాసం' పక్ష పత్రిక చూసిన మరునాటి నుంచే, రెండవ సంచికకై ఎదురుచూపులు-ప్రతినెల తొలినాడు జీతం అందుకోకపోయినా బాధ కలగలేదు కాని 'హాసం' అందుకోకపోతే ఆ రోజంతా ఏదో వెలితి. ఎందుకు రాలేదు అన్న సందేహం. నిజంగా పత్రిక అంటే జర్నలిజంతో నిండేది కాదు. నవరసాలతో నిండి ఉన్నది. అది హాస్యం-విజ్ఞానం-విషాదం-వినోదం-విలాసం -అన్నీ 'హాసం'లో కూడా ఉన్నాయి. తెలుగు పత్రికలలో అపూర్వం. అంతేకాదు నభవిష్యతి కూడా!

**-కె.వసంత్‌కుమార్, దేవరకొండ**

'హాసం'లో హాస్యం పాలు చాలా ఎక్కువే. 'సొంగులే బంగారు రాజా' కార్టూన్లు, పేరడీ పాట చాలా బావుంటున్నాయి. ఇటు హాస్య ప్రియుల్ని, అటు సంగీతాభిమానుల్ని సమానంగా ఆకట్టుకుంటున్నది. విభిన్న సినిమా శీర్షికలతో పాటు హాస్యానికి పెద్ద పీట వేస్తున్న మీకు ప్రత్యేక కళాభివందనములు.

**-డా॥సయ్యద్ రహముతల్లా, పర్లాకిమిడి.**

ఇవాళ హాస్యం పేరుతో చలామణి అవుతున్న రచనలు కనబడే పత్రికలకన్నా 'హాసం' చాలా ముందుంది. క్లాసిక్స్ రీటోల్డ్ కాన్సెప్ట్ కొత్తది. తిరుమల వారికి పాదాభివందనం చేయాలని పిస్తుందది చదువుతూంటే. దివాకరబాబు గారి నాటిక చెరకుగడ రసం పీల్చినట్లుంది. ఆ శైలి...పంచ్...ఆయనకే సాధ్యం.

**-కర్లపాలెం హనుమంతరావు, సికింద్రాబాద్.**

నేను 'హాసం' పత్రికకు అభిమానిని. గాయని కౌసల్య, శ్వేతాశెట్టిల గురించి వివరించిన తీరు బాగుంది. ఆడియోరివ్యూలో సంబరం పాటల్లోని 'ప్రేమను పంచిన ప్రేమను' సంగీత పరంగా, సాహిత్యపరంగా ఎన్నదగిన పాట అని తెలియజేయడం నిజమే. ఆ పాత(ట) మధురంలో 'మాంగల్యబలం' పాటల్ని, పాడిన వార్ని రాగాల పేర్లను వివరించిన పద్ధతి నన్నెంతగానో ఆకట్టుకుంది. ఇవేగాక లతామంగేష్కర్, వీర అభిమన్యు తమిళ్ పాటలు నన్నెంతగానో ఆకట్టుకున్నాయి

**-బలుపరి విజయ్, సూగూరు**

మాంగల్యబలం చిత్రంలోని పెను చీకటాయెలోకం పాట విశ్లేషణ మళ్లీ మళ్లీ చదవాలనిపించేలాగా వుంది. చదువుతూంటేనే శరీరం రోమాంచితం అయింది. గుండె చెమరింది. విశ్లేషణలో పేర్కొన్న నౌషాద్ పాటలన్నీ నాకు క్షుణ్ణంగా తెలుసు. కానీ ఆ పాటలకి ఈ మాంగల్య బలం పాటకి ఇంత అందమైన సంబంధం వుందని ఇన్నాళ్లు తెలుసుకోలేకపోయాను. ఈ పాటలన్నీ మళ్లీ ఫ్రెష్‌గా నా మ్యూజిక్ సిస్టమ్‌లో వింటూ వుంటే చాలా రిఫ్రెషింగ్‌గా వుంది. ఇపుడు మీరు చేయవలసిందేమిటంటే వెంటనే 'ప్రేమించిచూడు' చిత్రంలోని పాటలని విశ్లేషించడం. ఈ చిత్రంలో మాస్టర్ వేణు స్వరపరిచిన పాటల్లో ఎక్కడా నౌషాద్ వాసనలు సూచాయగా కూడా కనిపించవు. ఈ పాటలను రాజా ఎలా విశ్లేషిస్తారో చూడాలని వుంది. ఇది ఆయనకో ఛాలెంజ్.

**-బి.శ్రీనివాసరావు, హైదరాబాద్**

**('ప్రేమించి చూడు' సినిమాలో 'వెన్నెల రేయి ఎంతో చలిచలి' పాట ఒక్కటే మాస్టర్ వేణు స్వరపరిచిన పాట. తక్కిన పాటలన్నీ ఆ చిత్రం మాతృక అయిన 'కాదలిక్క నేరమిల్లై' చిత్రంలోని బాణీల నుండి తీసుకున్నవే. ఈ విషయాన్ని 16-30 జూన్,2003 సంచికలో అర్థం చేసుకుందాం -ఆస్వాదిద్దాం శీర్షికలో పేర్కొనటం జరిగింది.**

**-ఎడిటర్)**

సంపుటి : 2 సంచిక:22

**16-31 ఆగస్టు 2003**

పేజీలు: 68 + 8

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

విదేశాలలో(ఎయిర్‌మెయిల్): $50

జీవిత చందా : రూ. 2000

విదేశాలలో(ఎయిర్‌మెయిల్): $400

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

46

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా|| కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**

పాత సినిమా పాటలు కొన్ని వింటున్నప్పుడు మనం పులకిస్తాం. ఇంతమంచి పాటను తెరపై ఎలా చిత్రీకరించారో అనుకుంటాం. తీరా చూడబోతే కొన్ని సందర్భాలలో ఆ సినిమా మనం ఎప్పుడూ కననిదీ, విననిదీ అవుతూవుంటుంది. తారాబలమో,గ్రహబలమో చాలక ఆ సినిమా ఆడివుండదు. నిర్మాతలు ఆ సినిమాను మళ్లీ రిలీజ్ చేసినా, ఆ సినిమా బాగోగుల చర్చల్లాంటివేమీ జరగక ఆ సినిమా తర్వాతి తరాలకు అందకుండా పోతుంది.

అయినా కొన్నికొన్ని సినిమాల పేరు మన నోటిలో ఇంకా ఆడడానికి కారణం - ఆ సినిమా సంగీతం (నేటి పరిభాషలో ఆడియో) బాగుండడం. చరిత్రపుటలలో ఆయా సినిమాలకు ఆ పాటి స్థానమైనా నిలుస్తోందంటే కేవలం పాటల చలవే! అటువంటి పాటలను సృష్టించిన గీతకారులు, సంగీతకారులు, గాయనీగాయకులు ఈ రూపేణా ప్రజల హృదయంలో చోటు సంపాదించుకుంటున్నారు. అంతవరకు వారు అదృష్టవంతులే!

. కానీ అంతటి అదృష్టం ఈ తరం సినిమాలకై సంగీతవిభాగంలో పనిచేస్తున్న వారికి పడుతోందా అంటే సందేహమే! సినిమా రిలీజుకు ముందు ఆడియో రిలీజయి, ప్లాటినమ్ డిస్క్ ఫంక్షన్‌లు చేసుకున్నా , కర్మ కాలి సినిమా ఫెయిలయితే మర్నాటికి ఆడియో మార్కెటు డల్లయిపోతోంది. అప్పటిదాకా ప్రీమియం రేటులో అమ్మిన కాసెటును కాంబినేషన్ కాసెట్‌గా రిలీజు చేయవలసివస్తోంది.

ఎందుకిలా జరుగుతోంది? సినిమా ఫెయిలవడానికి వంద కారణాలు ఉండవచ్చు - కథ, కథనం, నాయకుడు, నాయిక, దర్శకత్వం, పాటల చిత్రీకరణ, మరోటి మరోటి ఇంకోటి కావచ్చు. కొన్ని సినిమాల్లో పాటలు అస్సలు బావుండక పోవచ్చు. వాటి సంగతి మనకనవసరం. కానీ పాటలు బాగున్న సినిమా ఫెయిలయితే సంగీత విభాగానికి సంబంధించిన వారి కృషికి గుర్తింపు కరువై, రావలసిన కీర్తి రాక, శ్రమ నేలపాలవుతోంది. ఇది ఎంతవరకు సమంజసం?

'కానిస్టేబులు కూతురు' సినిమాలోని పాటలు విననివారు అరుదు. అలాగే ఆ సినిమా చూసినవారూ అరుదే. సినిమా ఫట్. పాటలు హిట్. 'చివరకు మిగిలేది'లో మిగిలినది.. మరపురాని మల్లాది పాటల పరిమళమే. 'రహస్యం' సినిమా వీడియోలో చూడబోతే గిరిజాకళ్యాణం యక్షగానం కనబడదు. కానీ ఆడియోలో లక్షణంగా లభ్యమవుతుంది. ఇవన్నీ నాలుగు దశాబ్దాల నాటివి. ఇక గత దశాబ్దంలో సిరివెన్నెల సీతారామశాస్త్రి 'పట్టుదల' అనే ఫెయిలయిన సినిమాకై రాసిన అద్భుతమైన ప్రబోధ గీతం 'ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమీ' పాట ఆడియోపరంగా దొరకటం కష్టం. ఎందుకిలా జరుగుతోంది? సినిమా జయాపజయాలకు, ఆడియో లభ్యతకు ఇదివరకు లేని సంబంధం ఇప్పుడెందుకు వచ్చిపడింది?

హిందీ రంగంలో చూసుకుంటే తాజా ఉదాహరణ 'సుర్'. సినిమా ఫెయిలయినా కీరవాణి సంగీతదర్శకుడిగా ఫెయిలవలేదు. సినిమా వచ్చి వెళ్లిపోయినా, ఆడియో టాప్ టెన్‌లోనే ఉండిపోయింది. ఆడియో కాసెట్లు, ఆడియో సిడిలు ధారాళంగా దొరుకుతున్నాయి. మరి తెలుగుసినీరంగంలో మాత్రం దీనికి విరుద్ధంగా ఎందుకు జరుగుతోంది?

ఎవరినిరాదరణ, ఎవరి అలసత్వం, ఎవరి నిర్లక్ష్యం? కారణాలు ఏవైనా, కారకులు ఎవరైనా పరిస్థితి మాత్రం శోచనీయం. ఈ పరిస్థితిని చక్కదిద్దే ప్రయత్నాలు చేయకపోతే ఈనాడు సంగీతరంగంలో పనిచేసేవారి కృషి చాలాభాగం వ్యర్థమవుతుందనే అనుకోవాలి. రిలీజయిన సినిమాల్లో 80 శాతం పరాజయం పొందుతున్నప్పుడు, పరాజయ కారణంగా ఆడియోలు అతి త్వరగా కనుమరుగవుతున్నప్పుడు మనిషి సంస్కారవంతంగా రూపొందడానికి వినోదరూపంగా అందుతున్న సంగీతసాహిత్యాల వికాసం వ్యర్థం కాక సార్థకమవుతుందా!?



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
email: haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

# పెళ్ళినీది - పగనాది

- పోడూరి కృష్ణకుమారి



"మెంటల్ డాక్టరు గారున్నారా?" అంది ఫోన్లో గొంతు.

"ఇక్కడ మెంటల్ డాక్టర్లెవరూ లేరు. మెంటల్ పేషంట్లని ట్రీట్ చేసే డాక్టరు గారున్నారు. నిద్రపోతున్నారు." అన్నాను చాలా కటువుగా.

అర్ధరాత్రి ఫోన్‌చేసి నిద్ర చెడగొట్టడం కాక మా ఆయనంతటి వారిని పట్టుకుని మెంటల్ డాక్టరనడమా? అంటే నేననాలిగాని.

"లేపండి" అన్నాడు గొంతుగాడు.

"ఇలా అర్ధరాత్రీ అపరాత్రీ ఫోన్...."

"అర్ధరాత్రేటండీ బాబో, తెల్లారింది."

"తెల్లారు జామైనా సరే..."

"తెల్లారు జామేటండీ బాబో! ఏడున్నరైంది"

"ఏడున్నరా?!"

సరిగ్గా ఆ క్షణంలో పదమూడంగుళాల పొడవున్న గట్టి వస్తువుతో నా మోకాల్చిప్ప పగిలేలా కొట్టారెవరో. కెవ్వున కేకెట్టాను. అలా కేకపెట్టడం, ఇలా నా కళ్ళు తెరుచుకోడం సైమల్టేనియస్‌గా జరిగిపోయాయి. ఇంతసేపూ నేను కళ్ళు మూసుకునే ఉన్నాననీ, నిజంగానే టైము ఏడున్నరయిందనీ రెండు పాయింట్లు అర్థం చేసుకున్నాను అంత బాధలోనూ.

"ఏంటే అమ్మాయ్! డాక్టరుగారి నంబరిమ్మంటే మెంటలాస్పత్రి ఫోన్నంబరిచ్చా వేంటి? ఎవర్తో పేషంటు ఫోనెత్తి రంకెలుపెట్టి నానారబసా చేస్తోంది." అంటున్నాడు ఫోన్లో గొంతుగాడు నా గురించి... నేను కోపంతో నిలువెల్లా ఒణికిపోయాను. నోట మాటరాలేదు.

మోకాలి మీద ఇంజరీకి ఫోన్లోంచి ఇన్సల్టు పరంబగునప్పుడు నోటికి మాట లోపించి కంటికి నీరాదేశంబగును. అని ఒక సూత్రం తట్టింది. టక్కున ఫోను పెట్టేశాను.

నా మోకాలి మీద పదమూడంగుళాల గట్టి ఆబ్జెక్టుతో కొట్టిన దెవరా అని ఇన్‌వెస్టిగేట్ చేసాను. డైనింగ్ టేబుల్ కింద ఓ రెండేళ్ళ పసి వెధవ- నేనెప్పుడూ చూడనివాడు- కాళీయ మర్దనం చేసిన బాలకృష్ణుడిలా నాకేసి చూస్తున్నాడు. వాడి చేతిలో పొడవైన దిట్టమైన గరిటొకటుంది.

ఇంతలో ఇంట్లో ఉన్న గోపెమ్మకి యమునా తీరంనించి వేణుగానం వినబడ్డట్టు బాల్కనీ లోంచి అంట్లు తోముతున్న చప్పుడు వినిపించింది. కుంటుకుంటూ బాల్కనీలో కెళ్ళాను.

"ఏవిఁటి అచ్చవమ్మా! ఇంటిల్లిపాదీ ఒళ్ళెరక్కుండా నిద్రపోతుంటే నీకు తలుపెవరు తీసారు? ఇంట్లోకెలా వచ్చావ్? ఆ టేబుల్ కింద వాడెవడు? వాడికీ నీకూ ఏవిఁటి సంబంధం?" అన్నాను ఆవేశంగా.

"మాటలు తిన్నగా రానీండమ్మాయ్. నాన్నిప్పులాంటి దాన్నమ్మోయ్. నా వొంసీకవేఁ నిప్పు. మీకు తెల్దేవోఁ. అయినా ఎవుడాడు టేబిల్కింది వుండాకోరు? తేల్చేద్దాం పదండి ఆడసలెవురికోసం వొచ్చిడో!" వీరావేశంతో దబా దబా అడుగులేసుకుంటూ లోపలికొచ్చింది అచ్చమ్మ.

టేబుల్ కింద తొంగి చూసి, "ఈ బాబా? అదరగొట్టేసారు కదమ్మా!" పొట్ట పట్టుకుని పగలబడి నవ్వింది. "ఈ పిల్లోడు పక్క పిలాట్లో ఇందీవోళ్ళ మనవడండి" అని చెప్పింది లాఫింగ్ ఫిట్ పూర్తిగా తగ్గాక.

"ఇందాక నేను బెల్లు కొట్టంగానే తవఁరి తమ్ముడుగోరు కప్పుకున్న దుప్పటితో సహా దెయ్యంనాగొచ్చి కళ్ళు తెరవకుండానే తలుపు తెరిసీసారమ్మా. నాను లోపలికొచ్చీతప్పుడీ పిల్లోడు నా ఎనకమాలే దూరాడుగావున్ను సూడ లేదండమ్మా" మిస్టరీ విడగొట్టి అంట్లు తోముడు కంటిన్యూ చేసుకుంది.

నేను బల్లకింది పిల్లాడ్ని వాడి చేతిలోని పదమూడంగుళాల దిట్టమైన గరిటతో సహా క్యాప్చర్ చేసి బయటకు లాక్కెళ్ళా. వాళ్ళ బామ్మ కాబోలు గుమ్మం ముందు యశోదమ్మలా నిలబడుంది. వాడ్ని చూడగానే. "అరె మున్నా! కిధర్ గయారే?" అంటూ వాడ్నెత్తుకుంది.

"ఇంత చిన్న బచ్చాకు ఇంతింత బడబడా గరిటా కైకూ దియా? దేఖో ఇస్‌నే ఇస్‌కో మార్‌డాలా" అన్నాను వాడి గరిటకేసీ నా మోకాలు కేసీ చూపిస్తూ.

"మార్‌డాలా?" అందావిడ.

"అవును, మార్‌డాలా. మీకు బోల్‌కుండా మా ఇంట్లో దూర్‌గయాడు అవుర్ ఇస్‌కో మార్‌డాలా." అన్నాను మళ్ళీ మోకాలు చూపిస్తూ.

'దూర్‌గయా? మార్‌డాలా?" అందావిడ.

చచ్చాం. నేనన్నమాటనే ప్రశ్నార్థకాలు పెట్టి రిపీట్ చెయ్యడవే గొప్ప సంభాషణ అనుకుంటోంది కాబోలు ఈ మహాతల్లి.

"ఇత్‌నా ప్యారా బచ్చా! మార్‌డాలా?" అంది నమ్మలేకపోతున్నట్టు.

"అవునవమ్మా. ప్యారాబచ్చానే. కాకీకా మన్‌మడు కాకీ కోహీ ముద్దాతాహై" అన్నాను మోకాల్నెప్పి నెత్తికెక్కుతుంటే.

చెప్పాగా నేను ఫుల్‌స్టాప్ పెట్టిన చోటల్లా ఆవిడ క్వొశ్చిన్ మార్కు పెడుతుందని?

"కాకీ? కౌన్ కాకీ? ముద్దా క్యాహై? ఔర్ ఏ మన్‌మాడ్...."

"కిధర్‌హై?" వెటకారంగా ఆవిడ ప్రశ్న పూర్తి చేసాను. వీలయినంత విసవిసా కుంటి ఇంట్లో కొస్తుంటే మొహం మీద పిడుగులా న్యూస్ పేపరు పడింది. ఇంక నాకు పూర్తిగా పూనకం వచ్చేసింది.

పేపర్‌ని లాఠీలా చుట్టి పట్టుకుని ఇంట్లో కొచ్చాను. అర్ధరాత్రి దాకా టీవీలో అడ్డమైన ఛండాలాలూ చూసారు కాబోలు నా సోదర రత్నం నాని, నా పుత్ర రత్నం సత్రకాయ్ కార్పెట్‌మీద ఏ మొండేనిది ఏ తలో, ఏ కాళ్ళో తెలియకుండా కలగా పులగం అయిపోయి పడి నిద్రపోతున్నారు. పేపర్ లాఠీతో ఇద్దర్నీ పటపటా వాయించేసాను కసిదీరా.

దున్నపోతుమీద వానజల్లు కురిపిస్తే మబ్బుకెంత అవమానం జరుగుతుందో నాకూ అంతా జరిగింది. ఒక్కడు కదల్లా.

మళ్ళీ టెలిఫోన్ గోలెట్టింది. "హల్లో" అనగానే "మత్తుడాక్టరుగారున్నారాండీ?" అనడిగిందో గొంతు. మా నానిగాడు ఎనస్తటిస్ట్ - తెలుగులో ముద్దుపేరు 'మత్తుడాక్టరు'. "ఉన్నారండీ, మీరలాగే లైన్లో నుంచోండి" అన్చెప్పాను.

జగ్గడు నీళ్ళు జగ్గుతో సహా వరుణ మిసైల్‌లా నాని మీదకి వదిలాను. వాడికి మత్తంతా వదిలి పెద్దగావు కేకపెట్టి లేచి కూచున్నాడు. "నీకే ఫోను. మాటాడు" అని నేను కూడా గావుకేక పెట్టి సీన్లోంచి నిష్క్రమించాను.

ఆ తరువాత నేను తయారవుతూ, బ్రేక్‌ఫాస్ట్ తయారు చేస్తూ, వంటింట్లోకీ టెలిఫోను దగ్గిరికీ పరుగులు తీస్తూ ఇంట్లో అందరి మీదా కేకలేస్తూ, ఏడేసి తరాలు కడిగిపారేస్తూ ఇల్లంతా ఓ కొలిక్కి తెచ్చాను. తుఫాను వచ్చి వెలిసినట్టు ఇల్లంతా ప్రశాంతంగా విలసిల్లింది. తుపాకి సౌండుకి చెదిరిన పిట్టలు మళ్ళీ కొమ్మమీద వాలినట్టు అందరూ డైనింగ్ టేబుల్ దగ్గర ఎసెంబుల్ అయ్యారు "కాఫీయో రామచంద్రా" అంటున్న మొహాల్తో.

వేడి వేడి కాఫీలు బల్లమీద పెట్టేసరికల్లా మళ్ళీ టెలిఫోను మోత. ఈసారి మా ఆయనెత్తారు. పది సెకన్లు ఫోన్లోవిని, 'ఇది మీరు కూడా వినండి' అన్నట్టు మాకు సైగ చేసి స్పీకరు బటన్ అలా సుతారంగా నొక్కారు.

"..... అదన్నమాటండి. మీ పేషంటల్లా కెవ్వున కేకెట్టేనరికి వెంటలాన్ప్రతి నెంబరుగాన్నొక్కేసేనేవెూనని మా చెడ్డ అనుమానం వేసేసిందండి. పాతకాలం నాటి శారద సినీమాలో శోభన్‌బాబులాగా తవఁరు కూడా ఓ పేషంటునింట్లో అట్టే బెట్టేసుకుని ట్రీట్‌మెంటిచ్చేస్తన్నారేంటండి డాక్టర్‌గారూ?" అంటోంది దూరవాణిలో అశరీరవాణి.

నేను బిగుసుకు పోయాను. నాని, సత్రకాయ్ పలకమారి పోయేలా నవ్వుతున్నారు ద్రోహులుఁ

"అబ్బెబ్బే. ఆవిడ పేషంటను కున్నావా? కాదోయ్ మా ఆవిడే. అప్పుడప్పుడలా కేకలూ అవీ పెట్టినా పాపం, ఏదో కొంచెం..... ఏదేవైఁనా పేషంటు కాదోయ్. సాక్షాత్తూ మా ఆవిడ.' శ్రీవారి ఉవాచ! అవతలివాడెలా అర్ధం చేసుకుంటాడో ఎవరైనా ఊహించగలరు.

సొంత భార్యకింత ద్రోహం చేసే భర్తలుంటారంటే మీరు నమ్మకపోవచ్చు. కానీ ఉన్నారు. ఇది పచ్చినిజం.

"అయ్ బాబోయ్! అలాగాండీ? అయ్యో పాపం! కానండీ శారద సినిమాలో అయితే శారద శోభన్‌బాబు పెళ్ళాం కాదండి. జయంతండి. కానీ మీ ఇంట్లో ఇదేంటండి బాబూ.... పెళ్ళావూఁ..... పేషంటూ.... సారీ అండీ...."

ఇంకా ఏదేదో వాగుతున్నాడు ఫోన్లో గొంతు. దొరికితే నులిమెయ్యకుండా వదల్ను.

సత్రకాయి, నానీ కంటికి కడివెడుగా కన్నీళ్ళు కారునవ్వా మరీ నవ్వుతున్నారు. ఇల్లాలి అవమానాన్ని చూసి తోడి కోడలు నవ్వితే ఎంత కోపం వస్తుందో తమ్ముడు నవ్వినా అంతే కోపం వస్తుందని మరో సంసార సూత్రం తయారు చేసాను.

"నాకవమానం జరిగితే నీకు నవ్వొస్తోందిట్రా? తక్షణం నా ఇంట్లోంచి ఫో. నువ్వునాకు తమ్ముడివీ కాదు నేన్నీకు అక్కనీ కాదు. ఫో." అరిచాను - మా ఆయన మీద కోపం ఆయన బామ్మర్ది మీద చూపిస్తూ.

'ఆ టిఫినేదో పెట్టేయ్. తినేసి అన్ని బంధాలూ తెంచుకుపోతా" అన్నాడు వాడు.

నేను పెన్‌డౌన్ స్ట్రయిక్ చేసి అలక పాన్పెక్కాను.

"నువ్వు పెట్టకపోతే వేఁం పెట్టుకు తినలేవమా?" లాకౌట్ ప్రకటించి ఎవరి క్కావాల్సింది వాళ్ళు పెట్టుకు తినేసి ఎవరి దారిన వాళ్ళు చక్కాపోయారు.

అవినీతి పరుడైన యూనియన్ లీడర్లా అచ్చమ్మ నా మంచం పక్కన చేరింది.

"అసలు తమ్ముడు గోరొచ్చినప్పట్నించీ సూత్తన్నానండి. ఆరి ముందర గొప్ప సూపిచ్చు కోటాకి అయ్‌గోరు తవఁర్ని తీసి పారేయటం, తమ్ముడు గోరింకో రెండు పుల్ల లెయ్యటం! తవఁర్ని సూత్తంటే మాసెడ్డ జాలేత్తందండి" అగ్నిలో అంత ఆజ్యం పోసింది పరిస్థితిని ఫణంగా మార్చుకోవాలని. (సిట్యుయేషన్ క్యాష్ చేసుకోవాలని).

"అందరి రోగాలూ కుదురుస్తా. తమ్ముడు గోరికీ వాడి అక్కమొగుడికీ నా తడాఖా చూపిస్తా." అన్నా టీవీలో ఆడ విలన్‌లా పోజుపెట్టి.

నాలో పగ గాడిపొయ్యిలా రగులుకు పోతోంది. ఈ బావా బావమరుదులు కలిసున్నంత కాలం నాకీ అవమానాలు తప్పవు. వీళ్ళిద్దర్నీ ఎలాగైనా విడదియ్యాలి. దానికొకటే మార్గం - నానిగాడి మెడకో గుదిబండని కట్టబెట్టి నీ అద్దెకొంపలో నీ కాపురం నువ్వు వెలగబెట్టుకోరా అని తరిమెయ్యడం! వాడికి పెళ్లి చేస్తేగానీ నా పగ చల్లారదు!

నా వాటా టిఫిను కూడా అచ్చమ్మకి పెట్టేసి పంపించేసాను. బాగా ఆలోచించి పుట్టింటికి ఫోన్ కొట్టాను. అవతల ఫోను తీసిన వాళ్ళెవరో వినిపించుకోకుండా "అమ్మా!" అని ఆవేశంగా అరిచాను ఆడ శివాజీ గణేశన్‌లా.

"అబ్బ! ఏవిఁటే తల్లీ ఆ అరుపు? నేను నాన్నని. అసలే అర్భకుడ్ని"

"సరే. నాన్నా! నాన్నా... నాన్నా...." అంటూ అరిచాను. ఈసారి శివాజీ గణేశన్ ఎఫెక్ట్ సరిగ్గా కుదరక శోభన్‌బాబుగా తర్జుమా అయిపోయింది.

"ఆవేశం వద్దూ. అసల్సంగతి చెప్పు."



"అర్జంటుగా తమ్ముడికి పెళ్ళి చేసెయ్యి నాన్నా. వాడికి కాఫీ టిఫిన్లు నవ్లంయి చెయ్యలేక చస్తున్నాను. నడుంపడిపోతోంది. ఏదో, వాడిమెళ్ళో ఆ మూడు ముళ్ళూ పడిపోతే వాడి అద్దింట్లో వాడుంటాడు. వాడిపెళ్ళాం వాడికి కాఫీ టిఫిన్లు పెట్టుకుంటుంది. పైగా మా అన్యోన్య దాంపత్యం చూసి వాడు కుళ్ళిపోయి కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నాడు కూడానూ. ఓ పిల్లన్చూసి ముడెట్టెయ్యండి" అన్నాను.

"అది మా తరంకాలేదు గనకనే మీ ఊరు ట్రాన్స్‌ఫర్ చేయించి పంపేసా" అన్నారు నాన్న. గవర్నమెంటు డాక్టర్‌కి పెళ్ళి చెయ్యడం కన్నా ట్రాన్స్‌ఫర్ చేయించడం సులభం కాబోలని కొత్త సూత్రం తట్టింది.

"అంటే? మీ గుండెల మీది కుంపటిని నిర్దాక్షిణ్యంగా నా నెత్తిమీదకి ట్రాన్స్‌ఫర్ చేసేసారా? అన్యాయం నాన్నా."

"అలా కాదే. నువ్వూ అల్లుడు గారూ పూనుకుంటే గానీ అవదే తల్లీ. బాబ్బాబు ఆ పుణ్యం కాస్త నువ్వే కట్టుకోవే తల్లీ" బతిమాలారు.

"ఊఁ. సరే. ఆ పాపం నేనే కట్టుకుంటా చూస్తూండు" టక్కున ఫోను పెట్టేసి మళ్ళీ ఎత్తాను. నా ఫ్రెండు వెంకటలక్ష్మి నంబరు నొక్కాను.

"మా తమ్ముడికి సంబంధాలు చెప్పు" అన్నాను.

అది ఫోను పగిలేలా నవ్వింది.

"ఈ రోజుల్లో ఇలా వాళ్ళూ వీళ్ళూ సంబంధాలు చెప్పడాల్లేవు. బ్యూరోలుంటాయి. వాటికెళ్ళాలి. అక్కడ చెప్తారు" అంది.

"బ్యూరోలా? అవెక్కడుంటాయి. ఎలా ఉంటాయి?" అడిగాను.

ఓ ఎడ్రసు చెప్పింది.

మర్నాడు మా మెంటల్‌నీ, మత్తునీ,




సత్రకాయినీ బయల్దేరదీసాను. వెంకట లక్ష్మిచ్చిన ఎడ్రసు వెతుక్కుంటూ పోయాం. "ఇన్నాళ్ళకి ఈ ఊళ్ళో ఎడ్రసు ప్రకారం ఇల్లుంది" సంబరపడుతూ కారాపారు మా ఆయన. "పేరయ్యాస్ మేరేజ్ బ్యూరో" బోర్డ్ చదివి. "శుభం" అంటూ లోపలికెళ్ళాం.

లోపల బీరువాల్నిండా ఫైళ్ళున్నాయి. కొందరు వయసుమళ్ళిన తెల్లజుట్లవాళ్ళు ఫైళ్ళ దొంతర్లు ముందేసుకుని స్టడీ చేస్తున్నారు. "రిసెర్చి స్కాలర్లేమో పాపం!" అన్నాను వాళ్ళని చూసి. "కాదండి. ఆ ఫైళ్ళల్లో సంబంధాలుంటాయి. వాళ్ళ పిల్లలకోసం వెతుక్కుంటున్నారు." అంటూ వచ్చారు పేరయ్యగారు. "మీరూ రిజిస్ట్రేషన్ చేసుకుంటే మీకూ సంబంధాలొస్తాయి. పదండి" తొందరపెట్టి మా చేత ఫీజుకట్టించాడు.

మత్తుగాడి జీవిత చరిత్రని ఒక ఫామ్‌లో నింపి దాన్నో ఫైల్లో పెట్టాడు. వాడికో కోడ్ నంబరిచ్చాడు. "ఇకనుంచీ ఇక్కడ నీ నంబరిదన్న మాట" అన్నాడు మహోపకారం చేస్తున్నట్టు. వాడి మెళ్ళో ఒక ఐడెంటిటీ బిళ్ళ కూడా వేస్తారేమోనని ముచ్చటపడ్డాను. కానీ ఈ బ్యూరోలో ఆ సదుపాయం లేదుట.

"అమ్మా, అబ్బాయి డాక్టరు కదా డాక్టరు సంబంధాలే చూస్తారా?" ప్రశ్నించాడు పేరయ్య.

డాక్టర్లు డాక్టర్లనే చేసుకోవాలి, టీచర్లు టీచర్లనే, స్టూడెంట్లు స్టూడెంట్లనే, పేషెంట్లు పేషంట్లనే చేసుకోవాలని కొత్తరకం కులాలు, కట్టుబాట్లు తీసుకొద్దామని ఈ బ్యూరో వాళ్ళు కుట్ర పన్నుతున్నారని నాకనుమానం వేసింది. ఇలాంటి కులగజ్జిని సమాజం లోంచి సమూలంగా నిర్మూలించాలనుకుని "మా కలాంటి పట్టింపు ల్లేవండి" అని విప్లవాత్మకమైన స్టేట్‌మెంటిచ్చాను.

"మరి చెప్పరేం? అమ్మాయ్! గర్వితా!" అని కేకెట్టాడు పేరయ్య.

ఓ ఫైళ్ళ కువ్వ విచ్చుకుంది. అందులోంచి బ్లాక్ టీషర్టూ, అంతకన్నా బ్లాక్ జీన్సూ తొడిగిన పొడుగాటి పిల్ల ఉద్భవించింది. బ్లాక్ మేజిక్‌లా!

"ఈ అమ్మాయి గర్వితి. పెళ్ళికూతురు. ఇంజనీరు!" అన్నాడు పేరయ్య గొప్పగా.

"చాలా మోడర్న్. తన సమ్మంధం తనే వెతుక్కోడానికొచ్చింది. ఇహిహి."అని కూడా అన్నాడు.

బ్లాక్‌మేజిక్ మా అందరికేసీ చాలా నిరసనగా, ఎంతో డిఫరెంట్‌గా, బోలెడు గర్వంగా చూసింది. "నాకు ఐ ట్వంటీ వచ్చింది!"అంది. టిక్ ట్వంటీ దెబ్బతిన్న బొద్దింకల్లా చిందుల్తొక్కుతాం అనుకుంది గాబోలు. మా ఫేసులు బ్లాంకు.

"మీరు ఎగ్జామ్స్ అన్నీ క్లియర్ చేసారా?" అడిగింది గర్విత మత్తుగాడ్ని.

వాడికసలు బుర్రలో క్లారిటీ మొత్తం గల్లంతయినట్టుంది. బుర్రని గుండ్రంగా ఊపాడు.

"మీదే బ్రాంచ్?" అంది మళ్ళీ కొమ్మమీది కొండముచ్చుని చూసినట్టు చూస్తూ.

మత్తుగాడికి నోరు పెగల్లేదు.

"అబ్బాయి డాక్టరమ్మా గర్వితా. మత్తు డాక్టరు" పేరయ్య చెప్పాడు.

"యు.ఎస్.లో నో స్కోప్, యు.కె. ట్రై చేస్కోండి" సలహా పారేసి సత్రకాయ్ వైపు తిరిగింది.

"నేను శాట్‌క్లియర్ చేస్తా. ఎమ్మెస్ చేస్తా. పిహెచ్‌డీ చేస్తా. జాబ్ చేస్తా." నాసిరకం






పొలిటీషియనెవడో పూనాడల్లే ఉంది. ఆపకుండా ప్రామిసుల్చేసాడు సత్రకాయ్.

గర్విత ఆలోచించింది. "ఫినిష్డ్ ప్రొడక్టులు బోల్డు మంది దొరుకుతున్నారు. ఈ రా మెటీరియల్ ఎందుకు?" అంది ప్రకాశముగా స్వగతం పలుకుతూ.

ఈసారి ఆ పిల్ల చూపు మా ఆయన మీద పడింది.

"ఇదుగో అమ్మాయ్! ఈ ప్రొడక్టు పూర్తిగా ఫినిష్డు. రీ సైక్లింగుక్కూడా పనికిరాదు. పైకెళ్ళు" అన్నాను అడ్డంగా నిలబడి. గర్విత నాకేసి గుర్రున చూసి మళ్ళీ ఫైళ్ళకింద కెళ్ళిపోయింది.

"కుదిరినట్టులేదే? పోన్లెండి. టీచరు సమ్మంధం ఉంది సమ్మతమేనా?" అన్నాడు పేరయ్య. మా జవాబు కోసం ఆగకుండా, "ఏమయ్యోయ్ బ్రహ్మయ్యా!" అని కేకేసాడు.

పంచె, కండువాతో గంభీరంగా వచ్చాడు - ఏమయ్యోయ్ బ్రహ్మయ్యగారు.

"వీరు తెలుగు పండితులు. వీరమ్మాయి పెళ్ళికుంది. ఫైళ్ళు వెతుక్కోడం ఎందుకు? ఏకంగా మాటాడేసుకోండి" ప్రోత్సహించాడు పేరయ్య.

"మా అమ్మాయి సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో ఎమ్మే పాసయింది. హిందీ టీచరుగా పని చేస్తోంది." అన్నాడు బ్రహ్మయ్యగారు మనదేశంలో చదువుకీ ఉద్యోగానికీ సంబంధం ఉండదని ఋజువు చెయ్యడానికి కంకణం కట్టుకున్న వాడికి మల్లే!

"బావుంది" అన్నానేను.

"కానయితే ఏవిఁటంటే, నాకూ మా అమ్మాయికీ కూడా నున్నా జాతకాల పట్టింపుంది" నో ప్రాబ్లెమ్. పర్సులోంచి మత్తుగాడి జాతకం కాపీని తీసి పవిత్రంగా అందించాను.

కుర్చీలో కుదురుగా సెటిలై జాతకాన్ని వీక్షించాడు బ్రహ్మయ్యగారు. మొహాన్ని విస్తారంగా విప్పార్చుకుని "ఆహా! ఓహో!" అన్నాడు. మా వదనాలు కూడా ఆనందంతో అరవిందాల్లాగా విచ్చుకున్నాయి. మత్తుగాడి వైపు అభినందిస్తూ చూసాం. వాడిదేదో చాలా మహజ్జాతకం కాబోలనుకున్నాం.

"ఈ జాతకం వ్రాసినాయన చూశారూ. జోతిషరత్న, ఆయనో మహాజ్ఞాని! మీ నాన్నగారు చాలా గొప్ప వ్యక్తి చేత రాయించారమ్మా మీ తమ్ముడి జాతకం. ఆహా! ఓహ!" అన్నాడాయన మళ్ళీ.

అదా సంగతి? హుఁ! నీరుగారి పోయాం.

"ఓహోహో! బాగు బాగు! భేషుగ్గా ఉంది." అన్నాడు ఈసారి జాతకం టైటిల్స్ కాకుండా మేటర్ చదివి.

మాలో కొత్త ఆశలు చిగురించాయి.

"ఓహ్! అర్రెర్రెర్రే!" అన్నాడాయన.

మేం కళవర పడ్డాం.

"అబ్బో! అబ్బో! ఆఁహాఁ?!"

మేం కూడా అబ్బురపడి అచ్చెరువొందాం.

"అబ్బెబ్బే. చాలా కష్టం. ప్చ్ ప్చ్ ప్చ్"

మాకు దుఃఖం పొంగుకొచ్చింది.

"ఆఁ? అమ్మో! అయ్ బాబోయ్! ఇది కూడానా?!"

మేం భయంతో వొణికి పోయాం.

నవగ్రహాలూ కలిసి జాతక చక్రం తిప్పుతాయని తెలుసుగానీ, అర రావుడు జాతకం కాయితంలోంచి ఇలా నవరసాలూ కురుస్తాయని ఇవాళే తెలిసింది.

"ఇక్కడ కొంచెం క్లిష్టంగా ఉంది. ఆలోచించాల్సిందే' బ్రహ్మయ్య గారు చూపుడువేలు చెవిలో దూర్చి శమనగా తిప్పుకుంటూ ఆలోచించాడు.

శ్రవణేంద్రియంలోంచి ఆ వేలు నాసికారంధ్రంలో క్కూడా వెడుతుందా వెళ్ళదా అని మేమంతా ఉత్కంఠతో ఊపిరిబిగించి చూశాం.

వెళ్ళలేదు. నిశ్వసించి నిట్టూర్చాం.

బ్రహ్మయ్యగారు కూడా నిట్టూర్చాడు. ట్టూర్చి, జాతకాన్ని నా చేతిలోకి జారవిడిచాడు. విడిచి, పెదవి విరిచాడు. మేం ఘొల్లుమనడం ఒకటే తక్కువ.

మా మత్తుగాడి జాతకంలో గొప్ప షేక్స్ పీరియన్ ట్రాజెడీ దాగుందని ఇన్నాళ్ళూ తెలియనే లేదు. అందరం రెండు నిముషాల పాటు మౌనం వహించాం.

"మరమ్మా ఈ జాతకం మా అమ్మాయికి పడదమ్మా" అన్నాడాయన ఫైనల్‌గా.

"మాక్కూడా అసలు హిందీ టీచర్లాట్టే పడరు లెండి." అన్నాన్నేను.

వారివ్వం అన్నారు. మేం చేసుకోం అన్నాం. ఒదిలిపోయింది.

"రెండు వికెట్లు పడ్డాయి. రన్నులు నిల్లు" అన్నాడు సత్రకాయ్.

నాకు ఉక్రోషం వచ్చింది. పగ తీర్చుకోవాలని పెళ్ళి తలపెడితే ఈ మత్తుగాడి పెళ్ళి నా ప్రెస్టీజ్‌కి ప్రశ్నయిపోయిందే!

"అసలిది కాదు పద్ధతి" అన్నాను - మరేదో తెలియకపోయినా! "సరే ముందు ఇంటికిపోయి ఇంత కతుకుదాం. అదే అతుకుతుంది" కారెక్కి పాలోమని మళ్ళీ ఇంటికొచ్చాం.

"పొద్దున్నించీ పేషెంట్లకి నా మొహం



చూపించలేదు. పాపం బెంగెట్టుకుంటారు. ఓసారి వెళ్ళొస్తాను" అంటూ హాస్పిటల్‌కెళ్ళిపోయారు మా మెంటల్ డాక్టర్.

మత్తుగాడు మాత్రం ఏదో పెద్ద గండం నించి బైట పడ్డవాడిలా మొహం పెట్టుకుని హాలీడే ఎంజాయ్ చేస్తానని కొంపలోనే ఉండిపోయాడు.

ఓ పావుగంట గడిచిందో లేదో పక్కింటి హిందీ కాకీ (పెద్దమ్మ) కంగారు కంగారుగా పరిగెత్తుకొచ్చింది "మేరీ బేటీ... సాబ్ కీ పేషెంట్" ఏడుస్తూ ఏదేదో చెప్తోంది. ఏదో ప్రమాదం జరిగిందని గ్రహించి వాళ్ళింట్లో కెళ్ళాం. ఆవిడ కూతురు - మున్నాతల్లి - ఏదోలాగా అయిపోయి, చాలా అవస్థపడుతూ పడి ఉంది.

"నా కూతుర్ని ఆస్పత్రిలో మీ ఆయనే ట్రీట్ చేస్తున్నారు చాలా కాలంగా. నిన్ననే వెళ్ళి చూపించుకుని మందులు తెచ్చుకుంది. ఇవాళ ఇలా అయింది" ఏడుస్తూ ఆవిడ చెప్పినదాని సారాంశం అది.

"ఇదేదో డ్రగ్ రియాక్షన్‌లా ఉంది" అన్నాడు మత్తుగాడు టెన్షన్‌తో బిగుసుకుపోయి.

"మీ బావేగా మందులిచ్చిందీ హాస్పిటల్‌కి తీసుకుపోదాం పద. రియాక్షన్ సంగతి కూడా ఆయనే చూస్తారు. పద. నీ కారు తియ్" ఫీల్డ్ మార్షల్ లెవెల్‌లో చక చకా కమాండ్స్ ఇచ్చాను.

నేను, మున్నా తల్లి, అమ్మమ్మ, చేతిలో పదమూడంగుళాల పొడవున్న గరిటతో సహా మున్నాగాడూ కారెక్కాం. హాస్పిటల్ చేరాం.

"మన సారు లేరమ్మా. పెద్ద సారుతో మీటింగ్ కెళ్ళారు. డాక్టరమ్మ చూస్తోంది ఓ.పి" చెప్పాడు గుమ్మం దగ్గర వార్డు బోయ్.

లోపల ఓపిగ్గా ఓపి కండక్ట్ చేస్తోంది ఒక 'డాక్టరమ్మాయ్'. ఆ అమ్మాయి మున్నా తల్లికి చెయ్యవలసిన వైద్యం అంతా చేస్తుంటే, చేసేదేం లేక ఖాళీగా కూచుని కళ్ళప్పగించి ఆ అమ్మాయినే చూస్తూ కూచున్నా.

చూసే కొద్దీ ఆ పిల్ల నెక్కడో చూసినట్టు డిజావూ ఫీలింగు బుర్రని పురుగు దొలిచినట్టు దొలిచేసింది. ముఖ్యంగా తను మాటిమాటికీ ముక్కెగబీల్చి, అప్పుడప్పుడు ఓవరాల్ స్లీవ్‌కి ముక్కు రాసేసే ఆ అలవాటు చూస్తుంటే అబ్బా బాగా తెలిసిన పిల్లే, గుర్తుకురావట్లేదు అని గిలగిల లాడిపోయాను.

తంటాలు పడి మున్నాతల్లిని మామూలు స్థితికి తీసుకొచ్చింది డాక్టరమ్మాయ్. మేం అందరం రిలీఫ్‌తో తేలిగ్గా నిట్టూర్చాం. ఆ అమ్మాయి దీర్ఘంగా ముక్కెగ బీల్చింది. చటుక్కున నా రుమాలు ఆ అమ్మాయి చేతిలో పెట్టాను "పాపం. హాస్పిటల్‌కొచ్చే హడావిడిలో కర్చీఫ్ మర్చిపోయారు గాబోలు" అన్నా. అప్పుడామ్మాయి నా మొహంలోకి తేరిపార చూసింది.

"హాయ్ దీదీ!" సంబరంగా చిన్న కేకపెట్టింది. ఆఖరి సీన్లో జ్ఞాపక శక్తి తిరగొచ్చేసినట్టు నాకామ్మాయ్ గుర్తొచ్చేసింది. చిన్నప్పుడు ఏలూర్లో ఇంటి పక్క హిందీవాళ్ళ పిల్ల! నాకంటే బాగా తెలుగు మాటాడ్తుంది.

"హాయ్ రీతూ! నువు డాక్టరు వెప్పుడయ్యావ్?"

"ఈ మధ్యనే"

"మెంటల్ డాక్టరు వెప్పుడయ్యావ్?"

"రీసెంటుగానే"

"వీడు మా నాని. గుర్తున్నాడా?" అడిగాను మత్తుగాణ్ణి చూపిస్తూ.

"అరె! నానీనే! పిచ్చి పిచ్చిగా ఉండేవాడు. ఇప్పుడూ అంతేనా?"

నా బుర్రలో పెద్ద ఫ్లాష్ వెలిగింది.

"కొంచెం ఇసింటా రామ్మా రీతూ" ట్రీను వెనక్కి పిలిచాను. వచ్చింది.

"నాని పిచ్చికుదురుస్తావా సైక్రియాట్రిస్టువిగా?" అన్నాను.

ఆందోళనతో నా మొహంలోకి చూసింది.

"పెళ్ళికుదిరితే గానీ పిచ్చి కుదరదు కదా మరి?" అన్నాను.

అనుమానంగా చూసింది. "ఫో దీదీ... నువ్వేదో ఆటపట్టిస్తున్నావ్" అంది.

"నీక్కూడా ఉన్నట్టుంది వేపకాయంత! అర్థం చేసుకోవేం? విల్ యూ మ్యారీ మై బ్రదర్?" అన్నాను.

అలా అడిగేముందు రోమియో లాగా ఒంటి మోకాలి మీద కూచుని చేతులు అడ్డంగా చాచుదామా అని ఓ క్షణం ఆలోచించాను. అసలే కీళ్ళ నొప్పులు! తీరా 'నా పెళ్ళయి పోయింది దీ దీ' అంటే? లేచి, అక్కణ్ణించి ఫేడౌట్ అవడానికి టైమ్ పడుతుందని నిల్చునే అడిగేశా.

"దీదీ, నీకు పాత తెలుగు సినిమాలు ఇష్టం కదూ?" అడిగింది రీతూ.

"సో వాట్?"

"ఆ పాత సినిమా స్టైల్లోనే జవాబు చెప్తా చూస్కో" నాలుగడుగులు వెనక్కివేసింది. చేతుల్లో మొహం దాచుకుని 'ఛీ. ఫో. దీదీ!" అంది వేళ్ళ సందుల్లోంచి కొంటెగా చూసి.

"ఒరేయ్ మత్తూ, నీ పెళ్ళి కుదిరిపోయిందిరా" అన్నాను ట్రీనివతలకొచ్చి. మహా సంతోషంగా అక్క పాత్రలో జీవించేస్తూ.

ఆనందోత్సాహావేశాలు నిండిన ఆ అద్భుత క్షణంలో... పదమూడుంగుళాల పొడవున్న గట్టి చిప్ప గరిటతో మా మత్తుగాడి కాల్చిప్ప పగిలేలా ఒక్కటిచ్చాడు మున్నాగాడు.

ఆస్పత్రి అదిరిపోయేలా గావుకేక పెట్టాడు మత్తుగాడు.

తెల్లటి డ్రెస్సుల్లో యమకింకరుల్లాంటి వార్డుబోయ్ లిద్దరొచ్చి మత్తుగాడి చెరో రెక్కా పట్టుకున్నారు. ఈడ్చుకెళ్ళి బెల్టులతో స్ట్రెచ్చర్‌కేసి కట్టేసారు.

దెబ్బకి మా తమ్ముడి 'పెళ్ళయింది'....!


బుడుగుల్రావు
సత్యమూర్తి
నాన్నగారు నాకు చెప్పకుండా ఈ టీ-షర్టుని కొన్నారు. ఈ మోడల్ నాకస్సలు నచ్చదు.
నాకు నచ్చక పోతే వాపస్ తీసుకుంటానని మా నాన్నగారితో అన్నారుట కదా
అవును సార్. మీరు నిజంగానే వాపస్ చేస్తున్నారా ?!
అవును
సేల్స్ మేన్
యాహ్హూ!!! ఇది నేను కొనేసుకుంటాను. ఈ మోడల్‌వి ఇక ముందు దొరకవుట
ఇంతసేపూ వద్దనుకున్నాను కానీ నీకిచ్చేసేకా అనిపిస్తోంది. మా నాన్నగారు ఎంతో ప్రేమతో కొనిచ్చారు. ఆయన కోసమైనా వేసుకోవాలి
ఇచ్చేయ్
SATYAMURTY
ఇదొక్కటే మిగిలిన మోడల్‌ట. ఎవరి దగ్గరా లేని టీ-షర్ట్‌ని నేను వేసుకుని ప్రియశ్రీకి కనిపిస్తే నన్ను మెచ్చుకుంటుంది కదా?
WELCOME
ఆ టీ-షర్టుని భలేగా అంటగట్టేను. ఈ టీ-షర్ట్ కోసం ఇంకో బకరాని వెతకాలి. ఇదే సేల్స్‌మేన్‌షిప్ అంటే

# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం. చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

## ఎంత అందమైనవమ్మ



ప: ఎంత అందమైనవమ్మ ఈ జీవిత దీపాలు
పెనుచీకటి ఎదవీణలు పలికించే రాగాలు
1.చ॥ ప్రతి భావం ఒక దీపం ప్రతి రాగం ఒక దీపం
పూలలో నవ్వులలో విరిసే అందమే ఒక దీపం ॥ఎంత॥
2.చ॥ నా కన్నుల నీ రూపం ఒక దీపం ఒక దీపం
లేవెన్నెల గుసగుసలో ఒక దీపం ఒక దీపం
కోరికలో తారకలో మెరిసే ఆనందమే ఒక దీపం
3.చ॥ సమజీవనమొక దీపం సహనశీలమొక దీపం
ప్రగతి రీతొ ప్రకృతి రీతొ మురిసే ఆంతర్యమే ఒక దీపం ॥ఎంత॥

| | |
|---|---|
| రచన | : డా॥ ఆచార్య తిరుమల |
| గానం, సంగీతం | : శ్రీమతి సి.ఇందిరామణి -బృందగానం |
| రాగం | : రేవతి - బైరాగి భైరవ్ (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి మ ప ని స |
| అవరోహణ | : స ని ప మ రి స |
| తాళం | : త్రిశ్రగతి (కర్ణాటక సం॥) |
| దాద్రా | : దాద్రా (హిందుస్తాని సం॥) |

షడ్జము, శుద్ధరిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

భక్తి, వైరాగ్య, విరహ, విషాదాలకు అనువైనది రేవతిరాగం. లలిత శాస్త్రీయ, లలిత సంగీతాలలో యీ రాగం ఎక్కువగా వినియోగించబడుతున్నది. వేదపఠనంలో ఉదాత్త, అనుదాత్త, స్వరితాలుగా ని, స, రి అనే యీ రాగంలోని స్వరాలు ఉపయోగించబడతాయి. కనుక యీ రాగంలో ఒక పవిత్రత గోచరిస్తుంది. హిందుస్తాని సంగీతంలో యీ రాగాన్ని బైరాగి భైరవ్ అని, బైరాగి అని పిలుస్తారు. లలిత సంగీతంలో యీ రాగంలో కూర్చబడిన పాటలు ఎన్నో వున్నాయి. ఆకాశవాణిలోను, చలనచిత్రాలలో ఎంతోమంది సంగీత దర్శకులు యీ రాగంలో స్వరపరచిన గీతాలు బహుళ జనాదరణకు నోచుకున్నాయి.

సమత, మమత, సహనశీలత వంటి మానవతత్వపు విలువలు మనిషి జీవితాన్ని కాంతివంతం చేసి, తోటి వారిని ప్రభావితం గావించి జాతి ప్రగతికి దోహదం చేస్తాయి. అటువంటి జీవనం సార్థకమవుతుందని చాటిచెప్పే తిరుమల గారి 'ఎంత అందమైనవమ్మ యీ జీవిత దీపాలు' అనే గీతానికి చక్కని బాణీని రేవతి రాగంలో కూర్చి శ్రీమతి ఇందిరామణి బృందగీతంగా ఆ పాటను పాడించారు.

## శ్రీమతి ఇందిరామణి

తిరుపతి వాస్తవ్యులైన శ్రీ చివుకుల సుబ్రహ్మణ్యం, శ్రీమతి సుబ్బరత్నమ్మ గార్లకు జన్మించిన శ్రీమతి ఇందిరామణి తొలుత సంగీత విద్యను తన తండ్రి గారి వద్ద అభ్యసించి, ఆ తరువాత సుప్రసిద్ధ కర్ణాటక సంగీత విద్వాంసులు శ్రీ చిత్తూరు సుబ్రహ్మణ్యం పిళ్ళై, శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ గార్ల వద్ద శిక్షణ పొంది మంచిగాయనిగా పేరు తెచ్చుకున్నారు. ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో కర్ణాటక సంగీతంలో ఆడిషన్ టెస్టులో ఉత్తీర్ణురాలై ఎన్నో కచ్చేరీలు చేస్తూండేవారు. ఆమె సోదరి శ్రీమతి పి.ఎస్.లక్ష్మి గారు గోటు వాద్యంలో విద్యన్మణిగా ప్రసిద్ధి చెందారు. తిరుపతిలో వుండడం చేత ఇందిర గారు అన్నమయ్య సంకీర్తనలు గానం చేయడంలో విశేష కృషి చేశారు. తరచూ తిరుమలలో స్వామి వారి బ్రహ్మోత్సవాలలో ఆమె అన్నమయ్య సంకీర్తనలు గానం చేస్తూండేవారు. ఆమె కుమార్తె సి.పద్మజ (వివాహానంతరం శ్రీమతి పద్మజ శౌంరి), హైదరాబాదులో ఆకాశవాణిలో మంచి గాయనిగా పేరు గాంచినది. నేను కూడా పద్మజ చేత కొన్ని పాటలు ఆకాశవాణిలో పాడించాను. నా సంగీతంలో 'నయనాలకు సుందరబిందువు' అనే గీతాన్ని ఆమె పాడగా 'ఈమాసపు పాట'గా ప్రసారమైంది ఆకాశవాణిలో. ఇందిర గారి భర్త శ్రీ



### రేవతి/బైరాగి రాగాల ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. ఝుమ్మంది నాదం | సిరిసిరిమువ్వ | సుశీల, బాలసుబ్రహ్మణ్యం | కె.వి.మహదేవన్ |
| 2.వేదంలా ఘోషించే గోదావరి | ఆంధ్రకేసరి | బాలసుబ్రహ్మణ్యం | సత్యం |
| 3. మానసవీణా మధుగీతం(కొంతభాగం) | పంతులమ్మ | సుశీల, బాలసుబ్రహ్మణ్యం | రాజన్ - నాగేంద్ర |
| **హిందీ** | | | |
| 1. యే దునియా ఇక్‌దుల్హన్ యే మేరే ఇండియా | పర్‌దేశ్ | కవితా కృష్ణమూర్తి, హరిహరన్ | |

ప॥ పా ని | స రి స | ని స ని | ప ప మ | పా మ | రి రి స | నీ రి | స సా |
ఎం త | అం . ద | మై . న | వ . మ్ము | ఈ జీ | . వి త | దీ పా . లు |

స రి మ | , రి స | రి మ ప | , ప మ | మ ప ని | , ని ప | ప ని స | , సా
పె ను చీ | . క టి | ఎ ద వీ | . ధు లు | వె లి గిం | . చే . | రా . గా | . లు

1.చ॥ ప ని స | , సా | స ని రి | , రీ | రి మ రి | , రి స | ని ని రి | స సా |
ప్ర తి భా | . వం | ఒ క దీ | . పం | ప్ర తి రా | . గం . | ఒ క దీ | . పం |

స రి స | నీ , | ని స ని | ప పా | ని స ని | ప మ ప | ని ని ప | మా , |
పూ . ల | లో . | న . వ్వు | ల లో | వి రి సే | . . . . | అం . ద | మే . |

ప మ రి | , సా | , , , | , , , |
ఒ క దీ | . పం | . . . | . . . || ఎంత ||

2.చ॥ మా మ | , మ మ | ప ప మ | రి సా | స ని రి | , రీ | ప మ రి | , సా |
నా క | . న్నుల | నీ . రూ | . పం | ఒ క దీ | . పం | ఒ క దీ | . పం |

స రి మ | , మ మ | రి మ ప | ప పా | మ ప ని | , నీ | ప ని స | , సా |
తే . వె | . న్నెల | గు స గు | స లో | ఒ క దీ | . పం | ఒ క దీ | . పం |

రీ రి | రి రీ | మ మ రి | రి రీ | స స ని | ప ప ని | స ని ప | మా , |
కో రి | క లో | లా . రి | క లో | మె రి సే | . ఆ . | నం . ద | మే . |

ప మ రి | , సా | , , , | , , , |
ఒ క దీ | . పం | . . . | . . . || ఎంత ||

3వ చరణం మొదటి చరణం వలె పాడుకోవాలి.



చింతపూడి సుబ్రహ్మణ్యం గారికి కూడా సంగీతమంటే ప్రాణం. ఆయన అమిత ప్రోత్సాహంతోనే ఇందిరగారు సంగీతాన్ని ఒక తపస్సుగా భావించి ఎంతో కృషి చేస్తున్నారు. ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ఎన్నో లలిత, భక్తి, దేశభక్తి గీతాలకు ఆమె స్వరకర్తగా చక్కని కార్యక్రమాలను అందించారు. ఆకాశవాణిలో స్వరకర్తగా గుర్తింపు పొందిన ఆమె ఎందరెందరో గాయనీగాయకులచేత తరచూ పాడిస్తూంటారు. 1973లో 'రాగసుధ' అనే సాంస్కృతిక సంస్థను నెలకొల్పి వేదికలపై ఎన్నో కార్యక్రమాలు నిర్వహిస్తూ ఔత్సాహిక కళాకారులకు తగిన శిక్షణనిస్తూ ప్రోత్సహిస్తున్నారు. సంప్రదాయబద్ధమైన సంగీతంతో చక్కని బాణీలను కూర్చుతూ ఎంతోమందికి పాటలు నేర్పుతున్నారు. 'త్యాగయ్య', 'నౌకాచరితం', 'మా జానకి', 'శబరి మోక్షం', 'అన్నమయ్య గాంచిన కృష్ణుడు', 'సంగీత వాగ్గేయకారులు' మొదలగు సంగీత నృత్య రూపకాలను రూపొందించి వారి 'రాగసుధ' తరఫున ప్రదర్శించారు. 30 సంవత్సరాలుగా రాగసుధ త్యాగరాజ ఆరాధనోత్సవాలను నిర్వహిస్తున్నది ఇందిరగారి ఆధ్వర్యంలో. ఆమె ఎన్నో ఆడియో క్యాసెట్లను వెలువరించారు. డా॥వడ్డేపల్లి కృష్ణ, డా॥సి.నారాయణరెడ్డి, డా॥ఎం.పద్మినీదేవి, అడిదం పాపారావు, కృష్ణశాస్త్రి మొదలగు కవుల పలు రచనలకు ఆమె సంగీతం కూర్చారు. 'మహాలక్ష్మి మా తల్లి' అనే క్యాసెట్‌ను ఆమె తల్లి గారి వద్ద నేర్చుకున్న సంప్రదాయ భక్తి గీతాలతో రూపొందించి ఆమె గానం చేసి ఇటీవలనే విడుదల చేశారు. అమెరికాలో సుబ్బారావు అకాడమీ ఆఫ్ ఇండియన్ ఆర్ట్స్ వారి 'మిలినీయం అవార్డు' 2002కి ఇందిరామణి గార్ని గౌరవించి 'సంగీత జ్యోతి అవార్డు'ను బహుకరించారు. సత్సంప్రదాయాలకు నెలవైన వారి కుటుంబంతో నాకెంతో సాన్నిహిత్యం వున్నది. ఈనాటికీ ఎంతోమందికి సంగీత శిక్షణనిస్తూ సంగీత సేవకే అంకితమైన ఆమె జీవితం ధన్యం. ■

క్లాసిక్స్ రీటోల్డ్

అలనాటి ఆణిముత్యాల గురించి
నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల




## ఆశ జీవిత శ్వాస

దుఃఖానికి కారణం ఆశ. ఆశ అంటే తృష్ణ - అంటే వాంఛ - అంటే కోరిక. ఇది చాలా పెద్దది. ఎంత పెద్దదో యీ శ్లోకం చెప్తూ వుంది.

గిరిర్మహాన్ గిరే రబ్ధిర్మహాన్ అబ్ధే ర్నభో మహత్
నభఅ స్యోపి మహద్రృహ్మ తతోఅ ప్యాశాగరీయసీ!!

కొండ పెద్దది. దానికంటె సముద్రం పెద్దది. సముద్రానికంటె ఆకాశం పెద్దది. ఆకాశం కంటె బ్రహ్మ పెద్దది ఆ (సృష్టికర్తయైన) బ్రహ్మకంటె ఆశ పెద్దది. ఏదో ఆశతోనేగా బ్రహ్మ సృష్టి చేసేది! అందుకే భాగవతంలో పోతన "ఆశాపాశము దా గడున్నిడుపు లేదంతంబు రాజేంద్ర!" అన్నాడు. అంతేకాదు,

ముదిసెను దంతావళియును
ముదిసెను కేశములు తనువు ముదిసెం దనకున్
ముదియనివి రెండు సిక్కెను
బ్రదికెడు తీపియును విషయ పక్ష స్పృహయున్!!

అన్నీ జీర్ణావస్థకు వచ్చినా బతుకు మీద, ధనాది విషయాల మీద ఆశ మాత్రం బలంగా వుందన్నాడు. ఇలాగే- భర్తృహరి

వలిభిర్ముఖ మాక్రాంతం- పలితైరంకితం శిరః
గాత్రాణి శిథిలాయతే- తృష్ణైకా తరుణాయతే!!

ముఖం ముడతలు పడింది. జుట్టు నెరిసింది. శరీరం బిగి సడలింది. కానీ ఆశ మాత్రమే పరువం చెడకుండా వుంది- అన్నాడు. ఇలాంటిదే మరో శ్లోకాన్ని శతశ్లోకి చెప్తూవుంది. వృద్ధాప్యంలో శరీరం శిథిలమై, తల నెరిసి, పళ్లూడి, కర్రతో నడవ వలసి వస్తున్నా ఆశ మాత్రం పాశంలా చుట్టుకుని విడిచి పెట్టటం లేదంటూ-

అంగం గళితం పలితం ముండం
దశన విహీనం జాతం తుండం
వృద్ధోయాతి గృహీత్వా దండం
తదపి నముంచ త్యాశా పాశం!! - అంది.

"ధనాశా జీవితాశాచ గుర్వీ ప్రాణ భృతాం సదా" అని ప్రాణులకి జీవితం పైన, ధనం పైన విశేషమైన ఆశ వుంటుంది. గమత్తేమిటంటే- ధనవంతులకే ధనం మీద ఆశ ఎక్కువగా వుంటుంది. ఆ విషయాన్ని యీ శ్లోకం ఇలా చెప్తూ వుంది-

ప్రాయః ధనవతామేవ ధనతృష్ణా గరీయసీ
పశ్య కోటి ద్వయాసక్తం- లక్షాయ ప్రవణం ధనుః!!

రెండు కోట్లు అంటే అగ్రాలు (చివర్లు) గల ధనుస్సు 'లక్ష్యం' కోసం వంగినట్లు రెండు కోట్లున్నవాడు లక్ష కోసం వంగిపోతాడని చమత్కారం. ఇక్కడ ధనుస్సు పరంగా 'కోటి' అంటే చివర, ధనవంతుని పరంగా కోటి రూపాయలు. 'లక్ష' అంటే లక్ష్యం, లక్ష రూపాయిలు. ధనవంతుడికే అంత ఆశ వున్నప్పుడు సామాన్యుడి సంగతి చెప్పాలా? 'ఆశాదేవి' కవితలో కొడాలి ఆంజనేయులు కవి-

"ఆమె విశాల దృగంతములందే
అణగి యున్న దీ అఖిల ప్రపంచమ్"
"ఈ భూమండల మంతా ఆబిడ
చరణచ్యుత రేణు నిభమ్" అన్నారు.

ఈ భూమంతా ఆశ యొక్క పాద రేణువుట! దీన్నుండి ఎవ్వరూ తప్పించుకోలేరు; ఆఖరుకి సన్యాసులు కూడా- ధూర్జటి కవి తన శతకంలో ఇలా అంటాడు.

చావం కాలము చేరువౌ టెరిగియున్ జాలింపగా లేక త
న్నే వైద్యుండు చికిత్స ద్రోవ గలడో యే మందు రక్షించునో
యే వేల్పుల్ గృపజూతురో యనుచు నిన్నింతైన చింతింపడా
జీవచ్ఛ్రాద్ధము జేసికొన్న యతియున్ శ్రీకాళ హస్తీశ్వరా!!

ఆత్మ పిండం పెట్టుకున్న వాడికి కూడా బ్రతుకుమీద ఆశ చావదని భావం. ఆశాబంధం చాలా చిత్రమైంది. దీనివల్ల బంధింపబడిన వారు పరుగులు తీస్తుంటే, ఈ సెంకెల నుండి విముక్తులైన వారు కుంటివారిలా చతికిల బడిపోతున్నారని-

ఆశా నామ మనుష్యాణాం- కాచి దాశ్చర్య శృంఖలా
యయా బద్ధాః ప్రధావంతి- ముక్తాః తిష్ఠంతి పంగువత్!!

అనే శ్లోకం మహా చమత్కారంగా చెప్తూవుంది. అందుకే "ఆశా సాగర పార మేరికిని శక్యం బౌనె చేరంగ" అని లక్ష్మణ కవి అంటే "ఆశా రాక్షసి కుక్షి దొడ్డ" దని దేవీ భాగవతం అంటే "ఆశల నెడు మంటలార్పతరమె" అని పానుగంటి వారన్నారు. "న తృష్ణాయాః పరోవ్యాధిః" ఆశని మించిన వ్యాధి లేదన్నారుపెద్దలు. భర్తృహరి మహాకవి-

ఆశా నామ నదీ మనోరథజలా తృష్ణా తరంగాకులా
రాగ గ్రాహవతీ వితర్క విహగా ధైర్య ద్రుమ ధ్వంసినీ
మోహావర్త సుదస్తరాతి గహనా ప్రోత్తుంగ చింతా తటీ
తస్యాః పారగతా విశుద్ధ మనసోనందంతి యోగీశ్వరాః!!

అని ప్రకటించాడు. అంటే- కోరిక అనే నీటితో, దప్పిక అనే కెరటాలతో, ప్రేమానుబంధమనే మొసళ్లతో, వితర్క (వాదం) మనే పక్షులతో, ధైర్యమనే వృక్షాల్ని కూల్చేసే, మోహమనే సుడిగుండాలతో, విచారమనే పెద్ద ఒడ్డుతో వుండే ఆశ అనే నదిని ఆవలి తీరానికి విశుద్ధ మనస్కులైన యోగీశ్వరులే దాటగలరని భావం." ఇంతకీ యీ 'ఆశ' అనే నది ఏమిటంటే- "క్రోధో వైవస్వతో రాజా- ఆశా వైతరణీ నదీ", కోపమే యమధర్మరాజు. 'ఆశ' నరకంలో ప్రవహించే వైతరణీ నది- అని మరో శ్లోకం వివరిస్తూ వుంది.

ఆశకు దాసులైన వారు లోకానికి దాసులవుతారు, ఆశ దాసియైన వారికి లోకమే దాసి అవుతుందని-

ఆశాయా దాసా యే దాసాస్తే సర్వలోకస్య
ఆశా దాసీ యేషాం తేషాం దాసాయతే లోకః!! అనే శ్లోకం తెల్పుతూవుంది.

ఈ శ్లోకార్థమే తెలుగులో

ఆసకు దాసుండెవ్వడొ
దాసుడగు నతండు సర్వ ధాత్రి చరులకున్
ఆస యెవనికిం దాసియొ
దాసులగును రెల్ల జనులు తథ్యమతని కిన్!!

అనే పద్యమయ్యింది. అందుకే శ్రీనాథ మహాకవి "ఆశ చాలించుటే ఆనంద పదవి" అన్నాడు. అది గ్రహించుకో లేక తగని ఆశకు లోబడి ఏ నేర్పరి తనం లేని జనులు సుఖం కోరి దుఃఖం కలిగే పనులు చేస్తూ వుంటారని భారతం ఉద్యోగ పర్వంలో తిక్కన కవి-

మది సుఖము గోరి దుఃఖం
బొదవం గల కార్యములకు నుత్సాహము సే
యుదు రొప్పని తృష్ణం బడి
చదురేమియు లేని యట్టి జనులాతురులై!! అన్నాడు. పద కవితా పితామహుడు అన్నమయ్య కూడా

కోరబోతే యాసలెల్ల కోటానుకోటి
అరితేరి బ్రతుకగా నాసలే మిగిలెను- అన్నాడు.

ఆశతో ఏదీ మిగలదు- ఆశే మిగుల్తుందని భావం.

వేమన మరో అడుగు ముందుకు వేసి-

"ఆశయె యిహపర సౌఖ్య వి
నాశము, భవ బంధములకు నైరుతి, తానై
యీశుని కనుగొన నీయదు" అన్నాడు.

ఇదే తిక్కన చెప్పిన 'ఒప్పని తృష్ణ'. దీనివల్ల ఇహపర సుఖాలు నాశన మవ్వటమే కాదు ఈశ్వరుని కూడా అది చూడనీయదు. ఆశ నుండి ఎవరు బైట పడగలరు?

యథా వ్యాళ గళ స్థోపి భేకో దంశా నపేక్షతే
తథా కాలాహినాగ్రస్థో లోకో భోగా నశాశ్వతాన్!!

పాము నోటికి చిక్కివున్న కప్ప దగ్గర్లో వున్న యీగలాంటి దాన్ని పట్టి తిని బతకాలని చూసినట్టుగా కాలమనే సర్పానికి చిక్కిన లోకులు అశాశ్వతమైన భోగాలు అనుభవించాలని ఆశపడతారట!

అవకాశమిస్తే ఆశ నెత్తి కెక్కుతుంది. మనిషిని దరిద్రుణ్ని చేసేస్తుంది. "సతు భవతు దరిద్రో యస్య తృష్ణా విశాలా / మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః?"- అత్యాశాపరుడే దరిద్రుడు. మనసులో సంతృప్తి వుంటే యింక దరిద్రుడెవరు? ధనవంతుడెవరు? అని శ్లోకార్థం. ఇదే భావాన్ని మరో శ్లోకం



ఇలా చెప్పింది.-

**తృష్ణాహి చేత్ పరిత్యక్తా- కో దరిద్రః? క ఈశ్వరః?**

**తస్యాశ్చేత్ ప్రసరే దత్తో - దాస్యం హి శిరసి స్థితం!!**

ఆశని విడిచి పెట్టినట్లయితే దరిద్రుడెవరు? ఈశ్వరుడెవరు? దానికి అవకాశమిస్తే మన నెత్తిన దాస్యమే కూర్చుంటుందని శ్లోక భావం. ఎవరైనా సుఖంగా, సంతోషంగా, సంతృప్తికరంగా జీవించాలనే కోరుకుంటారు గానీ దాస్యాన్నీ, నైరాశ్యాన్ని, దుఃఖాన్ని కోరుకోరు గదా! అయితే అదెలా సాధ్యమవుతుందో యీ శ్లోకం చెప్తూవుంది:-

**యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః**

**ఏక స్యాపి న పర్యాప్తం తస్మాత్ తృష్ణాం పరిత్యజేత్!!**

ఈ శ్లోక భావాన్ని ఎఱ్ఱాప్రగడ తన హరివంశం కావ్యంలో ఇలా పొందుపరిచి అందించాడు:-

**పసిడియు బశువులు భామలు**

**వసుమతి మీదగల యంతవట్టు నొకడ యిం**

**పెసగగ బడసియు దనియడు**

**విసువ వలదె తృష్ణ వలన విరతి ప్రాప్తిన్!!**

జీవులకి ఈ భూమి మీదున్న ధన ధాన్యాల వల్లగాని, పసిడి, పశువులు, భామలు వల్లగాని, మరే వస్తువుల వల్లగాని కలగని సంతృప్తి ఆశను వీడుట వల్లే కలుగుతుందని అర్థం. అందుకే-

**తేనాఅ ధీతం శ్రుతం తేన- తేన సర్వ మనుష్ఠితం**

**యే నాశాః పృష్ఠతః కృత్వా నైరాశ్య మవలంబితం!!**

అంటూ వుంది ఓ శ్లోకం. అంటే- ఎవడు ఆశని విడిచిపెట్టి ఆశా రాహిత్యాన్ని అవలంబిస్తాడో వాడే నిజమైన పండితుడు, జ్ఞాని, సదనుష్ఠాత- అని అర్థం. ఆశ లేనివాడే జ్ఞాని కాగలడు. విజేత కాగలడు. ఎందుకంటే వాడి మీద ఏ ప్రభావాలూ, ప్రలోభాలూ పనిచేయవు కాబట్టి.

ఇంతకీ 'ఆశా' అంటే అధికమైన అపేక్ష అని అర్థం. 'అశ్నుత ఇత్యాశా; ఆశూ వ్యాప్తౌ'- వ్యాపించేది కాబట్టి ఆశ. "అశో వ్యాప్తౌ భుజౌచనా"-. ఆశని తృష్ణ అంటారు గానీ 'తృష్ణ' అంటే దప్పిక. "తర్షణం తృష్ణా" "తృష పిపాసాయామ్- త్రాగాలనే కోరిక. ఏదైనా కోరిక కోరికేగా! అందుకే తృష్ణ కూడా ఆశ అయ్యింది.

చివరిగా. ఓ చమత్కార శ్లోకం తో ముగిస్తాను. శివశర్మ అనే మహా పండితుడు తన రాజు గారు బంగారు మామిడి పండ్లను పండితులకు తాంబూలంలో పెట్టి దక్షణగా సత్కరిస్తున్నారని పండితుల వరుసలో నిలబడి వెళ్ళి ఒక తాంబూలం తీసుకున్నాడు. ఒక తాంబూలంలో ఒక బంగారు మామిడి పండు- పండిత సత్కారం. సత్కార కార్యక్రమం మొదలవ్వగానే జోరున వాన మొదలై కురిసి కురిసి నేలంతా బురదయ్యింది. పండితులంతా వానలోనే వచ్చి తాంబూలాలు తీసుకుని వెళ్తున్నారు. ఒకసారి తీసుకున్న శివశర్మకి రెండోసారి వెళ్లి రెండో బంగారు పండు తీసుకోవాలని ఆశ పుట్టి, మళ్లీ పండితుల వరసలోకి వస్తూండగా కాలు జారి పడి వొళ్లంతా బురదయ్యింది. కండువా కప్పుకుని వెళ్లి రాజుగారిని సమీపించాడు. అనుకున్నంతా అయ్యింది. శివశర్మని రాజుగారు గుర్తుపట్టి ఏమిటీ అవతారమని అడిగాడు. శివశర్మకి ఏం సమాధానం చెప్పాలో తెలియక-

**క్షుత్తృడాశాః కుటుంబిన్యః మయి జీవతి నాన్యగాః**

**తాసా మంత్యా ప్రియతమా- తస్యా శృంగార చేష్టితమ్!!**

అని శ్లోకం చెప్పి, ఇబ్బందికరంగా నిలబడి దణ్ణం పెట్టాడు. రాజు గారు శివశర్మ అవస్థని గ్రహించి, "భేష్! నీ శ్లోకానికి మరో స్వర్ణ తాంబూల మిదిగో! తీసుకో!" అని రెండో సారి బంగారు మామిడిపండు తాంబూలం తో శివశర్మని సత్కరించాడు. ఇంతకీ ఆ శ్లోకంలో శివశర్మ- "ఓ! రాజా! నాకు ఆకలి, దప్పిక, ఆశ అని ముగ్గురు భార్యలు. వాళ్లెప్పుడూ నన్ను విడిచిపెట్టి వుండరు వారిలో చిన్న భార్య 'ఆశ' అంటే నాకు చాలా యిష్టం. ఆమె చేసిన శృంగారపు పనే గంధపు పూతలాంటి - ఈ బురద." అని చెప్పి తన ఆశని తాను సమర్థించుకున్నాడు.

కోరిక లేకుండా బ్రతకటానికి ప్రయత్నించండి. దుఃఖమనే మాటలేని ఆ సుఖ జీవితానందాన్ని అందుకోండి. కష్టమే కానీ ప్రయత్నించండి!

◆

---

## చరమదశలో జానీవాకర్ గురించి...

**జూ**లై 29, 2003న కాలధర్మం చేసిన నవ్వుల రేడు జానీవాకర్ జీవితంలోని రసవద్ఘట్టాల గురించి 'హాసం' పాఠకులు 'హాసం' 2 వ సంచిక (అక్టోబరు 16-31, 2001) లో చదివేవున్నారు. ఎన్నాళ్లు జీవించినా ఎలాటి పరిస్థితుల్లో మరణించాడన్న విషయాన్ని బట్టే వ్యక్తి జీవితాన్ని అంచనా వేయడం జరుగుతుంది.



ఆ విధంగా చూస్తే జానీవాకర్ ధన్యజీవే ననాలి. నవ్వించినంత కాలం ప్రేక్షకులను నవ్వించి ఆ తరువాత పక్కకు తప్పుకున్నాడు. 13 సంవత్సరాలపాటు విరామం తీసుకున్నాక "చాచీ 420" (హిందీ 'భామనే సత్యభామనే') ఏరికోరి పిలిస్తే వెళ్లి మంచిపాత్ర వేశాడు. అది వేసి కూడా ఆరేళ్లయిపోయింది. అయినా ఏ చింతాలేకుండా ఇంటనే ఉండిపోయాడు.

చాలామంది కమెడియన్స్ హీరోలుగా మారదామని స్వంతసినిమాలు తీసి చేతులు కాల్చుకోవడం, ఎటూ కాకుండా పోవడం జరుగుతూంటుంది. ముఖ్యంగా హిందీసీమలో నటీనటులు చివరిరోజుల్లో డబ్బుకు కటకట పడడం ఉంది. కానీ జానీవాకర్ ఆ విషయంలో జాగ్రత్త పడ్డాడు. వేషాలు తగ్గగానే బాంద్రా (బొంబాయిలో పోష్ లొకాలిటీ) లో ఉన్న బంగళా అమ్మేసి శివార్లలో ఉన్న లోఖండ్‌వాలాకి మారిపోయాడు. ముగ్గురు కూతుళ్లు, ముగ్గురు కొడుకులున్నా వాళ్ల మీద ఆధారపడే అవస్థ తెచ్చుకోలేదు.

యూసుఫ్ లక్డావాలా అనే సినిమా థియేటర్ యజమాని జానీవాకర్ మిత్రుడు. ఆరేళ్లక్రితం అవసరం పడి అతనివద్ద రెండున్నర లక్షలు అప్పు చేశాడు జానీవాకర్. ఆర్నెల్లక్రితమే ఆ డబ్బు పట్టుకొచ్చేసి ఇచ్చేశాడు. 'దీనికి తొందరేముంది?" అని లక్డావాలా అంటే "డయాబెటిస్ ముదురుతోంది కదా. చచ్చిపోయేముందు లావాదేవీలన్నీ ముగించుకుంటే మంచిదని." అన్నాడు జానీ.

జానీవాకర్‌కి దైవభక్తి కూడా ఎక్కువే. రోజా నమాజ్ (అతని అసలుపేరు బద్రుద్దీన్ కాజీ) చేసేవాడు. సమాజసేవలో ఎక్కువకాలం గడిపేవాడు. దిలీప్‌కుమార్‌తో కలిసి కాంగ్రెసుపార్టీకి ప్రచారం చేసిపెట్టేవాడు.

చరమదశలో జానీవాకర్ తరచుగా తలచుకున్న వ్యక్తి గురుదత్. జానీవాకర్‌కు ఆ పేరుపెట్టినదీ, మంచిపాత్రలిచ్చి ప్రోత్సహించినదీ గురుదత్తే. పైగా మంచి ఫ్రెండు కూడా. "గురుదత్ వహీదా రెహమాన్ పెళ్లి చేసుకుని ఉంటే బాగుండేది. వాళ్ళ పెళ్లికి నా బంగళాలో అన్ని ఏర్పాట్లు చేశాను కూడా. కాజీని (ముస్లిం పురోహితుడు) కూడా పిలిచాను. చివరినిమిషంలో వహీదా వెనుకంజ వేసింది. గురుదత్ హృదయం బద్దలయింది. ఆత్మహత్య చేసుకుని తను వెళ్లిపోయాడు. నేను మాత్రం ఉండిపోయాను." అని విలపించేవాడు.

ఇప్పుడు పైలోకాలకు తరలివెళ్లిన జానీవాకర్ గురుదత్ పర్యవేక్షణలో అక్కడివారికి తన నవ్వులతో మాలీష్ చేసి మెప్పిస్తాడేమో!

- కమ్యూనికేటర్ ఫీచర్స్

# సరిగపదమని

కూర్పు : బి. బాలసుబ్రహ్మణ్యం

**1**



**ఆధారాలు:**

**అడ్డం:**

1. ఎన్టీఆర్‌కి 'ఎక్కడోపుట్టి ఎక్కడో పెరిగి' పాట పాడిన సంగీత దర్శకుడు? (4)
3. ఘంటసాల, బి.వసంత పాడిన 'నిత్య సుమంగళి నీవమ్మా' పాట కల్గిన చిత్రం? (4)
7. 'గుండెలోన ...... గంటలు'... 'శుభాకాంక్షలు' సినిమాలోని పాట? (2)
8. ఈ భువనంలో బంగారు కోడిపెట్టను కనిపెట్టిన చంద్రునిలో తొలి సగం? (3)
9. 'గులాబీ ..... చలాకీ బైకో' అంటూ 'చిరాకు అనుకో' పాటలో హీరోయిన్‌ని సింహాద్రి వర్ణించాడు. (2)
12. అతిలోక సుందరిచే 'అబ్బనీ తియ్యని దెబ్బ' అని పాడించిన చిరంజీవి ఎవరు? (7)
15. 'తెల్లారింది లెగండోయ్' అంటూ సిరివెన్నెల పాడిన సినిమాపేరు (2)
18. '.......లో నారాజు తొంగి చూసెను నేడు' (2)
19. 'తెలుగు వీర.........' శ్రీశ్రీ కి జాతీయ అవార్డుని తెచ్చిన పాట? (3)
20. ఘంటసాల గానం చేసిన 'గిరిజా కళ్యాణం' యక్షగానం కల చిత్రం? (3)
21. పాటలు కూడా రాసే ఈ నిర్మాత సహజ కవి? (4)

**నిలువు**

1. 'కాదు సుమా కలకాదు సుమా' అంటూ అక్కినేని గుఱ్ఱంపై ఆకాశంలో ఎగురుతూ అభినయించిన సినిమా? (4)
2. వెంకటేష్ సినిమాకు హారీష్ జయరాజ్ సంగీతాన్నిచ్చిన చిత్రం? (2)
4. 'ఏ తల్లి నిను కన్నదో..' అంటూ కర్ణునిపై సినారె పాట రాసిన చిత్రం పేరులోని రెండక్షరాలు? (2)
5. 'సరిలేరు నీకెవ్వరూ' అంటూ సుశీల, జానకి పాడిన జానపద చిత్రం. (4)
6. 5గురు ఎన్టీఆర్‌లకు ఘంటసాల స్వరాలతో సహా పాడిన ఓ అద్భుత గీతం పల్లవి ఎలా మొదలవుతుంది? (5)
10. '........ రాణివి నీవే' అంటూ మనసు దోచుకున్న బందిపోటు? (3)
11. 'పట్టపగలెవరైనా రాతిరిన చూస్తారా తన ............. చూపిస్తా ఔననక ఛస్తారా' నువ్వునాకు నచ్చావు'లో సిరివెన్నెల పాట? (3)
13. గీత రచయిత సి.నారాయణరెడ్డి సంభాషణలు రాసిన చిత్రం? (4)
14. ఈ పేజీలో రెండుసార్లు తన ఫోటోను కలిగిన అమర గాయకుడు? (4)
16. మరదళ్లతో 'అన్నమయ్య' పాడిన పాట తొలి అక్షరాలు? (2)
17. '...... నీ నామమెంతో రుచిరా...' 'ఇద్దరుమిత్రులు'లో రమణారెడ్డి అభినయించిన పాట? (3)

పంపినవారి పేరు : ______________________

చిరునామా : ______________________

ఫోన్ : ______________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...

**పజిల్, కూపన్ 31-8-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి (ఆల్ కరెక్ట్)



31 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)



16 పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి (రెండు తప్పులతో)



31 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి (మూడు తప్పులతో)




18 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్




# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల
2

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు



అదో మధ్యతరగతి మానవుడి ఇల్లు. భార్యా, ఇద్దరు పిల్లలతో సంసారం సాగిస్తున్నాడు. గుమాస్తా ఉద్యోగం వెలగబెడుతున్నాడు. ఆ మాత్రానికే బెలెడంత గీర్వాణం. మహాబద్ధకస్తుడు. ఎంత బద్ధకమంటే 'పెన్సిల్ ఎక్కడుందే పెళ్ళామా' అని అడిగితే 'మీ చెవిలోనే ఉంది చూస్కోండి' అని జవాబిస్తే 'అబ్బా... ఏ చెవిలో ఉందో చెప్పలేవా?' అని ప్రశ్నించేంత! దానికితోడు ఆయనకు పెళ్ళాం అంటే చిన్నచూపు. తాను తెగకష్టపడి సంపాదిస్తుంటే ఇంట్లో పడి తేరగా తింటుందని, ఇంకేం పనీ పాటా ఉండదని ఆయన అభిప్రాయం. ఆయన పేరు బాలాజీ.

ఇక ఆయన ఇల్లాలు. పేరుకు మాత్రం ఝాన్సీలక్ష్మి. మొగుడంటే చచ్చేభయం. భర్తకు సేవలు చెయ్యడం తప్ప భార్యకు మరో కర్తవ్యమేముంటుందనే బాపతు.

ఇల్లాళ్ళలో రెండు రకాలు. మొదటి రకం వారు మొగుడు చవటైనా, సన్నాసైనా, తాగుబోతైనా, ఇద్దర్ని ఏలుకునే 'బోత్' అయినా, సతీ సుమతిలా వాడినే నెత్తిన పెట్టుకుని ఊరేగి తరించేవారు. ఇక రెండవ రకం కైకేయి, సత్యభామల టైపు. మొగుడు ఎంత ఉత్తముడైనా వాడిని నానా విధాల నసపెట్టి, వాడినెత్తినెక్కి తాండవం చేసేవారు. మన ఝాన్సీ మొదటి రకం శాల్తీ.

తెల్లవారుఝాము ఐదున్నరయింది. తెల్లారితే మానవుడు తనను పలావు చేస్తాడని తెలిసీ కూడా కోళ్లు కూతలు పెడితాయి. బాలాజీ మంచం పక్కనే ఉన్న టేబుల్ మీదున్న అలారం గడియారం కూత కూసింది. దాని నెత్తిన ఓ మొట్టికాయ వేసి నోర్ముయ్యమన్నాడు.



"ఝాన్సీ... ఝాన్సీ... లలే..." పెళ్ళాన్ని లెమ్మని తాను మళ్ళీ ముసుగుతన్నాడు.

ఝాన్సీ అప్పటికే నిద్రలేచి ముఖం కడుక్కొని ముకాన బొట్టు పెట్టుకుని వాకిట్లో ముగ్గు వేస్తున్నది.



దూరం నుంచి సన్నగా శ్లోకం వినపడుతున్నది.

లక్ష్మీం క్షీర సముద్రరాజ తనయాం - శ్రీరంగధామేశ్వరీ
దాసీ భూత సమస్త దేవవనితాం....

బాలాజీ మాత్రం నిద్ర మత్తులో "లే... ఝాన్సీ... నిన్నే.... లే..." అంటున్నాడు తనకు తెలియకుండానే.



"లేచాను మహాప్రభో లేచాను" కొంచెం విసుగ్గా అన్నది ఝాన్సీ.

"లోకైక దీపాంకురాం' అంటూ నరసయ్య వచ్చాడు చేతిలో చిన్న డబ్బాతో.

ఝాన్సీ తలెత్తి చూసింది. నవ్వి మళ్లీ ముగ్గెయ్య సాగింది తలదించుకుని.

"శ్రీ.మన్మంద కటాక్ష లబ్ధ విభవత్... అంచేత కొంచెం ముగ్గు పెట్టు తల్లీ" అన్నాడు నరసయ్య నవ్వుతూ...



"తల్లీ పిల్లీ అనకు. నా పేరు ఝాన్సీ" చిరుకోపంగా అన్నది ఝాన్సీ.

నరసయ్య కలియుగ నారదుడు. పచ్చ గడ్డిని భగ్గుమనిపించడం అతనికి పూతరేకు నమిలినంత ఈజీ.

"మరే... ఝాన్సీలక్ష్మీ...

అమ్మా లక్షుంబాయీ... ఇంత చలిలో నీకీ చాకిరీ ఏం ఖర్మ? హాయిగా ముసుగుతన్ని పడుకోక" సెగ పుట్టించాడు.

"పడుకుంటే పనులెవడు చేస్తాడు?"

"నీ మొగుడు! యుగం మారింది. స్త్రీ బానిస బంధాలు తెంచుకుంది. లేడీసులు టాపు. జెంట్సులు డౌనూను."



"నా మొగుడికి పిల్లలకు వండిపెడితే అది బానిసత్వం అంటావేమిటి నా మొహం?"

నరసయ్య ముందుకు వంగి ఝాన్సీ చెవి పక్కన చేరాడు.

''అదే మాయం. విష్ణుమాయ! నువ్వు మహాలక్ష్మివి. ఆ బ్రహ్మేంద్ర గంగాధరులు నీ బానిసలు. నువ్వు కూర్చోవాలి. తన పెళ్ళాం బిడ్డలకి నీ మొగుడు వండి వార్చాలి." జోరీగలా సొద పెట్టాడు.

"ఏడిసినట్లుంది. మరి డబ్బు" అన్నది లోపలకు వెళ్తూ

"విష్ణుమాయ అని చెప్పానుగా. నువ్వే డబ్బు డబ్బేనువ్వు"

వచ్చిన పని అయిపోగానే నవ్వుతూ వెళ్ళిపోయాడు నరసయ్య.

ఝాన్సీ లోపలకొచ్చి డికాక్షన్ ఫిల్టర్ వేసింది. కుంపటి వెలిగించి నీళ్ళగిన్నె పెట్టింది. పిల్లలు లేచారు. ఇద్దరికీ బ్రష్‌ల మీద పేస్టులు వేసిచ్చింది. వాళ్ళు ముఖాలు కడుక్కోగానే చెరో గ్లాసు పాలిచ్చింది. స్నానాలు చేయించి స్కూల్ యూనిఫాం తొడిగింది. ఇస్త్రీ పెట్టెలో నిప్పులు వేసి భర్త ప్యాంటు, షర్టు ఇస్త్రీ చేసింది.



ఇంతలో వాకిట్లో కూరలమ్మి వస్తే కూరలు తీసుకుంది. బాత్‌రూమ్‌కు వెళ్ళి హడావిడిగా రెండు చెంబులు కుమ్మరించుకుని వంట మొదలెట్టింది. పిల్లలకు హోమ్‌వర్క్ చేయించింది. మధ్యలోనే హడావుడిగా ఓ రెండు గుక్కల కాఫీ నీళ్లు ఊదుకుంటూనే గొంతులో పోసుకుంది-'నాన్నలేచారేమో చూడు' అంటూ.

పిల్లలకు జడవేసింది. సాక్స్ తొడిగి షూస్ పాలిష్ చేసింది. ఇద్దరికీ అన్నం పెట్టి బాక్సులు సర్దింది. ఫుల్‌గా కీ ఇచ్చిన మర బొమ్మలా అన్ని పనులు చేసే సరికి ఎనిమిదైంది. ప్రతిరోజూ ఉదయం స్త్రీలు చేసే ఇన్ని పనులు ఎవరూ గుర్తించరు. 'ఇదీ ఒక పనేనా' అని ఈసడిస్తాడు మగాడు! అదీ మధ్యతరగతి స్త్రీ దౌర్భాగ్యం! 'వెళ్లి మీ నాన్నను లేపు' అంటూ పిల్లాడి చేతికి పళ్లాన్ని, గరిటెని ఇచ్చి పంపింది. 'ఏయ్...మూతి తుడుచుకో' అని ఆమె అంటున్నా వినిపించుకోకుండా



ఆ కుర్రాడు వెళ్లి బాలాజీ చెవి దగ్గర గరిటెతో పళ్లెం మీద కొట్టి బాజాబజాయించేసేడు. షాక్ కొట్టినట్టు అదిరిపడి కళ్లింత చేసుకుంటూ లేచాడు బాలాజీ. ఎదురుగా పుత్రరత్నం. పళ్లెం గరిటె లాక్కుని దిండుకింద దాచేశాడు. లాగొక్కటి కొడదామనుకున్నాడు...ఏం చేస్తాం...తన రక్తం పంచుకుపుట్టినవాడాయె...తమాయించుకుని ఓ బలవంతపు నవ్వు నవ్వి వాణ్ణి ముద్దు పెట్టుకుని పంపించేశాడు. వాడి మూతికున్న మజ్జిగన్నం బాలాజీ బుగ్గక్కూడా అంటింది.



అతి బద్ధకంగా నిద్రలేచి ఆ మత్తులోనే నడుస్తూ పెరట్లో కొచ్చి నిలుచున్నాడు.

'బ్రా.... ష్షూ...' అంటూ కేక పెట్టాడు. ఝాన్సీ పరిగెత్తుకుంటూ వచ్చి బుగ్గకంటిన అన్నం తుడిచి బ్రష్ అందించింది. 'పే...ష్టూ' అన్నాడు కళ్లు తెరవకుండానే బ్రష్ అందుకుంటూ. పాపం... ఆ మహా ఇల్లాలు బ్రష్ మీద పేస్ట్‌వేసి ఇచ్చి చూసింది. ఇంకా నిద్ర మత్తు వదల్లా. 'ప...ళ్లూ' అంది. తుళ్లిపడి తేరుకుని దంతావధానం ముగించాడు. అయినా తీరలేదు.



ముఖం కడుక్కుని 'టవాల్' అన్నాడు. ''దండెం'' అంది ఝాన్సీ. 'కా..ఫీ' అన్నాడు ముఖం తుడుచుకుని.

కాఫీ కప్పుతో వచ్చింది ఝాన్సీ. కాఫీ వాసనను ఆఘ్రాణిస్తూ అటు ఇటు తిరిగాడు బాలాజీ. ఝాన్సీ జడ పట్టుకుని చిలిపిగా లాగడంతో కాఫీ ఒలికి బనియన్ మీద పడ్డాయి. మిగిలిన కాఫీ తాగి బనియన్ మీది మరకలు తుడుచుకుని నోట్లో సిగరెట్ పెట్టుకున్నాడు. అగ్గిపుల్ల వెలిగించాడు. ఆరిపోయింది. రెండు మూడు అగ్గిపుల్లలు ఆరిపోయిన తరువాత పక్కనే టేబుల్ ఫ్యాన్ తిరుగుతున్న విషయం గమనించాడు. పోనీ స్విచ్ ఆపెయ్యవచ్చుకదా! ఊహు...



''ఫా... నూ...'' కేక పెట్టాడు. ఓరి వీడి బద్ధకం బండలు గానూ!

వంటింట్లో కూరలు తరుగుతున్న ఝాన్సీ పరుగున వచ్చి ఫ్యాన్ డైరక్షన్ మార్చింది. అప్పుడు సిగరెట్ వెలిగించి విలాసంగా ధూమపానం చెయ్యసాగాడు. ఇంతలోనే ఉక్కపోసింది. మళ్ళీ 'ఫా.... నూ' అనికేక పెట్టాడు. పిల్లను రిక్షా ఎక్కించి స్కూలుకు పంపిస్తున్న ఝాన్సీ మళ్ళీ వచ్చి ఫ్యానును మొగుడివైపు తిప్పింది.



బాలాజీ పచార్లు చేస్తూ పేపర్ చదువుతున్నాడు.

"మంత్రీ దిగిపో, గవర్నరూ దిగిపో, కలెక్టరూ దిగిపో... ఛీ... పొద్దున్న లేచినప్పటినుంచి అన్నీ దిగిపో దిగిపో పాటలే" భార్యను ఓరకంట చూస్తూ అన్నాడు. భార్య గమనిస్తుందని గ్రహించిన తరువాత మళ్ళీ చదవసాగాడు. "ఒక్క శ్రీ బాలాజీ దొరగారినే ఎక్కిపో... ఎక్కిపో... కాష్ కీపర్ సీటుకెక్కిపో ఎక్కిపో అని ముక్కోటి దేవతలు, ఆరుకోట్ల ఆంధ్రులు గోలపెట్టేస్తున్నారు." అన్నాడు.

ఝాన్సీ భర్త ముందు కొచ్చి "ఏమిటి? ప్రమోషనొచ్చిందా? చెప్పలేదేం?" అన్నది సంతోషంగా.

"ఇప్పుడు చెప్పాంగా! ఆడదానికి ఏది ఎప్పుడు చెప్పాలో అప్పుడే చెప్పాలని శాస్త్రం" భార్య వైపు చులకనగా చూస్తూ అన్నాడు.

"బడాయి... రాత్రి చెప్పొచ్చుగా" అంది ఝాన్సీ మురిపెంగా.



"రాత్రే చెబితే ఆ ప్రమోషన్లో పెరిగే జీతానికి మూడింతలు ఖర్చులు వల్లించేస్తావు. ఇప్పుడు చెప్పాం" అన్నాడు. "నీకు ఛాన్స్ లేకుండా ఖర్చులు కూడా సెటిల్‌మెంట్ చేసేశాం. ఇవాళ టీవీ కొనేస్తున్నాం" అన్నాడు స్టయిల్‌గా.

"టీవీయా? ఇపుడెందుకండీ. ఆ డబ్బుతో పిల్లల పేర బ్యాంకులో..." చెప్పబోయింది ఝాన్సీ.

బాలులో పంతం పెరిగింది. పెళ్ళాం మాటకు సరే అంటే తన గొప్పదనమే ముంటుంది?



"ఇది మగాడి సబ్జెక్టు. ఏం వండాలో వడ్డించాలో నీ పని. ఏం కొనాలో ఏం దాచాలో నా రాజ్యం" అన్నాడు. ఝాన్సీ మాట్లాడలేదు.

"టీవీ ప్రిస్టేజ్ పాయింట్. ఈ కాలనీకి మనమే ఫస్టు టీవీ ఫ్యామిలీ అవ్వాలి" అన్నాడు.

"అదికాదండీ. రోజూ బస్సులో అవస్థ పడుతున్నారు కదా. పోనీ... ఒక మోపెడ్ కొనుక్కోరాదూ?" టవల్ అందిస్తూ అన్నది ఝాన్సీ.

"రాదు. రాదే చెలీ - కొనరాదే చెలీ... నువ్వు వద్దన్నావు కాబట్టి టీవీయే కాదు, వీసీపీ కూడా కొనేస్తాను. దట్సాల్" అన్నాడు. బాత్రూమ్‌కు వెళ్ళి తలుపేసుకుంటూ 'దట్స్ ఫైనల్' అని పునరుద్ఘాటించాడు కూడా.



భర్త మొండితనానికి మనస్సు చివుక్కుమన్నా ఏమీ మాట్లాడకుండా టిఫిన్ తెచ్చి టేబుల్ మీద పెట్టింది. అప్పటికే టైమ్ అవుతుండటంతో ఉరుకులు పరుగుల మీద వచ్చి టిఫెన్ టిఫెన్ టిఫెన్ అంటూ ఇడ్లీ రెండు తుంపులు నోట్లో కుక్కుకున్నాడు. అవి నమిలీనమలకుండానే 'మంచినీళ్లు మంచినీళ్లు' అన్నాడు. ఆవిడ మంచినీళ్లు పరుగుపరుగున తెచ్చి అందించింది. ఆ నీళ్లు గొంతులోకి దిగకుండానే 'బూట్లు... బూట్లు' అని అరిచాడు. ఝాన్సీ గబగబ బూట్లు తెచ్చింది. భర్తకు తలదువ్వబోయింది. 'నీమొహం నీకేం చాతవు?' అన్న ఫోజు పెట్టి భార్య చేతులోని దువ్వెన లాక్కుని భార్య అద్దాన్ని పట్టుకుని చూపుతుండగా క్రాపు దువ్వుకున్నాడు. తరువాత దువ్వెనను





నిర్లక్ష్యంగా గాలిలోకి విసిరేశాడు.

భర్త వెళ్ళిబోతుండగా 'ఆగండాగండి' అన్నది ఝాన్సీ భర్త ప్యాంటు మడత ఊడటం గమనించి. బాలాజీ ఆగి కాలెత్తి స్టూల్ మీద పెట్టాడు. ప్యాంట్ మడతను దారంతో కుట్టి కత్తెరతో కత్తిరించబోతుండగా విసురుగా కాలు వెనక్కు లాక్కున్నాడు బాలు. వేలుకు సూది గుచ్చుకుని అబ్బా అన్నది ఝాన్సీ. బాలు అదేమీ పట్టించుకోకుండా నడిచాడు. జేబులో పర్సు చూసుకున్నాడు. ఖాళీగా ఉంది.

"డామిట్ మళ్ళీ చిల్లర మర్చిపోయావు? ఎన్నిసార్లు చెప్పాలి బస్సులో రూపా యిస్తే చిల్లరివ్వడని?" కోపంగా అన్నాడు.

సూది గుచ్చుకున్న వేలును నోట్లో పెట్టుకుని ఆవిరిపడుతున్న ఝాన్సీ ఏదో చెప్పబోయింది.

"ఎనభై పైసల చిల్లర పెట్టమని ఎన్నిసార్లు చెప్పాలి? మర్చిపోవడానికి నువ్వు చేస్తున్న రాచకార్యాలేంటి? పడిపో తున్న అష్టకష్టాలేమిటి? నేనాఫీసుకు వెళ్లిన తర్వాత పొద్దున్న పదినుంచి సాయంత్రం ఆరు గంటల దాకా కాళ్ళు బార జాపుకు కూర్చోడం, పడుకోవడం. ఇదేగా పని? ఈకాసేపటికే పెద్ద భూభారాన్ని మోస్తున్నట్లు చెమటలు, అన్నులు.. బున్నులు!" అరిచాడు.



"బన్నులో వర్సు తియ్యడం కష్టమని చిల్లరజేబులో వేశాను." మూలుగుతూ చెప్పింది ఝాన్సీ.

"చెప్పేడవచ్చుగా"

"రోజూ చెబుతూనే ఉన్నాను."

"హేళనా? నాకు లక్ష పనులూ కోటి వర్రీసూ... ఎన్నని గుర్తు పెట్టుకోను?... అదేవిటి? వేలు తెగిందా?"



"అవునండీ..." వేలు చూపించింది ఇప్పుడైనా గమనించాడని సంబరపడి.

వేలివైపు చిరాగ్గా చూశాడు బాలు. "అబ్బా...ఈ ఆడాళ్ళెప్పుడూ ఇంతే! చెయ్యి కాల్చుకోవడం... కోసుకోవడం. ఏదో హాబీలా ఉంది. మందేసుకో." చెప్పి వెళ్ళిపోయాడు.

ఝాన్సీ దిగాలు పడి గుమ్మానికానుకుని కూర్చుంది. అంతలోనే 'ఏమోయ్' అన్న భర్త కేక విని బయటకు పరుగెత్తింది.



"టీవీ వస్తుంది. చోటు చూపించు. వైరింగూ అదీ వాళ్ళే చేస్తారు. ఆ వేలికి తడిగుడ్డ కట్టుకునేడువ్" భర్త మాటలు వినిపించాయి.

దిగాలుగా రక్తం కారుతున్న వేలిని చూసుకుంది ఝాన్సీ.

ఆలోచనలు గతంలోకి వెళ్ళాయి.

పెళ్ళికాక ముందటి ముచ్చట. ఒక రోజు తాను వాకిట్లో కూర్చుని పూల దండను గుచ్చుతున్నది. పొరబాటున సూది వేలికి గుచ్చుకుని రక్తం కారింది. వేలిని కడుక్కోవాలని లేవబోతున్నంతలో ఎక్కడి నుంచి వచ్చాడో... పరుగు పరుగున వచ్చాడు బాలాజీ. ఝాన్సీ చేతిలోని సూదిని లాక్కుని 'నా ప్రియురాలిని గాయపరచ డానికి ఎంత ధైర్యం?' అన్నట్లు కోపంగా చూసి సూదిని రెండు ముక్కలుగా విరిచేశాడు. సూది గుచ్చుకోవడానికి కారణమైన పూలను విసిరి అవతలపారేశాడు. ఝాన్సీ వేలిని తన నోట్లో పెట్టుకుని ఆవిరిపట్టాడు. అటువంటి మగాడు పెళ్ళయి మొగుడిగా మారిన తరువాత ఎంత మారిపోయాడు? బన్ను అందిన తరువాత దానికోసం పరిగెత్తవలసిన అవసరం ఎవరికీ ఉండదని తెలియని అమాయకురాలు!



ఉతకవలసిన బట్టలు కనిపించాయి ఎదురుగా. ఉసూరు మంటూ లేచింది. పెళ్ళయిన స్త్రీకి యంత్రానికి తేడా ఉండదు. ఇంట్లో అందరికంటే ముందు లేవాలి. అందరికీ అన్నీ అమర్చిపెట్టాలి. వాళ్ళు విసుక్కున్నా, కసురుకున్నా గుడ్ల నీరు కుక్కుకుని కూర్చోవాల్సిందే తప్ప ఎదురు మాట్లాడటానికి వీల్లేదు. రాత్రి అందరూ నిద్రపోయాక తాను నిద్రోవాలి. ఇంత చాకిరీ చేసినా వంకలు పెట్టేవారే తప్ప మెరమెచ్చులకు కూడా ఒక్క మెచ్చుకోలు మాట మాట్లాడడు మగాడు. అందుకేనేమో స్త్రీకి భూదేవికున్నంత సహనం ప్రసాదించాడు భగవంతుడు! ఝాన్సీ మననులోని భావాలన్నీ పాట రూపంలో బయటకొచ్చాయి.



రాదే చెలీ నమ్మరాదే చెలీ
మగవారినిలా నమ్మరాదే చెలీ
రాదే చెలీ నమ్మరాదే చెలీ
మగవాలీ మనస్సమ్మరాదే చెలీ



అంటూనే వేలికి తడిగుడ్డ చుట్టుకుంది. బట్టలు జాడించ సాగింది. తనకున్న ఒక్క నూలు చీర చిరిగిపోయి ఉంది.

నాడు పట్టుచీర కట్టవద్దు బరువన్నాడే
నేడు నూలు చీరకే డబ్బులు కరువన్నాడే
నెల తప్పిన నెలత తనకు పరువన్నాడే
నేడు నెలబాబును చేతికిస్తే బరువన్నాడే
ముంగురులను చూని తాను మురిసిపోయాడే
ఆ కురులకు విరులివ్వడమే మరిచిపోయాడే



ప్రేమించు సీజన్లో పెద్ద మాటలు
పెళ్ళయ్యాక ప్లేటు ఫిరాయింపులు
మొదటి వలపు మధురకథలు మరిచెను ఘనుడు
మగవారినిలా నమ్మరాదే చెలీ ॥రాదే॥
మాటల్లో కోట కట్టాడే
నా మహరాణీ నీవన్నాడే
కాలు కింద పెడితేనే కందిపోవునన్నాడే





గాలి తాకి తేనే మోమున
పాలు విరుగునన్నాడే
కవ్వించుకున్నాడే కౌగిలికోసం
ఆ కాస్తా తీరాక మొదటికి మోసం
మనవి వినడు మనసు కనడు మాయల మొగుడు
మగవారినిలా నమ్మరాదే చెలీ ॥రాదే చెలీ॥
తలలో నాలుకలా పూసలలో దారంబు, మాడ్కి
సతి మదిలోనన్ మెలగెడు నెలకొను పురుషుడు కలుగుటా
తొలి జన్మపునోము ఫలమో తోయజనేత్రా
తనుగావలచిన వరుడేనా ఈ పురుషోత్తముడు
వ్రతములు సలిపిన సతులకు గతి కలదా
ఇలలో.... కలదా.... లేదా



రకరకాల జ్ఞాపకాలు ముప్పిరిగొనగా బాధగా ఆకాశం వంక చేతులు జోడించింది.

నరుడు వినకపోయినా నారాయణుడు వింటాడని సామెత ఊరికే పుట్టిందా?

వైకుంఠంలో చిద్విలాసంగా పడుకుని ఉన్న భర్త పాదాలను మృదువుగా పిసుకుతున్న లక్ష్మీదేవి తన భక్తురాలు పడుతున్న హింసను చూసింది. పొద్దస్తమానం ఒత్తిగిలి పడుకుని ఉండే భర్తకు పాద సేవలు చేస్తుండే తనకు, నిరంతరం మొగుడికి సేవలు చేస్తున్నా తిట్లు, చీవాట్లు తప్పని ఝాన్సీకితేడా లేదని గ్రహించిన శ్రీదేవి ముఖం కోపంతో జేవురించింది. ఏనాడైనా 'ఇక చాల్లే లక్ష్మీ, నీ చేతులు నొప్పెడతాయని మాటవరసకైనా అన్నాడా మాధవుడు? లక్ష్మీదేవి కళ్ళు ఎర్రబడ్డాయి. ఈ విధమైన స్త్రీ హింస ఇంకా ఎన్నాళ్ళు?



కోపంగా నారాయణుని వంక చూసింది. ఇద్దరి మధ్య తగాదా ఎప్పుడు ముదిరి పాకాన పడుతుందా అని ఆశగా ఎదురు చూస్తున్న నారదుడు పిల్లిలా స్వామి తలవద్ద చేరాడు.

"స్వామీ ఆవిడ కోపం వామనావతారంలా అలా అలా పెరిగిపోతున్నది. పోనీ... నువ్వొక్కసారి ఆవిడ కాళ్ళు పట్టుకోరాదూ?" సలహాఇచ్చాడు.

'సరే' అన్నట్లు తల ఊపి అంతలోనే ఏదో గుర్తుకొచ్చినట్లుగా 'ఊహుం' అన్నట్లు తల అడ్డంగా ఆడించాడు.

"ఏం?" అడిగాడు నారదుడు.

"ఒకసారి పట్టుకున్నానయ్యా" మెల్లగా అన్నాడు స్వామి. ఏమీ ఎరగని వానిలా తన చెవిని స్వామి నోటి వద్ద ఆనించాడు నారదుడు.

"తలపై పారిజాత పుష్పం తేలేదన్న కోపంతో తన్నింది కదా... ఎడమ కాలితో" ముఖాన్ని తడుముకున్నాడు నారాయణుడు.

"ఓహో! సత్యభామ సంగతా! బాగుంది బాగుంది!" నవ్వాడు నారదుడు.

"ఉష్.." అన్నాడు నారాయణుడు-



ఇప్పుడా సంగతి గుర్తుచేస్తే మళ్లీ అదే సీన్ రిపీట్ అవుతుందేమో నన్నట్టుగా... సింబాలిక్‌గా..!

-(ఇంకావుంది)

# వీణ కుప్పయ్య

(18వ శతాబ్దం)

శ్రీ త్యాగరాజ స్వామి వారికి చాలా శిష్య గణం ఉంది..

అందులో వీణ కుప్పయ్యర్ ఒకడు.

అయితే ఆ వీణ కుప్పయ్యర్ - ఈ వీణ కుప్పయ్యా ఒకరు కాదు

ఈయన వీణా... ఈయన కథ.. ఈయన కమామీషూ వేరు...

శ్రీరంగ పట్టణాన్ని సుల్తానులు ఏల్తున్న రోజుల్లో...

కర్ణాటక సంగీతానికి అంత ప్రాధ్యాత ఇచ్చేవారు కాదు...

ప్రాధాన్యత ఏమిటీ... విసుక్కునేవారు... అలాగ సంగీతానికి ఎప్పుడైతే ప్రాముఖ్యం పోయిందో... వీణకుప్పయ్య శ్రీరంగ పట్టణం నించి బిచాణా ఎత్తేసి!...

తంజావూరు ప్రయాణం కట్టాడు.

- తంజావూరు చోళ సామ్రాజ్యం!!

మాంచి పాడి పంటలతోటీ -

సుమస్త వైభోగముతో... వెలిగిపోతోంది

సంగీత - సాహిత్యాలకి నీరాజనాలు పడ్తున్నది!!

చోళ రాజ్యమే రాజ్యం - కావేరి నదే - నది- అన్నది అవ్వైయ్యార్...!

తంజావూరుని కంటికి రెప్పలా కాపాడ్తున్నవాడు!!

బృహదీశ్వరుడు!...

బృహత్ - ఈశ్వరుడు ( అంటే పేద్ద ఈశ్వరుడు అని అర్థం)

అంచేత... బృహదీశ్వరాలయాన్ని - పెరియకోయిల్ (అంటే పెద్ద గుడీ అని అర్థం)అంటారు.

నిజంగా ఎంత పెద్ద ఈశ్వరుడనీ...

లింగం ఎత్తు పదమూడు అడుగులు...

అభిషేకం చెయ్యాలంటే నిచ్చెనెక్కాల్సిందే!...

ఆ భారీలింగాన్ని... నర్మదా నదినించి ఆరోజుల్లో ఎలాతెచ్చారో!

ఆ లింగాన్ని ఆరడుగుల పానవట్టం మీద ఎక్కించిన - 'ఇంజనీర్'కి కూడా... అక్కడో చిన్నగుడి కట్టారు.

అదీ వాళ్ళ సంస్కారం!...

తల్లిదండ్రుల్తో - అన్నదమ్ముల్తో తంజావూరొచ్చిన వీణ కుప్పయ్య మొదట బృహదీశ్వరాలయాని కెళ్ళి

రుద్రాభిషేకం చేసుకునీ -

ప్రభువుల ఆస్థానంలోకి అడుగుపెట్టాడు.

సరే యాచకః యాచకః శత్రుః

అన్నట్టు - తంజావూరు ఆస్థానంలో ఉండే సంగీత విద్వాంసులు వీణకుప్పయ్యని ఆస్థానంలోకి రానివ్వకుండా శతవిధాల ప్రయత్నించారు!!

శ్రీనాథుణ్ణి... రాజదర్శనం చేయడానికి అడ్డుపడ్డ డిండిమబట్టుకి మల్లే.... అయితే భగవదనుగ్రహం కలగలగానీ దర్శనం ఎంతసేపూ!....

మరో దిక్కులేని వీణకుప్పయ్యా...

బృహదీశ్వరాలయంలో మకాంపెట్టీ...

ఉషోదయాన్నే బృహదీశ్వరుడికి రాగార్చన... స్వరాభిషేకం చేస్తున్నాడు!

వీణలోంచి...నమకచమకాలు .. గమక సహితంగా వొలుకుతున్నాయ్...

అవి సోమవారం - దర్శనం చేసుకోవడానికొచ్చిన రాజుగారి చెవిన పడ్డాయ్...

ఒళ్ళు పులకించింది!... పరమేశ్వరుడి నెత్తిమీదనించి ఓ మందారం రాలి!... కిందపడింది! - ఏరుకునీ నెత్తినెట్టుకోపోతున్నట్టు...

శివుడి ఆజ్ఞ అయింది!...

రాజు శిరసావహించాడు...

మర్నాడే... ఆస్థానంలో.... కుప్పయ్య వీణావాదన - ప్రదర్శన...

ఆస్థాన సంగీత విద్వాంసులు... విషం గక్కడానికి సిద్ధంగా!...

పామరులంత అమృతం గ్రోలడానికి సంసిద్ధంగా ఉన్నారు!...

అంబ నవాంబ జోజ్వల కరాంబుజ... అయిన సరస్వతీ దేవిని ప్రార్థించాడు.

వరవీణా మృదుపాణి... చిరునవ్వుతో ఆశీర్వదించింది.

వీణకుప్పయ్య వీణ మోగింది...

వీణ-కుప్పయ్య చేతిలో గిలకైపోయింది!...

వీణ-కుప్పయ్య చేతి చిలకైపోయింది.!!

కుప్పయ్య సీతారాముడల్లే... వీణ- శివధనువు....

కుప్పయ్య బాలకృష్ణుడైతే... వీణ- గోవర్ధనం...

నారదుడు వొంగిచూస్తున్నాడు...

తుంబురుడు తొంగిచూస్తున్నాడు....

మహతీ - కళావతీ బిత్తరపోతున్నాయ్...

కచ్ఛపి - కరువుదీర నవ్వుకుంది!! - కడుపునిండిపోయింది శారదాదేవికి.




సంగీత విద్వాంసుల మొహాలు అల్లనేరేడు పళ్ళయిపోయాయ్! నల్లగా...

రసికుల వదనాలు పొద్దుతిరుగు పూలైపోయాయ్!! పచ్చగా...

కరతాళ ధ్వనులలో ఆస్థానం దద్దరిల్లిపోయింది!

వీణకుప్పయ్య కళ్ళలోంచి రెండు కన్నీటి బిందువులు వీణ తీగలమీద.... ఊయలలూగాయ్...

రాజావారు పులకించిపోయారు!!

"పుంభావసరస్వతీ... నీకిదే మా ఆహ్వానం...

మీరు మా ఆస్థాన విద్వంసులైతే... మా జన్మ ధన్యం...

మిమ్మల్ని గౌరవించుకునే అదృష్టాన్ని మాకు ప్రసాదించండి"

ఎంతో వినయంగా అడిగాడు మహరాజు... శిరసువొంచి.

మెల్లగా తలెత్తి... సరే అన్నట్టు ఊపాడు... వీణకుప్పయ్య...

ఆస్థాన విద్వాంసుల తలలు శాశ్వతంగా వాలిపోయాయ్!!

వెంటనే దానశాసనం రాయించారు ప్రభువులు...

కపిస్థలం - అనేచోట ఎనభై ఎకరాల సుక్షేత్రమైన భూమి!!

నెలకి అరవై 'పొన్నాలు' (పొన్న - అంటే తమిళంలో బంగారం బహుశ బంగారు నాణాలై ఉండొచ్చు)

వెండివీణ!!

* * *

హాయిగా గడిచిపోతోంది జీవితం...

అష్టైశ్వర్యాలు... సర్వభోగాలూ అనుభవిస్తూ...

చక్కటి సంతానం.... కొడుకు ... అనంతయ్య

అనంతయ్య కూడా వీణ అబ్బింది!!
అబ్బడమేమిటి... వేళ్ళు... దేన్ని మీటినా వీణానాదం పలికేది...
రాజావారు ముచ్చట పడీ!...
వీణకుప్పయ్యకీ - కొడుకు అనంతయ్యకీ... సరదాగా పోటీ పెట్టారు.
గురువుని మించిన శిష్యుడై -
తండ్రిని మించిన కొడుకై... అనంతయ్య తండ్రిని ఓడించేసాడు!
సభ- విస్తుపోయింది!
వీణకుప్పయ్య స్థాణువైపోయాడు!!
వీణకుప్పయ్య... పరుగెత్తుకొచ్చి...
కొడుకు అనంతయ్యని గాఢలింగనం చేసుకునీ...
వీణ వాయించిన కుడిచేతిని ముద్దు పెట్టుకునీ...
ముద్దు పెట్టుకుంటున్నట్టు నటించీ... బొటనవేలు ఊడిపోయేలా కొరికేసాడు!!



బొటనవేలు ఊడి కింద పడిపోయింది!

నోరంతా రక్తంతో - మొహం అంతా అవమాన భారంతో సభనించి పెద్ద పెద్ద అంగలేసుకుంటూ వెళ్ళిపోయాడు వీణ కుప్పయ్య...

స్పర్ధయా వర్ధతే విద్యా అన్నారు... కానీ ఇక్కడ కన్న కొడుకు బొటనవేలుని మింగేసింది!!

అనంతయ్య... వెండి తొడుగు చేయించీ మొండి బొటన వేలుకి తొడిగీ... వీణవాయిస్తూనే ఉన్నాడు!!

తను తండ్రిని క్షమించాడు!
కానీ చరిత్ర క్షమించదు గదా!!

-తనికెళ్ళ భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునేవారు
**తనికెళ్ళ భరణి,**
**కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212,**
**మోతీనగర్, హైదరాబాదు - 500 018**
**అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.**

---

# ఘంటసాల క్విజ్

| | | |
|---|---|---|
| మొదటి బహుమతి | : రూ. 250/- | మరియు ఘంటసాల కలర్ ఫోటో |
| రెండవ బహుమతి | : రూ. 200/- | |
| మూడవ బహుమతి | : రూ. 150/- | |

క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-8

1. ఘంటసాల, ఎ.పి.కోమల కలిసిపాడిన తొలిచిత్రం?
జ: ....................

2. ఘంటసాల సంగీత దర్శకత్వం వహించినా ఆయన ఒక్కపాట కూడా పాడని చిత్రం ?
జ: ....................

3. ఘంటసాల, జేసుదాసు కలిసిపాడిన చిత్రం పేరు?
జ: ....................

4. ఘంటసాల సంగీత దర్శకత్వంలో జిక్కీ పాడిన తొలి చిత్రం?
జ: ....................

5. ఘంటసాల, ఎస్.వి.రంగారావుకు తొలిసారిగా పాడిన చిత్రం?
జ: ....................

పంపినవారి పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 31-8-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.



"కూరలో ఏమయినా తక్కువయ్యిందా?"
"ఒక్కటి తక్కువయింది"
"ఏంటండి అది"
"రుచి"

అత్తగారు : బియ్యం కడిగి స్టవ్‌పై పెట్టు
కొత్తకోడలు : సబ్బుతోనా, సర్ఫ్ తోనా అత్తయ్యా...



"పెళ్లికి ముందు ఆర్తీ అగర్వాల్‌లా, సోనాలీ బింద్రేలా వుంటావని తెగ పొగిడేవారు, ఇప్పుడలా పొగడరేమిటి?"
" ఏ బ్యాడ్ హాబిట్స్ ఉన్నా సరే పెళ్లయ్యాక మానెయ్యాలని చెప్పావు గా... అందుకే ముందుగా అబద్ధాలాడ్డం మానేశా".



**ఈ జోక్‌లను పంపినవారు : ఎల్.శ్రీనివాస్‌రెడ్డి, కొంగరకలాన్.**

"సార్! మన సినిమాలో 8 పాటలు పెడ్తున్నాం" చెప్పాడు డైరెక్టరు నిర్మాతతో ఆనందంగా.
నిర్మాత ఆలోచిస్తూ ఉండిపోయాడు.
"ఏంటి? ఆలోచిస్తున్నారు" అడిగాడు డైరెక్టరు.
"ఆ! ఏం లేదు. మన సినిమాకు అన్ని ఇంట్రవెల్స్ అవసరమా అని" అన్నాడు నిర్మాత బుర్రగోక్కుంటూ.



"ఏంటి బాబూ! ఆ ఇంటి ముందు అంతమంది జనం ఉన్నారు. జాతకాలు గాని వాస్తు గాని చెబ్తారా"
"అదేం కాదండీ...! ప్రసారం అవుతున్న టీవీ సీరియల్స్‌లో ఏ సీరియల్ ఎప్పుడు అయిపోతుందో కరెక్ట్‌గా చెబ్తాడుట."



**ఈ జోక్‌లను పంపినవారు : శాస్త్రి, సంగారెడ్డి.**

"ఏంట్రా! అలా వడుతూ లేస్తూ పరుగెడుతున్నావ్?"
"నేను ప్రేమించిన రాణి 'నువ్వొట్టి చెడ్డవాడివి' అని అంది. వడ్డవాళ్ళ చెడ్డవాళ్ళు కాదని మా అమ్మ చెప్పింది. అందుకని...."



**ఈ జోక్‌ను పంపినవారు**
**పలవర జగదీష్, లక్ష్మీపేట (కడప).**

"నా వయసు పదహారేళ్లే!" అంది హీరోయిన్ విలేఖరితో.
"అలాగే రాస్తాం తల్లీ కాకపోతే ఆ పదహార్లు రెండా... మూడా... అని...!?" అర్థం కాక అడిగాడు విలేఖరి మళ్ళీ.



"ఊరినుండి మా పనిమనిషి, వంటమనిషి, బట్టలుతికే ఆవిడ వచ్చింది".
"అదేమిటి ముగ్గురు వస్తే 'వచ్చారు' అని అనాలి కదా! 'వచ్చింది' అంటావేమిటి?"
"వచ్చింది మా ఆవిడ కదా!"



**ఈ జోక్‌ను పంపినవారు**
**ఎం.వీరేశ్వరరావు, కె.పి.హెచ్.బి, హైదరాబాద్.**

భార్య : ఆలుమగల నడుమ అనురాగం ఎలా వుంటే బావుంటుందో నాకర్థమయ్యేలా చెప్పరూ?
భర్త : అప్పుడప్పుడూ కట్టుకునే పట్టుచీరలా కాకుండా... రోజూ కట్టే కాటన్ చీరలా వుంటే బావుంటుంది...



**ఈ జోక్‌లను పంపినవారు : లకనం మూర్తి, కాకినాడ.**



"నా మేకప్ ఎలా ఉంది?"

"సూపర్బ్. అయినా ప్రతిరోజూ ఇలానే చేసుకొస్తావు గదా!... ఈ రోజు ప్రత్యేకంగా అడుగుతున్నావేం?"

"ఏం లేదు. ఆఫీసులో ఒక్కరు కూడా నా వంక కన్నెత్తి చూడకపోతేనూ..."



"ఏంటే! ఎప్పుడూ వేపుడు కూరలే పెడతావు... తినలేక చస్తున్నా. ఏదైనా పచ్చడి చెయ్యొచ్చు కదా!"

"నేను పెట్టింది తినకపోతే చెయ్యబోయేది అదే"

**ఈ జోక్‌లను పంపినవారు : బి.వి.ఎస్.బాబు, తెనాలి.**

ఒకతను మూడో అంతస్తులో ఉన్న తన ఇంట్లోంచి ఆఫీసుకు వెళదామని క్రిందకు వచ్చాడు. బాల్కనీలో ఉన్న తన భార్యకు టాటా చెప్దామని తల పైకెత్తి చూసాడు. అప్పుడామె తన వేలు ఊపుతోంది. పైకి రమ్మని సైగ చేసిందని ఆయాస పడుతూ పైదాకా వెళ్లి కారణం అడిగాడు.

"ఏం లేదు... నా వేలికి ఎంత బల ముందో చూద్దామని..." అందామె కూల్‌గా.



విద్యుత్తు విభాగంలో పనిచేసే ఒక అధికారి ఉదయం 8 గంటలకు తన డ్యూటీ పూర్తి చేసుకొని బయటకు వచ్చేసరికి స్ట్రీట్ లైట్లు వెలుగుతున్నట్లు గమనించాడు. మార్నింగ్ డ్యూటీ చెయ్యవలసిన వాళ్లందరూ వచ్చేసరికి 11 గంటలు అయింది. ఇంకా స్ట్రీట్ లైట్లు వెలుగుతూనే వున్నాయి. ఇక భరించలేక వెంటనే ఆఫీసుకి వచ్చి అక్కడ ఉన్న ఓ క్లర్కుని అడిగాడు "ఈ లైట్లు ఇలా వెలగడానికి కారణం ఎవరు?!"

"థామస్ ఆల్వా ఎడిసన్"

అని సమాధానం చెప్పాడా క్లర్కు నింపాదిగా.





మొదటి రాత్రి వధువుతో వరుడు : "ప్రేమ సాగరంలో మునిగిపోదాం... రా..."

వధువు : "ఒద్దండీ... నాకీత రాదు... పైగా జలగండం కూడా ఉందని చెప్పారు మా జ్యోతిష్కులు."



ఓ పిచ్చివాడు: "నేను తక్షణమే ఢిల్లీకి వెళ్లి ప్రధాన మంత్రిగా ప్రమాణ స్వీకారం చేద్దామనుకుంటున్నాను."

రెండోపిచ్చివాడు: "పిచ్చివాడా నీవు అక్కడకు వెళ్లి ఏం ప్రయోజనం నేను రిజైన్ చెయ్యాలి కదా..."

టీచరు : "లింగాలు ఎన్ని రకములు...అవి ఏవి?"

విద్యార్థి : "నాలుగు రకములు

టీచరు :"నాలుగా...స్త్రీ లింగం, పుంలింగం, నపుంసక లింగం... కాక ఇంకేం లింగం ఉందిరా?

విద్యార్థి: "శివలింగం సార్"






ఇద్దరు లారీ డ్రయివర్లు ఒక మ్యూజియం చూద్దామని వెళ్లారు. అక్కడ ఒక అస్థిపంజరం, దాని కింద బిసి. 1560 అని వ్రాసి ఉంది

మొదటి డ్రయివరు: లారీ క్రింద పడి చచ్చిపోయిన వాడి కళేబరంలా ఉంది!

రెండో డ్రయివరు: ఔనౌను ఇదిగో దీని కింద లారీ నంబరు కూడా ఉంది.

**ఈ జోకులను పంపినవారు: జి.బి.లక్ష్మి, హైదరాబాద్.**

"The sweetest songs are those that tell our saddest thoughts" అన్నాడు ఆంగ్ల కవి.

"హై సబ్ సే మధుర్ వో గీత్ జిన్హే, హమ్ దర్దకే సుర్‌మే గాతే హై" అన్నాడు హిందీ కవి(తలత్ స్వరంలోనే అనుకొండి)

వెరసి, విషాదం, దుఃఖం, వైరాగ్యం సంగీతాన్ని ఆ పాత మధురం చేసే లక్షణాలని అందరూ ఒప్పుకుంటారు. ఈ భావాలను అత్యద్భుతంగా పలికించే స్వరం ఎవరిది? అని ఏ క్విజ్‌లోనైనా అడిగితే, మల్టిపుల్ ఛాయిస్ అవసరం లేకుండా వచ్చే ఏకైక సమాధానం ముఖేశ్. సైగల్, తలత్‌లలో కూడా ఈ సామర్థ్యం పుష్కలంగా ఉంది. కానీ వాళ్ళు పాడితే గంధర్వులు పాడినట్టుంటుంది. ఆ విషాదం మన లోకానికి సంబంధించి కాదు. ఎవరో దివ్యులు తమకే ప్రత్యేకమైన లోకంలో, తమకే ప్రత్యేకమైన దుఃఖంతో పాడుతున్న పాటలు వాళ్ళవి. కానీ ముఖేశ్ ది మన గొంతుక. మానవమాత్రులు, రక్తమాంసాలు, రాగద్వేషాలకు సంబంధించిన స్వరం. మామూలు మనిషి హృదయం లోతులోంచి తన్నుకువచ్చే కన్నీళ్ళు. ముఖేశ్ పాటలు అతని కంఠం నుంచి ప్రారంభమై మన కళ్ళలోంచి అశ్రుధారగా ప్రవహించే సజీవనదులు. వాటికి ఆనకట్ట వేయడం అసాధ్యం, అవాంఛనీయం కూడా.



# విషాదగాన విశారదుడు ముఖేశ్

హిందీ చిత్రసీమలో తక్కిన గాయకులందరి కంటె ఎక్కువగా ఒకే నటుడితో ఐడెంటిఫై అయిన గాయకుడు ముఖేశే. రాజ్‌కపూర్‌కు అతని స్వరం అద్భుతంగా నప్పిన మాట మళ్ళీమళ్ళీ చెప్పనక్కర్లేదు. అయినా ...... 'మేరా జూతాహై జపానీ'(శ్రీ 420-1955), 'ఆవారాహూ' (ఆవారా-1951), డమ్‌డమ్‌డిగాడిగా (ఛాలియా-1960) అని ఆకతాయిగా పాడినా, 'సబ్‌కుఛ్ సీఖాహమ్‌నే న సీఖీ హోషియారీ' (అనాడీ-1959) 'దీవానా ముఝ్‌కో లోగ్ కహే' (దీవానా-1967) అని అమాయకత్వం ప్రకటించినా, 'హమ్ తుఝ్‌సే మొహబ్బత్ కర్‌కే సనమ్' (ఆవారా-1951), 'దోస్త్ దోస్త్ న రహా' (సంగమ్-1964), జానేకహాఁగయే వో దిన్ (మేరా నామ్ జోకర్-1970) అని అశ్రువులు రాల్చినా - రాజ్‌కపూర్‌ను కళ్ళముందు సాక్షాత్కరింపచేసిన స్వరవిన్యాసం ముఖేశ్‌దే. రాజ్‌కపూర్‌కు లభించిన అసాధారణ విజయంలో ముఖేశ్ పాత్ర కూడా అంత అద్వితీయమైందే.

'రసం' కావడానికి వీల్లేని వైరాగ్యంలోనూ రససృష్టి చేయడం ముఖేశ్ గొప్పదనం.

'జీవన్ సప్‌నా టూట్ గయా' (అనోఖాప్యార్-1948)

'జావూంకహాఁ బతాయే దిల్' (ఛోటీ బహన్-1959)

'దిల్‌జల్‌తాహైతో జల్‌నేదో' (పెహలీ నజర్-1945)

అని జీవితేచ్ఛ నశించినట్టు పాడుతూ కూడా ఆనందం కలిగిస్తాడు.

ఒక్క పదం పలకడంలోని నవ్యత ద్వారా గొప్ప భావం పలికించడం రఫీ తర్వాత ముఖేశ్‌లో చూస్తాం.

'హమ్‌నే తుఝ్‌కో ప్యార్ కియాహై జిత్‌నా - కౌన్ కర్‌గా ఉత్‌నా' (దుల్హా దుల్హన్-1964) పాటలో 'కౌన్' అని సవాలు విసరడంలోనూ 'జిందగి ఖ్వాబ్‌హై - ఖ్వాబ్‌మే ఝూట్‌క్యా - ఔర్ భలా సచ్‌హైక్యా' (జాగ్తేరహో-1956) 'సబ్‌సచ్' పలకడంలోనూ 'మైనే తేరేలియేహీ సాత్ రంగ్‌కే సప్‌నేచునీ' (ఆనంద్-1970)లో 'మైనే' అనడంలోనూ.... 'తుమ్ అగర్ ముఝ్‌కో నచాహోగీ తో కొయీబాత్ నహీ తుమ్ కిసీ ఔర్ కో చాహోగీ తో బడీ ముష్కిల్' (దిల్‌హీతోహై-1963) లో 'ఔర్' అని బెదిరించడంలోనూ.... ఆ పాత్ర వ్యక్తిత్వాన్ని మనకు చూపిస్తాడు ముఖేశ్.

మన జీవితాల్లో విషాదం నిండినప్పుడల్లా పెదవుల మీద కదిలేవి ముఖేశ్ పాటలే. ప్రేమలో విసిగిపోయినపుడు...

"ముఝే తుమ్‌సే కుఛ్‌భీన బాహియే - ముఝేఖవేంరే హాల్‌పే ఛోడ్ దో' (కన్హయ్యా-1959)

"భూలీ హుయీ యాదే, ముఝే ఇత్‌నా న సతావో, అబ్ చైన్‌సే రెహనేదో మేరే పాస్ న ఆవో' (సంజోగ్-1961)

"తేరీ యాద్ దిల్‌సే భులానే చలాహూఁ కీఖుద్ అప్‌నీ హస్తీ మిటానే చలాహూ' (హరియాలీ ఔర్ రాస్తా-1962) వంటివి పాడుకుంటాం. ప్రపంచానికి దడిసి ప్రేమకు దూరమైనపుడు

'హమ్ చల్ రహేథే వో చల్ రహేథే
మగర్ దునియా వాలోంకీ దిల్ జల్ రహీథే' (దునియా న మానే-1959)

'ఆంసూ భరీ హై యే జీవన్ కీ రాహే
కోయీ ఉన్‌సే కెహదో హమే భూల్‌జాయే' (పర్వరిష్-1958)

'మైతో ఎక్ ఖ్వాబ్ హూ, ఇస్‌ఖ్వాబ్‌సే తూ ప్యార్‌నకర్' (హిమాలయేకీ గోద్‌మే-1965)

అని పాడుకుంటాం. వేదాంతం మనల్ని ఆవరించినపుడు -

'చల్ రే సజ్‌నీ అబ్ క్యా సోచే' (బొంబాయ్ కా బాబూ-1960)

'చల్ అకేలా చల్ అకేలా చల్ అకేలా
తేరే మేలా పీఛే ఛూటా రాహీ చల్ అకేలా' (సంబంధ్-1969)

'వో తేరే ప్యార్‌కా గమ్ - ఎక్ బహానా థా సనమ్
అప్‌నీ కిస్మత్ హీ కుఛ్ ఐసీ థీ కీ దిల్ టూట్‌గయా'(మై లవ్-1970)

'ఒహెరే తాల్‌మిలే నదీకీ జల్‌మే' (అనోఖీరాత్ -1968)

అని 'హమ్' చేస్తాం.

ముఖేశ్ విషాదం పలికించడంలో మొనగాడే కాదు. ఆనందాన్ని రొమాంటిక్ మూడ్‌నీ కూడా అంత భావస్ఫోరకంగానూ ఆలపించగలడు.

'చాంద్‌సీ మెహబూబా హో మేరీ కబ్
ఐసామైనే సోచాథా' (హిమాలయ్‌కీ గోద్‌మే-1965)

'ఐ సనమ్ జిస్‌నే తుఝే చాంద్‌సీ సూరత్ దీ హై
ఉసీ మాలిక్‌నే ముఝే భీతో మొహబ్బత్ దీ హై' (దీవానా-1967)

'ఓ మెహబూబా (సంగమ్-1964)

'కభీకభీ మేరే దిల్‌మే ఖయాల్ ఆతాహై' (కభీకభీ-1976)

'గోరీ తేరే చల్‌నేసే మేరా దిల్ కుర్‌బాఁ'

ముఖ్యంగా యుగళ గీతాల్లో సరదాగానూ, ఆనందంగానూ, చిలిపిగానూ, గంభీరంగానూ కూడా పలుకుతూ, సహ గాయకులతో పోటీ పడుతూ అద్భుత భావనా ప్రపంచాన్ని సృష్టించగలడు.

'జానే న నజర్ పెహచాన్ జిగర్ (ఆహ్)లో లతాతో సరదాతనం పలికే అదే లతాతో 'ఓ మేరే సనమ్ - దో జిస్మ మగర్ ఎక్ జాన్‌హై హమ్' (సంగమ్-1964)లో అంత వియోగ భారాన్ని వ్యక్తం చేస్తుంది.

ఆశాభోంస్లే, సుమన్ కల్యాణ్‌పూర్, కమల్ బారోట్, శారద, గీతాదత్, శంషాద్‌బేగం... ఇలా సుప్రసిద్ధ గాయనీమణులు, అంత ప్రసిద్ధం కాని గాయకుల వరకూ అందరితోనూ ఎన్నో పాటలు పాడాడు. ముఖేశ్ గొంతులోని 'మగసిరి' యుగళ గీతాలకు గొప్ప సొందర్యాన్నే తెచ్చిపెట్టింది.

ముఖేశ్‌ను తలుచుకోగానే గుర్తొచ్చే సంగీత దర్శకులు శంకర్ జైకిషన్. ముఖేశ్ హిట్‌సాంగ్స్‌లో 75 శాతం వారి సంగీత దర్శకత్వంలో పాడినవే. కానీ ముఖేశ్ కంఠంలోని విషాద మాధుర్యాన్ని అసామాన్య రీతిలో వెలికి తెచ్చిన సంగీత దర్శకుల్లో కల్యాణ్‌జీ ఆనంద్‌జీలను కూడా చెప్పుకోవాలి.

మొత్తంగా చూస్తే వీరి సంగీతం సమకాలీన సంగీత దర్శకులు చాలా మంది కంటె ఓ మెట్టు దిగువనే ఉంటుంది. కానీ ముఖేశ్‌కు పాట ఇవ్వాలనగానే వారిలో అసాధారణమైన ప్రతిభ వెలికి వచ్చిందేమో ననిపిస్తుంది. ఛలియా, హిమాలయ్‌కీ గోద్‌మే, దుల్హా దుల్హన్, సరస్వతీ చంద్ర, కుర్‌బానీ... ఇలా ఎన్నో ముకేశ్ పాటల్లో తలమానికమై - విన్నపుడల్లా గుండెల్ని పిండేసే -

'కోయీ జబ్ తుమ్హారా హృదయ్ తోడ్‌దే
తడప్‌తా హువా జబ్ కోయీ ఛోడ్‌దే
తబ్ తుమ్ మేరే పాస్ ఆనా ప్రియే
మేరా దర్ ఖులాహై - ఖులాహీ రహేగా తుమ్హారేలియే'

(పూరబ్ ఔర్ పశ్చిమ్-1970)



వీరి బాణీయే. అనిల్ బిశ్వాస్, నౌషాద్, ఎస్.డి.బర్మన్‌ల నుంచి ఉషా ఖన్నా, ఎస్.ఎన్.త్రిపాఠీ వంటి తక్కువ పేరున్న సంగీత దర్శకుల వరకూ, దిలీప్‌కుమార్, రాజ్‌కపూర్, మనోజ్‌కుమార్‌ల నుంచి రాజేశ్‌ఖన్నా, అమితాబ్ బచ్చన్‌ల వరకూ - ఎన్నో తరాల హీరోలకు పాడాడు ముఖేశ్.

జీవితంపై, భవిష్యత్తుపై ఆశ అంతరిస్తున్నపుడు 'వో సుబహ్ కభీతో ఆయేగీ' (ఫిర్ సుబహ్ హోగీ-1958) అంటున్న ముఖేశ్ గుర్తొస్తే చాలు. ఆశ, నమ్మకం చిగురిస్తాయి. దేవుణ్ణి గుర్తు తెచ్చుకోవాలంటే 'సజన్‌రే ఝూట్ మత్ బోలో ఖుదాకే పాస్ జానాహై' (తీస్రీ కసమ్-1966) అంటున్న ముఖేశ్‌ను తలుచుకుంటే చాలు మనసంతా నిర్మలమైపోతుంది.

వదనంలో ప్రసన్నత, గాంభీర్యం, హుందాతనం - స్వరంలో ఆత్మీయత, విషాదం, గాఢతా, అమాయకత్వం - వెరసి ముఖేశ్. హేమాహేమీల్లాంటి తోటి మగ గాయకులందరితో ధీటుగా పాడుతూ, అందరికంటె భిన్నంగా, పాటకు కొత్త అందాన్ని, గాఢతను కల్పిస్తూ, ఎటువంటి శ్రోతకైనా ఫేవరెట్ గాయకుడవుతూ, పాడిన ప్రతి పాటలో గుండె లోతుల్లోకి చొచ్చుకుపోయే అరుదైన గాయకుడు ముఖేశ్. అందుకే అతని వియోగాన్ని అతని పాట ద్వారానే మనం తలుచుకుంటాం.

'ఆజ్ తుమ్‌సే దూర్‌హోకర్. ఐసే రోయా మేరా ప్యార్
చాంద్ రోయా సాథ్‌మేరే - రాత్ రోయీ బార్‌బార్'

అన్న ముఖేశ్ లేకపోయినా, అతని పాటలు వింటూ చంద్రుడూ, రాత్రీ మనతో కలిసి, మన విషాదాన్ని పంచుకుంటాయి. అందుకే అతను అమరుడు. విషాదంలో ఆనందాన్ని రూపుకట్టించిన గాయకశిల్పి.

**- మృణాళిని**

---

# బాణీ ముత్యాలు

**సేకరణ :**
**డా॥ ఇ.ఎస్.సంపత్‌కుమార్**
**శ్రీకాకుళం**



**పశువులకన్నా పక్షుల కన్నా**
**మనిషిని మిన్నగ చేశాడు**
**బుద్ధిని ఇచ్చి హృదయాన్నిచ్చి**
**భూమే నీదని పంపాడు**
**బుద్ధికి హృదయం లేక**
**హృదయానికి బుద్ధే రాక**
**నరుడే ఈలోకం నరకం చేశాడు**

చిత్రం : దాగుడు మూతలు
పాట పల్లవి : దేవుడనే వాడున్నాడా

ఆత్రేయ



**దేవుడికి మొక్కునపుడు**
**హోటళ్లొ మెక్కునపుడు**
**రైళ్లలో ఎక్కినపుడు**
**బస్సుల్లో చిక్కినపుడు**
**హెచ్చన్నమాటరాదు**
**తగ్గన్నమాట లేదు**
**సహపంక్తి భోజనాన**
**కొంపేమి మునిగిపోదు**

చిత్రం : అందాలరాముడు
పాట పల్లవి : సమూహ భోజనంబు

కొసరాజు రాఘవయ్య చౌదరి



**ఇంటిలోన అరమరికలు ఉంటే**
**ఇల్లెక్కి చాటాలా**
**కంటిలో నలక తీయాలంటే**
**కనుగుడ్డు పెరికివేయాలా**

చిత్రం : తల్లా - పెళ్ళామా
పాట పల్లవి : తెలుగుజాతి మనది

సి.నారాయణరెడ్డి



**ఏ కళకైనా ఏ కల కైనా**
**జీవితరంగం వేదిక కాదా**
**ప్రజాధనం కాని కళా విలాసం**
**ఏ ప్రయోజనం లేని వృధా వికాసం**

చిత్రం : రుద్రవీణ
పాట పల్లవి : తరలిరాద తనే వసంతం

సిరివెన్నెల సీతారామశాస్త్రి



**ఎందరు ఏడ్చిన ఏడుపులో కృష్ణా గోదావరి**
**ఎందరి ఆరని కన్నీళ్లో అంతులేని కడలి**
**కడుపూరు నుండి కాడూరికి బదిలీ**
**మాయదారిలో ఈ మూడునాళ్ళ మజిలీ**

చిత్రం : మరో సీతకథ
పాటపల్లవి : ఎందరు ఏడ్చిన ఏడుపులో కృష్ణా గోదావరి

వేటూరి సుందరరామమూర్తి

# ముఖేశ్ సినీ గీతాలు



## బందినీ

రచన: శైలేంద్ర సంగీతం: ఎస్.డి.బర్మన్

ఓ జానే వాలే హెూ సకే తో లౌట్ కే ఆనా
యే ఘాట్ తూ యే బాత్ కహీం భూల్ న జానా ॥ఓ జానేవాలే॥
బచపన్ కే తేరే మీత్ తేరే సంగ్ కే సహారే
ఢూంఢేంగే తుఝే గలీ గలీ సబ్ యే గమ్ కే మారే
సబ్ యే గమ్ కే మారే
పూఛేగీ హర్ నిగాహ్ కల్ తేరా ఠికానా ॥ఓ జానేవాలే॥
హై తేరా వహాఁ కౌన్ సభీ లోగ్ హైఁ పరాయే
పర్‌దేశ్ కి గర్దిష్ మేఁ కహీఁ తూ భీ ఖో న జాయే
కాంటోఁ భరీ డగర్ హై తు దామన్ బచానా ॥ఓ జానేవాలే॥
దే దే కే యే ఆవాజ్ కోయీ హర్ ఘడీ బులాయే
ఫిర్ జాయే జో ఉస్ పార్ కభీ లౌట్ కే న ఆయే
హై భేద్ యే కైసా కోయీ కుఛ్‌తో బతానా ॥ఓ జానేవాలే॥

## ఆనంద్

రచన: గుల్జార్ సంగీతం: సలిల్ చౌధురి

మైఁనే తేరే లియే హీ సాత్ రంగ్ కే సప్‌నే చునే సప్‌నే సురీలే సప్‌నే
కుఛ్ హసతే కుఛ్ గమ్ కే తేరీ ఆంఖోఁ కే సాయే చురాయే రసీలీ యాదోం నే
ఓ మైఁనే తేరే లియే హీ...
ఛోటి బాతేఁ ఛోటి-ఛోటి బాతోం కి హై యాదోం బడీ
భూలేఁ నహీఁ, బీతీ హుయీ ఏక్ ఛోటి ఘడీ
ఆంఖోం బిఛాయే తేరే లియే ఇన్ రాహోంనే ॥మైనే॥
రూఠి రాతేఁ, రూఠి హుయీ రాతోం కొ మనాయా కభీ
తేరే లియే మిఠి సుబహ్ కొ బులాయా కభి
తేరే బినా భి తేరే లియే హి దియే జలాయే ఆహోఁ నే ॥మైనే॥
భోలే భాలే బోలే భాలే దిల్ కొ బహ్‌లాతే రహే
తన్హాయీ మేఁ తేరే ఖయాలోం కో సజాతే రహే
కభి-కభి తో ఆవాజ్ దేకర్ ముఝ్‌కో జగాయా ఖ్వాబోఁ నే
ఓ మైఁనే తేరే లియే హి సాత్ రంగ్ కే సప్‌నే చునే సప్‌నే సురీలే...

## ఛలియా

రచన: కమర్ జలాల్‌బాద్ సంగీతం: కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ

డమ్-డమ్ డిగా-డిగా, మౌసమ్ భిగా-భిగా
బిన్ పియే మైఁ తో గిరా మేఁ తో గిరా మేఁ తో గిరా
హాత్ అల్లా సూరత్ అప్‌కి సుబాన్ అల్లా హాయే అల్లా
తేరీ అదా తేరీ అదా వాహ్-వాహ్ క్యా బాత్ హై
అంఖియాఁ ఝుకి-ఝుకి బాతేఁ రుకి రుకి
దేఖో లుటేరా ఆజ్ లుట్ గయా హాయ్ అల్లాహ్...
సనమ్ హమ్‌నే మానా గరీబ్ హై
దంధా ఖోటా సహీ బన్దా ఛోటా సహీ
దిల్ యే ఖజానా హై ప్యార్ కా హాయ్ అల్లాహ్....
తేరి కసమ్ తు మేరి జాన్ హై
ముఖడా భోలా-భలా ఛుప్‌కే డాకా డాలా
జానే తు కైసి మెహమాన్ హై హాయ్ అల్లాహ్...

## మేరా నామ్ జోకర్

రచన: శైలేంద్ర సంగీతం: శంకర్-జైకిషన్

జానే కహాఁ గయే వో దిన్ కహ్‌తే యే తేరీ రాహ్ మేఁ
నజరోం కొ హమ్ బిఛాయేంగే చాహే కహీఁ భి రహో
చాహెంగే తుమ్‌కో ఉమ్ర్ భర్ తుమ్‌కో న భూల్ పాయేంగే ॥జానే కహాఁ॥
మేరే కదమ్ జహాఁ పడేఁ సజదే కియే యార్ నే
ముఝ్‌కో రులా-రులా దియా జాతి హుయీ బహార్ నే ॥జానే కహాఁ॥
అప్‌నీ నజర్ మేఁ ఆజ్‌కల్ దిన్ భి అంధేరీ రాత్ హైఁ
సాయా హి అపనే సాథ్ థా సాయా హి అపనే సాథ్ హై ॥జానే కహాఁ॥

## పర్‌వరిష్

రచన: హస్రత్ జైపురి సంగీతం: దత్తారాం

ఆంసూ భరీ హై యే జీవన్ కి రాహేఁ
కోయీ ఉన్‌సే కహ్ దే హమేఁ భూల్ జాయేఁ
వాదే భూలా దేఁ కసమ్ తోడ్ దేఁ వో
హాలత్ పే అపని హమేఁ ఛోడ్ దేఁ వో
ఐసే జహాఁ సే, క్యూం హమ్ దిల్ లగాయేఁ
కోయీ ఉన్‌సే కహ్ దే హమేఁ... భూల్ జాయే
బర్‌బాదియోం కి అజబ్ దాస్తాఁ హూ
షబ్‌నమ్ భి రోయే, మైఁ వో ఆస్‌మా హూ
తుమ్హే ఘర్ ముబారక్ హమేఁ అపనీ ఆహే
కోయీ ఉన్‌సే కహ్ దే హమేఁ భూల్ జాయే

## శ్రీ420

రచన:శైలేంద్ర సంగీతం: శంకర్-జైకిషన్

మేరా జూతా హై జపానీ యే పత్‌లూన్ ఇంగ్‌లిస్తానీ
సర్ పే లాల్ టోపీ రూసీ ఫిర్ భి దిల్ హై హిందుస్తానీ ॥మేరా జూతా॥
నికల్ పడే హై ఖులీ సడక్ పర్ అప్‌నా సీనా తానే అప్‌నా సీనా తానే
మంజిల్ కహాఁ-కహాఁ రుక్‌నా హై ఊపర్ వాలా జానే, ఊపర్ వాలా జానే
బఢ్‌తే జాయే హమ్ సైలానీ జైసే ఏక్ దరియా తూఫాని
సర్ పే లాల్ టోపీ రూసీ ఫిర్ భి దిల్ హై హిందుస్తానీ ॥ మేరా జూతా॥
ఊపర్ నీచే, నీచే ఊపర్ లహర్ చలే జీవన్ కీ.. లహర్ చలే జీవన్ కీ
నాదాఁ హై జో బైఠ్ కినారే పూఛే రాహ్ వతన్ కీ.. పూఛే రాహ్ వతన్ కీ
చల్‌నా జీవన్ కీ కహానీ రుక్‌నా మౌత్ కి నిషానీ
సర్ పే లాల్ టోపీ రూసీ ఫిర్ భీ దిల్ హై హిందుస్తానీ ॥మేరా జూతా॥
హోంగే రాజే రాజ్‌కుఁవర్ హమ్ బిగడే దిల్ షహజాదే బిగడే దిల్ షహజాదే
హమ్ సింహాసన్ పర్ జా బైఠే జబ్ జబ్ కరేఁ ఇరాదే జబ్ జబ్ దిల్ కరే
సూరత్ హై జానీ పహచానీ దునియా వాలోం కో హైరానీ
సర్ పేఁ లాల్ టోపీ రూసీ ఫిర్ భీ దిల్ హై హిందుస్తానీ ॥మేరా జూతా॥

## సరస్వతీ చంద్ర

రచన: ఇందీవర్ సంగీతం: కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ

చందన్ సా బదన్ చంచల్ చిత్‌వన్, ధీరే సే తేరా యే ముస్కానా
ముఝే దోష్ న దేనా జగ్ వాలోఁ ॥2॥ హో జావూఁ అగర్ మైఁ దివానా
యే కమ్ కమాన్ భవేఁ తేరి పల్‌కోం కే కినారే కజ్‌రారే
మాథే పె సిందూర్ సూరజ్ హై హోంఠోం పె దహక్‌తే అంగారే
సాయా భి జో తేరా పడ్ జాయే ॥2॥ ఆబాద్ హో దిల్ కా వీరానా ॥చందన్॥
తన్ భి సుందర్ మన్ భి సుందర్, తూ సుందరతా కి మూరత్ హై
కిసి ఔర్ కొ షాయద్ కమ్ హోగి, ముఝే తేరీ బహుత్ జరూరత్ హై
పహలే భి బహుత్ మైఁ తరస్ హూఁ ॥2॥
తు ఔర్ నా ముఝ్ కొ తర్‌సానా ॥చందన్॥

# తెలుగు సినీ గీతకోశం



| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 1066 | అన్నా వదినా మా కోసం | పెద్దన్నయ్య | 1976 | సత్యం | గోపి | ఎస్.జానకి, మోహన్‌రాజు |
| 1067 | చందమామ కన్నా చక్కని చిన్నా | పెద్దన్నయ్య | 1976 | సత్యం | దాశరథి | సుశీల |
| 1068 | చేసుకుందామా లవ్ చేసుకుందామా | పెద్దన్నయ్య | 1976 | సత్యం | అప్పలాచార్య | రమేష్, బి. వసంత |
| 1069 | తల్లిగా చెపుతాను మంచి మాట | పెద్దన్నయ్య | 1976 | సత్యం | గోపి | సుశీల |
| 1070 | ఎటు చూసినా ఒక బొమ్మే | పెద్దన్నయ్య | 1976 | సత్యం | గోపి | ఎస్.పి.బాలు, పి.సుశీల |
| 1071 | ప్రియతమా రాధికా | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | ఘంటసాల |
| 1072 | చల్లని గాలి చక్కని తోట | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1073 | మొన్న నిన్న చూశాను | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | ఘంటసాల |
| 1074 | తెలియని హాయి ఇది | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | సుశీల |
| 1075 | నాలోని మధుర ప్రేమ | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1076 | ప్రణయ వీధిలో ప్రశాంత నిశిలో | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | సుశీల |
| 1077 | పరుల మేలు కోరి గరళమ్ము | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | ఎల్.ఆర్.ఈశ్వరి, లతా |
| 1078 | అనగనగా ఒక చిన్నది | పెళ్లికాని పిల్లలు | 1961 | మాస్టర్‌వేణు | ఆరుద్ర | ఘంటసాల, సుశీల |
| 1079 | కరుణించరా శివశంకరా | పెళ్లికాని తండ్రి | 1976 | బి.శంకర్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1080 | మేఘాలలోనుండి మెరుపు దిగి వచ్చింది | పెళ్లికాని తండ్రి | 1976 | బి.శంకర్ | కొసరాజు | రామకృష్ణ, తదితరులు |
| 1081 | నడపరా బసవన్నా | పెళ్లికాని తండ్రి | 1976 | బి.శంకర్ | వేటూరి | ఎస్.పి.బాలు |
| 1082 | నీ చిరు నవ్వులతో | పెళ్లికాని తండ్రి | 1976 | బి.శంకర్ | | రామకృష్ణ |
| 1083 | నీలి నీలి ఆకాశంలో | పెళ్లికాని తండ్రి | 1976 | బి.శంకర్ | దాశరథి | ఎస్.పి.బాలు |
| 1084 | నీలి నీలి ఆకాశంలో | పెళ్లికాని తండ్రి | 1976 | బి.శంకర్ | దాశరథి | ఎస్.పి.బాలు, చంద్రశేఖర్ |
| 1085 | ఆడే పాడే పసివాడా | పెళ్లికానుక | 1960 | ఎ.ఎం.రాజా | చెఱువు ఆంజనేయశాస్త్రి | సుశీల |
| 1086 | ఆడే పాడే పసివాడా | పెళ్లికానుక | 1960 | ఎ.ఎం.రాజా | ఆత్రేయ | ఎ.ఎం.రాజా |
| 1087 | కన్నులతో పలుకరించు వలపులూ | పెళ్లికానుక | 1960 | ఎ.ఎం.రాజా | ఆత్రేయ | ఎ.ఎం.రాజా, సుశీల |
| 1088 | పులకించని మది పులకించు | పెళ్లికానుక | 1960 | ఎ.ఎం.రాజా | ఆత్రేయ | జిక్కి |
| 1089 | వాడుక మరిచెదవేలా | పెళ్లికానుక | 1960 | ఎ.ఎం.రాజా | ఆత్రేయ | ఎ.ఎం.రాజా, సుశీల |
| 1090 | ఆ రంగనాథుని పూల రథం | పెళ్లికూతురు | 1970 | ఎస్.పి.కోదండపాణి | కొసరాజు | ఎస్.పి.బాలు, మాధవపెద్ది |
| 1091 | చక్కని పిల్ల పక్కనే వుంది | పెళ్లికూతురు | 1970 | ఎస్.పి.కోదండపాణి | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 1092 | మేలిమి బంగరు నెలతల్లారా | పెళ్లికూతురు | 1970 | ఎస్.పి.కోదండపాణి | గురజాడ అప్పారావు | సుశీల, బృందం |
| 1093 | రాముని రూపమే | పెళ్లికూతురు | 1970 | ఎస్.పి.కోదండపాణి | దాశరథి | సుశీల |
| 1094 | వెర్రి మొర్రి వెంగళప్ప పుట్టినరోజు | పెళ్లికూతురు | 1970 | ఎస్.పి.కోదండపాణి | ఆరుద్ర | ఎస్.పి.బాలు, పిఠాపురం, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1095 | చల్లగ చూడాలి | పెళ్లినాటి ప్రమాణాలు | 1958 | ఘంటసాల | పింగళి | ఘంటసాల |
| 1096 | వెన్నెలలోనే వేడి ఏలనో | పెళ్లినాటి ప్రమాణాలు | 1958 | ఘంటసాల | పింగళి | ఘంటసాల, పి.లీల |
| 1097 | బృందావన చందమామ | పెళ్లినాటి ప్రమాణాలు | 1958 | ఘంటసాల | పింగళి | పి.లీల, ఘంటసాల |
| 1098 | నీతోనే లోకము | పెళ్లినాటి ప్రమాణాలు | 1958 | ఘంటసాల | పింగళి | పి.లీల, ఘంటసాల |
| 1099 | రావే ముద్దుల రాధ | పెళ్లినాటి ప్రమాణాలు | 1958 | ఘంటసాల | పింగళి | పి.లీల, ఘంటసాల |
| 1100 | ఆనాటి చెలిమి ఒక కల | పెళ్లిరోజు | 1968 | ఎం.ఎస్.శ్రీరాం | రాజశ్రీ | పి.బి.శ్రీనివాస్ |
| 1101 | అడుగుదామని వుంది నిన్నొకమాట | పెళ్లిరోజు | 1968 | ఎం.ఎస్.శ్రీరాం | రాజశ్రీ | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 1102 | జీవితాన మరువలేము ఒక రోజు | పెళ్లిరోజు | 1968 | ఎం.ఎస్.శ్రీరాం | రాజశ్రీ | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 1103 | మగువల వలలో | పెళ్లిరోజు | 1968 | ఎం.ఎస్.శ్రీరాం | రాజశ్రీ | పి.బి.శ్రీనివాస్ |
| 1104 | పెళ్లివారమండి | పెళ్లిరోజు | 1968 | ఎం.ఎస్.శ్రీరాం | రాజశ్రీ | పి.బి.శ్రీనివాస్, జమున |
| 1105 | ఎగిరెగిరి పడుతుంది వయసు | పెళ్లిరోజు | 1968 | ఎం.ఎస్.శ్రీరాం | రాజశ్రీ | పి.బి.శ్రీనివాస్, జానకి |
| 1106 | మారెను ప్రేమసుధా విషముగా | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | ఆరుద్ర | సుశీల |
| 1107 | నాలోని అనురాగమంతా | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | ఆరుద్ర | ఘంటసాల |
| 1108 | నిగనిగలాడే చిరునవ్వు | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | ఆరుద్ర | మాధవపెద్ది, ఎస్.జానకి |
| 1109 | పాడవే రాధికా ఆరంభించిన | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల |
| 1110 | పున్నమి వెన్నెల మురిపించెనే | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | ఆరుద్ర | సుశీల |
| 1111 | తెలుసుకో ఓ జవరాల | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | శ్రీశ్రీ | పి.బి.శ్రీనివాస్ |
| 1112 | ఏమని పిలవాలి నిన్నేమని పిలవాలి | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | శ్రీశ్రీ | ఘంటసాల, సుశీల |
| 1113 | ఇది రేయి కాదోయి గోపాలకా | పెండ్లి పిలుపు | 1961 | కె.ప్రసాదరావు | శ్రీశ్రీ | జిక్కి, ఎస్.జానకి |
| 1114 | చక్కనివాడే దొరికాడు | పెండ్లిపిలుపు | 1961 | కె.ప్రసాదరావు | శ్రీశ్రీ | జిక్కి & పార్టీ |
| 1115 | దేవుడు | పిచ్చోడి పెళ్లి | 1975 | సత్యం | ఆరుద్ర | ఎస్.పి.బాలు, కోరస్ |
| 1116 | నన్ను చూసేవంటే | పిచ్చోడి పెళ్లి | 1975 | సత్యం | గోపి | సుశీల |



# తెలుగు సినీ గీత కోశం

| నెం. | పాట | చిత్రం పేరు | సం॥ | సంగీత దర్శకుడు | రచన | గానం |
|---|---|---|---|---|---|---|
| 1117 | రోషమున్నా వేషమున్నా | పిచ్చోడి పెళ్లి | 1975 | సత్యం | గోపి | ఎస్.పి.బాలు, ఎస్.జానకి, కోరస్ |
| 1118 | వచ్చినవాడు ఫల్గుణుడు | పిచ్చోడి పెళ్లి | 1975 | సత్యం | కొసరాజు | ఎస్.పి.బాలు |
| 1119 | ఆడ జన్మకు కంటినిండా నిదుర | పిన్ని | 1967 | టి.వి.రాజు | ఆరుద్ర | సుశీల |
| 1120 | చన్నీటిలోన ఈ వేడి ఏలనో | పిన్ని | 1967 | టి.వి.రాజు | దాశరథి | సుశీల, పి.బి.శ్రీనివాస్ |
| 1121 | సైకిల్‌పై వన్నెలాడి పోతున్నది | పిన్ని | 1967 | టి.వి.రాజు | కొసరాజు | పిఠాపురం |
| 1122 | కలవాలి నిన్ను కలవాలి | పిన్ని | 1967 | టి.వి.రాజు | ఆరుద్ర | పి.బి.శ్రీనివాస్, ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1123 | ఏ తల్లి కన్నదిరా రాజా | పిన్ని | 1967 | టి.వి.రాజు | కొసరాజు | ఎల్.ఆర్.ఈశ్వరి, జిక్కి,బసవేశ్వర్, శ్రీరాములు |
| 1124 | ఏడవకు ఏడవకు వెర్రి నా తల్లి | పిన్ని | 1967 | టి.వి.రాజు | ఆరుద్ర | సుశీల |
| 1125 | చుక్కలలో దిక్కులలో | పొరుగింటి పుల్లకూర | 1976 | చక్రవర్తి | వేటూరి | సుశీల |
| 1126 | నీ కొంగున బంగారు రంగులతో | పొరుగింటి పుల్లకూర | 1976 | చక్రవర్తి | దాశరథి | రామకృష్ణ, ఎల్.ఆర్.అంజలి |
| 1127 | రాజును చూసిన కన్నులతో | పొరుగింటి పుల్లకూర | 1976 | చక్రవర్తి | అప్పలాచార్య | ఎస్.పి.బాలు, సుశీల |
| 1128 | వున్న దానితో పోరాటం | పొరుగింటి పుల్లకూర | 1976 | చక్రవర్తి | శ్రీశ్రీ | రామకృష్ణ, ఎల్.ఆర్.అంజలి |
| 1129 | ఆకాశ దీపం భావికి రూపం | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | సుశీల |
| 1130 | ఆశలు తీరు ఆనందం మీరు | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1131 | అందాల బాలయే | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | పి.బి.శ్రీనివాస్ |
| 1132 | లోకమునేలే రాజకుమారి | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | పి.బి.శ్రీనివాస్, సుశీల |
| 1133 | నీలాల చీర కట్టి | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | సుశీల, కోరస్ |
| 1134 | పడుచుపిల్ల వలచెనయ్యా | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | జి.కె.వెంకటేష్ |
| 1135 | అతి సొగసైన ఆమని ఎదలో | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | సుశీల |
| 1136 | అవనిలో ఏది నశించదు | ప్రజాశక్తి | 1983 | విశ్వనాథం రామ్మూర్తి | అనిసెట్టి | జి.కె.వెంకటేష్ |
| 1137 | నా చూపే పిలుపురా | ప్రతీకారం | 1969 | సత్యం | చెఱువు అంజనేయశాస్త్రి | ఎల్.ఆర్.ఈశ్వరి |
| 1138 | నారీ రస మాధురి | ప్రతీకారం | 1969 | సత్యం | చెఱువు అంజనేయశాస్త్రి | ఎస్.పి.బాలు, లతా, జయదేవ్ |
| 1139 | స్టాప్ లుక్ లవ్ అండ్ గో | ప్రతీకారం | 1969 | సత్యం | చెఱువు అంజనేయశాస్త్రి | జేసుదాస్, జానకి |
| 1140 | ఇది నీ దేశం ఇది నీ కోసం | ప్రతీకారం | 1969 | సత్యం | చెఱువు అంజనేయశాస్త్రి | ఎస్.పి.బాలు |
| 1141 | సింతపూవంటి సిన్నారిని | ప్రతీకారం | 1969 | సత్యం | చెఱువు అంజనేయశాస్త్రి | ఎస్.పి.బాలు, లతా, జయదేవ్ |
| 1142 | అంజలిదే గొనుమా | ప్రేమ బంధం | 1976 | కె.వి.మహదేవన్ | వేటూరి | సుశీల |
| 1143 | చేరేదెటకో తెలిసి | ప్రేమ బంధం | 1976 | కె.వి.మహదేవన్ | వేటూరి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1144 | పువ్వులా నవ్వితే | ప్రేమ బంధం | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1145 | ఏ జన్మకైనా ఇలాగే ఉందామా | ప్రేమ బంధం | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | సుశీల |
| 1146 | ఎక్కడున్నాను నేనెక్కడున్నాను | ప్రేమ బంధం | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల, రామకృష్ణ |
| 1147 | నీవెవ్వరవో చిరునవ్వులతో | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | ఎ.ఎం.రాజా, జిక్కి |
| 1148 | ఘల్లుఘల్లుఘల్లుఘల్లుగజ్జెల సంగీతం | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | జిక్కి బృందం |
| 1149 | నీకు పూర్తిగా తెలుసునుగా | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | జిక్కి |
| 1150 | విధి రాకాసి కత్తులు దూసి | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | ఎ.ఎం.రాజా |
| 1151 | ఏకాంతము సాయంత్రము | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | జిక్కి |
| 1152 | రారాదా మది నిన్నే పిలిచే కాదా | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | ఎ.ఎం.రాజా, జిక్కి |
| 1153 | నీ పేరు విన్నా నీ రూపు కన్నా | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | జిక్కి |
| 1154 | పందిట్లో పెళ్ళవుతున్నది | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | జిక్కి |
| 1155 | పాడు జీవితం యవ్వనం | ప్రేమలేఖలు | 1953 | శంకర్ - జైకిషన్ | ఆరుద్ర | ఎ.ఎం.రాజా |
| 1156 | బండి మీద పాలమ్మె | ప్రేమ పగ | 1978 | ఎస్.రాజేశ్వరరావు | కొసరాజు | ఎస్.పి.బాలు, రమోల |
| 1157 | బావా ఎప్పుడు వచ్చితీవు (పద్యం) | ప్రేమ పగ | 1978 | ఎస్.రాజేశ్వరరావు | ట్రెడిషనల్ | ఎస్.పి.బాలు |
| 1158 | చెల్లియో చెల్లకో (పద్యం) | ప్రేమ పగ | 1978 | ఎస్.రాజేశ్వరరావు | ట్రెడిషనల్ | ఎస్.పి.బాలు |
| 1159 | కలిసిన హృదయాలలోన | ప్రేమ పగ | 1978 | ఎస్.రాజేశ్వరరావు | దాశరథి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1160 | ఒక చిలక గోరువంక | ప్రేమ పగ | 1978 | ఎస్.రాజేశ్వరరావు | గోపి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1161 | పొంగే పొంగే వయసు | ప్రేమ పగ | 1978 | ఎస్.రాజేశ్వరరావు | సి.నారాయణరెడ్డి | ఎస్.పి.బాలు, సుశీల |
| 1162 | అయ్యో అయ్యో రామచంద్ర | ప్రేమాయణం | 1976 | కె.వి.మహదేవన్ | కె.వి.ఎన్.ఆచార్య | సుశీల |
| 1163 | చెప్పాలని చెద్ద ఆశ వున్నది | ప్రేమాయణం | 1976 | కె.వి.మహదేవన్ | సి.నారాయణరెడ్డి | బి.వసంత, రమేష్ |
| 1164 | మబ్బుల రాణివాసంలో | ప్రేమాయణం | 1976 | కె.వి.మహదేవన్ | దేవులపల్లి | ఎస్.పి.బాలు, రమేష్, విజయలక్ష్మి |
| 1165 | మనసే ఒక మణిదీపం | ప్రేమాయణం | 1976 | కె.వి.మహదేవన్ | కె.వి.ఎన్.ఆచార్య | సుశీల |

**సేకరణ: పున్నమరాజు శేషగిరిరావు, విశాఖపట్నం.**

వచ్చే సంచికలో మరికొన్ని

ఆగస్టు 18 గుల్జార్ పుట్టిన రోజు సందర్భంగా...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

## తేరే బినా జిందగీ సే...

ఆ : తేరే బినా జిందగీ సే కోయీ శిక్వా తో నహీం, శిక్వా నహీం, శిక్వా నహీం, శిక్వా నహీం
తేరే బినా జిందగీ భీ లేకిన్ జిందగీ తో నహీం, జిందగీ నహీం, జిందగీ నహీం, జిందగీ నహీం
కాష్ ఐసా హెూ తేరే కద్మోం సే చున్‌కే మంజిల్ చలేం, ఔర్ కహీం దూర్ కహీం (2)
తుమ్ గర్ సాథ్ హెూ మంజిలోం కీ కమీ తో నహీం॥తేరే బినా॥
జీ మేం ఆతా హై తేరే దామన్ మే సర్ ఛుపాకే హమ్ రోతే రహేం రోతే రహేం (2)
తేరీ భీ ఆంఖోం మేం ఆంసు వోంకీ నమీ తో నహీం

అ : తేరే బినా జిందగీ సే కోయీ శిక్వాతో నహీం శిక్వా నహీం, శిక్వా నహీం, శిక్వా నహీం
తేరే బినా జిందగీ భీ లేకిన్ జిందగీ తో నహీం, జిందగీ నహీం జిందగీ నహీం, జిందగీ నహీం
తుమ్ జో కహ దోతో ఆజ్ కీ రాత్ చాంద్ డూబేగా నహీం, రాత్‌కో రోక్‌లో
రాత్ కీ బాత్‌హై ఔర్ జిందగీ బాకీ తో నహీం



హిందీ చలనచిత్ర రంగంలో తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్న బహుముఖ ప్రజ్ఞాశాలి గుల్జార్. సున్నితమైన భావాలను అందమైన పదాలలో పొదిగే కవిగా, మానవ సంబంధాలను తెరపై అద్భుతంగా ఆవిష్కరించే దర్శకుడిగా, సహజమైన కథాకథనాలు అందించే రచయితగా ప్రజాదరణ పొందటమే కాకుండా ప్రభుత్వ సత్కారాలు కూడా అందుకున్నారాయన.



'భాషకు భావం బందీ కాకూడదు' అనేవారు పింగళి. అదే స్కూల్ ఆఫ్ థాట్‌కు చెందిన కవి గుల్జార్. ఆయన కవిత్వంలో భావాలు కొత్త రెక్కలు కట్టుకుని స్వేచ్ఛగా విహరిస్తాయి. ఆయన సాహిత్యాభినివేశానికి సంగీతాభిమానం తోడవటంతో తన చిత్రాల ద్వారా ఎన్నో ఆణిముత్యాల వంటి పాటలు అందించారు. సంగీతానికి జీవితంలో సహజమైన స్థానం ఉందని అంటారాయన.

గుల్జార్ అసలు పేరు సంపూరన్‌సింగ్. కవిగా తన కెరియర్ ఆరంభించిన గుల్జార్ 1961లో బిమల్‌రాయ్ ప్రొడక్షన్స్‌లో చేరి బిమల్‌రాయ్‌కి అసిస్టెంట్‌గా పనిచేశారు. 1963లో బిమల్‌రాయ్ తీసిన 'బందినీ' చిత్రంలోని 'మోరా గోరా అంగ్ లయ్‌లే' పాట ద్వారా గీత రచయితగా పరిచయమయ్యారు. హృషికేశ్ ముఖర్జీ, ఆసిత్‌సేన్ మొదలైన దర్శకుల చిత్రాలకు రచయితగా పనిచేశారు. 1971లో 'మేరే అప్నే' చిత్రం ద్వారా దర్శకుడిగా మారారు. తర్వాత 'కోశిశ్', 'పరిచయ్', 'ఆంధీ', 'మౌసమ్', 'కినారా', 'అంగూర్', 'ఇజాజత్', 'లేకిన్', 'మాచిస్' వంటి ఉత్తమ చిత్రాలను రూపొందించారు. 'కోశిశ్' చిత్రానికి ఉత్తమ స్క్రీన్‌ప్లే రచయితగా, 'మౌసమ్' చిత్రానికి ఉత్తమ దర్శకుడిగా, 'ఇజాజత్' చిత్రానికి ఉత్తమ గీత రచయితగా ఆయన జాతీయ అవార్డులు అందుకున్నారు. ఇవేగాక ఆయనకు ఎన్నో ఫిలింఫేర్ అవార్డులు కూడా లభించాయి. ఇటీవలి కాలంలో ఆయన 'దిల్‌సే', 'సత్య', 'అక్స్' చిత్రాలకు గీత రచయితగా పనిచేశారు. తన కుమార్తె మేఘనా గుల్జార్ తొలిసారిగా దర్శకత్వం వహించిన 'ఫిల్‌హాల్' చిత్రానికి కూడా ఆయనే పాటలు రాశారు.



గుల్జార్, ఆర్.డి.బర్మన్‌ల అనుబంధం ఎన్నో మరపురాని గీతాలకు ప్రాణం పోసింది. గుల్జార్ దర్శకత్వం వహించిన పరిచయ్, ఆంధీ, ఖుష్బూ, కినారా, కితాబ్, నమ్‌కీన్, లిబాస్, ఇజాజత్ చిత్రాలకు ఆర్.డి. సంగీతం అందించారు. 'ఇజాజత్' చిత్రంలోని 'మేరాకుఛ్ సామాన్' పాటని దాదాపు వచనం లాగే రాశారు గుల్జార్. ఆ పాటను చూసి ఆర్.డి. "ఈ లెక్కన ఎప్పుడో టైమ్స్ ఆఫ్ ఇండియా పేపర్ తెచ్చి ట్యూన్ కట్టమనేలా ఉన్నావు" అన్నారట. అయినా గుల్జార్‌కి ఏం కావాలో ఆర్.డి.కి తెలుసు. ఆ పాటకు ఆయన ఎంత మంచి ట్యూన్ చేశారంటే ఆ పాటను రాసిన గుల్జార్‌తో పాటు పాడిన ఆశాభోంస్లేకు కూడా జాతీయ అవార్డు వచ్చింది. 'కష్టమంతా ఆర్.డి.ది, అవార్డులు మావి' అన్నారు గుల్జార్ ఆ సంగతి గుర్తు చేసుకుంటూ.



ఇక 'ఆంధీ' చిత్రం విషయానికొస్తే ఇది రాజకీయ నేపథ్యంలో ఒక భార్యాభర్తల కథ. ఒక రాజకీయ నాయకుడి కూతురైన ఆర్తీ ఒక హోటల్ మేనేజర్‌ని ప్రేమించి పెళ్ళి చేసుకుంటుంది. వారికి ఒక కూతురు పుడుతుంది. ఆర్తీ తన తండ్రి ప్రోద్బలంతో రాజకీయాల్లో చేరి తన కాపురాన్ని నిర్లక్ష్యం చేస్తుంది. మనస్పర్థలు పెరిగి భర్తను, కూతుర్ని వదిలేసి వెళ్ళిపోతుంది. కొన్నేళ్ళ తరువాత ఎన్నికల ప్రచారానికి వచ్చి ఒక హోటల్లో బస చేస్తుంది. ఆమెభర్తే ఆ హోటల్ మేనేజర్. వారి కూతురు వేరే ఊళ్ళో చదువుకుంటూ ఉంటుంది. వారిద్దరూ సాయంత్రం వేళల్లో కలుసుకుంటూ ఉంటారు. ఈ విషయం తెలిసిన ప్రతిపక్షం వారు భార్యాభర్తలని తెలియక దుష్ప్రచారం చేస్తాయి. చివరకు ప్రతిపక్షం వారు నిర్వహిస్తున్న ఒక సభలో ఆమె తనపై వచ్చిన అపవాదులకు జవాబివ్వటానికి వేదిక ఎక్కి మాట్లాడుతుండగా ఆమె భర్త కూడా వచ్చి ఆమెకు తోడుగా నిలుస్తాడు. తర్వాత ఆమె ఎన్నికల్లో ఘనవిజయం సాధిస్తుంది. అలా ఆమె భర్త ఆమె ఎంచుకున్న రంగంలో అపజయం పొందకుండా తన సహకారం అందిస్తాడు.

ఆర్తీగా సుచిత్రాసేన్, ఆమె భర్తగా సంజీవ్‌కుమార్ చక్కగా నటించారు. ఈ చిత్ర కథ ఇందిరాగాంధీ జీవితాన్ని పోలి ఉందనే వదంతులు రావడంతో 1976లో ఎమర్జన్సీ సమయంలో కొంతకాలం పాటు ఈ చిత్రాన్ని నిషేధించారు.

విడిపోయిన తర్వాత కొన్నేళ్ళకు కలుసుకున్నపుడు నాయికానాయకులు పాత జ్ఞాపకాలు నెమరువేసుకునే సందర్భంలో వచ్చే పాట 'తేరె బినా జిందగీ సే'. ఈ పాట రూపకల్పన వెనక కూడా ఒక కథ ఉంది. ఆర్.డి. దుర్గాపూజ కోసం బెంగాలీ పాటలు రికార్డ్ చేస్తుండగా గుల్జార్ విన్నారు. వాటిలో ఒక ట్యూన్ ఆయనకు బాగా నచ్చింది. ఆ ట్యూన్‌కి తగ్గట్టు హిందీ పాట రాశారు. అదే ఈ పాట.

అతనికి దూరమై తాను కోల్పోయినదేమిటో ఆమెకు తెలును. గడిచిపోయిన కాలం తిరిగిరాదని తెలును. కానీ అతని సాన్నిహిత్యంలో దాని విలువ మరింత తెలిసింది. అదే ఈ పాటలో ద్యోతకమవుతుంది. ఈ పాటలోని విశేషమేమిటంటే వయసు మళ్ళిన జంట మధ్య ప్రేమ చూపించటం. సినిమాల్లో ఇలా చూపించటం అప్పట్లో ప్రయోగమనే చెప్పాలి. నాయకుడు నాయిక శాలువా సరిచేయటం వంటివి గుండెకు హత్తుకుంటాయి.

'తేరె బినా' అంటే 'నువ్వులేక' అని. 'జిందగీ' అంటే జీవితం. 'శిక్వా' అంటే 'తప్పు పట్టడం'.

**'నీవులేని జీవితంలో దోషమైతే ఏమీలేదు - కానీ**
**నీవులేని జీవితం జీవితం కానేకాదు'**

అతను లేకపోయినా జీవితం బాగానే గడుస్తోందనిపించింది అంతవరకు. కానీ ఆ జీవితం జీవితమే కాదని ఇప్పుడు అనిపిస్తోంది.

'కాష్' అనేది 'ఇలా అయితే బాగుండు' అనటానికి వాడతారు. 'కదమ్' అంటే అడుగులు. 'మంజిల్' అంటే మజిలీలు, గమ్యాలు. 'దూర్ కహీఁ' అంటే 'దూరమెక్కడికైనా', 'కమీ' అంటే కొదవ.

**'నీ అడుగుల వెంటే నా గమ్యమెంచుకుని**
**నడవాలని ఉంది దూరమెక్కడికైనా**
**నీవు తోడుంటే గమ్యాలకు కొదవేముంది'**

అతని తోనే జీవితం గడవగలిగితే బాగుండునని అనుకుంటోంది. అలా జరిగే అవకాశం లేదనే భావం కూడా ఉంది ఇందులో. తానెంచుకున్న మార్గాన్ని మధ్యలో వదలకూడదనే

పట్టుదల చూచాయగా కనబడుతుంది ఇక్కడ.

'దామన్' అంటే ఒడి. 'రోతే రహే' అంటే 'ఏడుస్తూ ఉండాలి' అని. 'ఆఁసూ' అంటే కన్నీళ్ళు. 'నమీ' అంటే తడి.

**'నీ ఒడిలోనే తలదాచుకుని ఏడవాలని ఉంది**
**నీ కనులలో కూడా కన్నీటి తడి లేదు కదా?'**

'మనసు భారమై కన్నీళ్ళు వస్తున్నాయి. నీ పరిస్థితి కూడా అలాగే ఉందా?' అని ఆమె తన మీద అతనికి ఇంకా ప్రేమ ఉందా అని మధన పడుతోంది. ఆ ప్రశ్నకు సమాధానమా అన్నట్టు అతను 'నీవు లేని జీవితం జీవితమే కాద'ని అంటున్నాడు.

'చాంద్ డూబేగా నహీఁ' అంటే 'చంద్రుడు అస్తమించడు' అని. 'బాకీ' అంటే మిగిలినది. తెలుగులో మనం ఈ పదాన్ని డబ్బుకు మాత్రమే అన్వయించి వాడతాం. హిందీలో మిగిలినది ఏదైనా ఈ పదమే వాడతారు.

**'నీవు ఔననంటే చంద్రుడు అస్తమించడీ రేయి, రేయిని ఆపేయి**
**ఈ రేయి దాటితే ఇక జీవితమేముంది'**

వారు కలుసుకునేది రాత్రి వేళల్లో. వయసు మళ్ళిన వారి జీవితాలకు ఇది సంకేతంగా అనుకోవచ్చు. ఆ జీవన సంధ్యను కరిగిపోనీయకుండా ప్రేమ అనే వెన్నెలను ఆస్వాదించాలని అతని కోరిక.

ఈ పాటతో పాటు ఈ చిత్రంలో 'ఇస్ మోడ్ సే జాతే హైఁ', 'తుమ్ ఆ గయే హో' పాటలు కూడా లతా, కిశోర్ పాడారు. ఈ పాటలన్నీ హిట్టే.

**- పి.వి.సత్యనారాయణరాజు**



# గుల్జార్ పేరుకి మీనా కుమారి ప్రతిష్ఠ

కవిగా, కథకుడిగా, మాటల రచయితగా, దర్శకుడిగా గుల్జార్ ఇవాళ ప్రసిద్ధుడు. ఒకప్పుడు ఆయన బిమల్‌రాయ్ వద్ద అసిస్టెంటుగా పనిచేసేవాడు. ఆ స్థాయినుండి ఈ స్థాయికి రావడానికి ప్రతిభకు తోడు కొందరు స్త్రీల తోడ్పాటు ఉందని అంటారు. అంటే వారు ప్రత్యక్షంగా పెట్టుబడి పెట్టి సినిమాలు తీయించారని కాదు. వాళ్లతో సన్నిహితంగా మెలగడం వలన మంచిగానో, చెడుగానో వార్తలలోకి ఎక్కడం, ఇతనెవరాని వాకబులు రావడం, తద్వారా అతడి విద్వత్తు బయటపడడం జరిగింది. ఇది గుల్జార్‌కి కెరియర్ పరంగా మేలు చేసినా 'లేడీస్ మాన్' అనే ముద్ర తెచ్చిపెట్టింది.

గుల్జార్‌కి తొలిసారిగా బాగా గుర్తింపు వచ్చింది, మీనాకుమారితో అతడి స్నేహం వలన. బిమల్‌రాయ్ "బేనజీర్" సినిమా తీసేరోజుల్లో కాళిదాస్ అనే డైరక్టర్ మీనాకుమారికి గుల్జార్‌ను పరిచయం చేశాడు. 'యే షాయర్ హై' అంటూ. కవిత్వం పట్ల ఎంతో ఆసక్తి ఉండి, అడపాదడపా కవిత్వం రాసే మీనాకుమారికి గుల్జార్ బాగా నచ్చాడు. 'ఇతన్ని ఇంతకుముందే ఎందుకు పరిచయం చేయలేదు?' అని కాళిదాసుని మందలించింది కూడా.

ఇది మీనాకుమారి భర్త కమాల్ అమ్రోహీకి రుచించలేదు. అతనసలే అనుమానం మనిషి. తనకి స్నేహితుడు, నమ్మకస్తుడు అయిన బాకర్ అలీని తన భార్యపై నిఘా వేయడానికి నియమించాడు. ఆమెతోపాటు స్టూడియోలకు పంపేవాడు. అవసరమయితే మీనాకుమారిపై చేయి చేసుకోవడానికి కూడా హక్కునిచ్చాడు. ఇది సహజంగానే మీనాకు రుచించలేదు.

మీనా తన కవిత్వం భర్తకు కూడా చూపించేది. కానీ అతను 'నీ మొహం ఇదో కవిత్వమా' అని ఈసడించేవాడు. కానీ గుల్జార్ ఓపిగ్గా అవన్నీ సవరించేవాడు. అందువల్ల అతనంటే ఇష్టం ఏర్పడిందామెకు. తన వెంట స్టూడియోలకు రమ్మనేది. 'పింజరే కే పంఛీ' సినిమా షూటింగ్ సందర్భంగా గుల్జార్‌ను తన వెంట మేకప్‌రూమ్‌కు రమ్మనమంది. బాకర్ అలీ అడ్డుపడ్డాడు. గుల్జార్ సంశయిస్తున్నా 'ఫరవాలేదు రా' అని మీనా లాక్కుపోయింది. ఇక బాకర్ అలీ సహించలేక మేకప్‌రూమ్ తలుపుతోసుకుని వచ్చి మీనా చెంప ఛెళ్ళుమనిపించాడు.



గుల్జార్ జన్మత సిఖ్ఖు అయినా కవి కావడం వల్లనో ఏమో మెతకగానే వ్యవహరించాడు. బాకర్ అలీని అడ్డుకోలేకపోయాడు. మీనా స్టూడియోలోనుండి బయటకు నడిచింది. ఆ వెళ్లడం, వెళ్లడం తన మరిది అయిన మెహమూద్ ఇంట్లో తలదాచుకుంది. కమాల్‌తో తెగతెంపులు చేసుకుంది. అండర్‌వరల్డ్‌తో కూడా సంబంధాలున్న బాకర్ ఏం చేస్తాడోనని భయపడి గుల్జార్ కొంతకాలం ఓ ఫ్రెండు ఇంట్లో తలదాచుకున్నాడు. ఈ సంఘటనతో గుల్జార్ పేరు అందరికీ తెలిసింది. మీనా మెచ్చిన కవిగా అతన్ని ఆదరించసాగారు.

'ఫూల్ ఔర్ పత్థర్' సినిమా చేస్తున్న టైములో మీనాకుమారి ధర్మేంద్రకు దగ్గరయినా గుల్జార్‌ని అభిమానించడం మాత్రం మానలేదు. గుల్జార్ తొలిసారిగా దర్శకత్వం వహించిన 'మేరే అప్నే' సినిమాలో ముఖ్యపాత్ర ఇచ్చినప్పుడు, ముసలమ్మ వేషమయినా సరేనని, సంతోషంగా అంగీకరించింది. తను మరణించినప్పుడు తన డైరీలు, పుస్తకాలు గుల్జార్‌కి చెందాలని విల్లు రాసింది కూడా!

**- సి.ఎస్.ఎన్.మూర్తి**







విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ. 40/-

తెలుగు వారందరికిష్టమయిన పండుగలలో కృష్ణాష్టమికి ఓ ప్రత్యేక స్థానం వుంది. ఆ విషయాన్ని గుర్తించి ఈ సంవత్సరం ఆగస్టు 21 న రానున్న కృష్ణాష్టమిని పురస్కరించుకుని శ్రీ కృష్ణునికి సంబంధించి తెలుగు సినిమాలలో వచ్చిన ఓ 16 సినీ గీతాలను, ఓ అష్టపదిని, ఓ రెండు శ్లోకాల్ని కలిపి 'శ్రీకృష్ణగానం' అనే మకుటంపై ఓ ఆడియో క్యాసెట్‌గా హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు.

పాడెద నీ నామమే గోపాలా (అమాయకురాలు), వద్దురా కన్నయ్యా (అర్థాంగి), తెల్లవారగ వచ్చె తెలియక నా సామి (చిరంజీవులు), మేలాయనీవేళ (చింతామణి), మాధవా మానినీ చిత్త చోరా (దొంగల్లో దొర), కరుణాలోల శ్రితజనపాలా (భక్త అంబరీష), జయ మురళీలోల గోపాలా (భక్త రఘునాథ్), అందరి వాడవని పేరేగాని కొందరి వాడవులే (ముగ్గురు మూర్ఖులు),వెన్నెలల వేళనే వేణువూదేనా (ఒక అమ్మాయి కథ), రేపే వస్తాడంట గోపాలుడు (కృష్ణప్రేమ), ప్రియతమా రాధికా (పెళ్ళి కాని పిల్లలు), అయ్యారే... చూడచక్కని చక్కనయ్య ఓరచూపులు చూసేవు (కలిమి లేములు), కృష్ణగానలోలా... రేపల్లె వాడలో వేడుకా (అత్తగారూ - కొత్త కోడలు), నీ పేరు తలిచిన చాలు (ఏకవీర), రావయ్యా నల్లనయ్యా (రామరాజ్యం), వేణుగానలోల గన వేయి కనులు చాలవుగా (రెండు కుటుంబాల కథ) మొదలైన గీతాలు, భక్త జయదేవ చిత్రంలో వుపయోగించిన ప్రియచారుశీలే అనే జయదేవుని అష్టపది, విప్రనారాయణలో భానుమతితో పాడించిన భజేనాంజలినాన తేన శిరసా, నమామి నారాయణపాదపంకజం అనే రెండు శ్లోకాలు ఈ క్యాసెట్‌లో పొందుపరచబడ్డాయి.

ఇది సమయాన్ని ఎరిగి, తగిన సందర్భ శుద్ధితో తెలివిగా రూపొందించిన క్యాసెట్. అందుకే విభిన్న రుచులను దృష్టిలో పెట్టుకుని అందులో ది బెస్ట్ అని చెప్పుకోదగ్గ పాటలను ఎన్నుకుని కలగలిపిన నైపుణ్యం కనిపిస్తుంది. ఈ రూపంగా బాగా వినమరుగై పోయిన చింతామణి, దొంగల్లో దొర, భక్త అంబరీష, భక్త రఘునాథ్, ఒక అమ్మాయి కథ, కృష్ణప్రేమ, కలిమిలేములు వంటి చిత్రాలలోని పాటలను శ్రోతల ముందుకు తీసుకురావటాన్ని ఎంతగానో ప్రశంసించి తీరాలి. అందుకు ముఖ్యంగా ఎంపికను, ఆ తరువాత సేకరణను ప్రత్యేకంగా పేర్కొనక తప్పదు.

ఇన్‌లే కవర్‌పై బాలకృష్ణుని వర్ణ చిత్రంతో పాటు పైన ఉదహరించిన భక్తి గీతాలను ఆలపించిన వారిలో ప్రముఖులైన వారి ఫోటోలను ముద్రించటం ఎంతో ఔచిత్యంగా ఉంది. ఇక ఇన్‌లే కవర్ లోపల ఇచ్చిన సాంకేతిక సమాచారంలో - 'ప్రియే చారుశీలే' కి 'లిరిక్ శ్రీజయదేవ' అని ఇచ్చే బదులు 'లిరిక్ ఫ్రమ్ జయదేవ అష్టపది' అని పేర్కొని వుంటే బావుండేది. లేకుంటే జయదేవుణ్ణి సినీ కవిగా ఈ తరం వారు గుర్తించే ప్రమాదం వుంది. ఏదిఏమైనా తెలుగు శ్రోతలలో రసజ్ఞుల పంట గత రెండు మూడేళ్ళుగా బాగా పండుతోంది. వారి వారి చిన్నతనంలో విని, తిరిగి విందామనుకుంటే దొరకని పాటలు రకరకాల కాన్సెప్ట్‌లతో ఈమధ్య విరివిగా రావటం ఆహ్వానించదగ్గ పరిణామం. ◆

---




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ. 80/-

ఆంధ్రుల ప్రియతమ గాయక జంట ఘంటసాల, సుశీల పాడిన 31 సినీ హిట్ డ్యూయెట్‌లను డబుల్‌ప్యాక్‌గా హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు.

ఇదేమిలాహిరి ఇదేమి గారడీ (ఈడు-జోడు), ఊ అను ఊఊ అను (మురళీకృష్ణ), నన్ను ఎవరో తాకిరి (సత్తెకాలపు సత్తెయ్య), మనసు పాడింది సన్నాయిపాట (పుణ్యవతి), హిమగిరి సొగసులు (పాండవ వనవాసం), ఎవ్వరికోసం ఈ మందహాసం (నర్తనశాల), ఈ మౌనం ఈ బిడియం (డాక్టర్ చక్రవర్తి), చెంగావి రంగు చీర కట్టుకున్న చిన్నది (బంగారు బాబు), కలకలవిరిసె జగాలే పులకించెనే (శభాష్ రాముడు), ఈవేళ నాలో ఎందుకో ఆశలు (మూగనోము), కడవెత్తుకొచ్చింది కన్నెపిల్ల (ప్రేమనగర్), మబ్బులో ఏముంది (లక్షాధికారి), నెలవంక తొంగిచూసింది (రాజుకోట రహస్యం), ఒకటే హృదయముకోసము (చదువుకున్న అమ్మాయిలు), అదే... అదే... అదే వింత నేను తెలుసుకున్నది (రాముడు భీముడు), నీలోన నన్నే నిలిపేవు నేడే (గుడిగంటలు) పాటలు క్యాసెట్ నెం.1లోనూ...

చందమామ రమ్మంది నేడు (అమాయకుడు), ఏడడుగుల సంబంధం (బంగారుబాబు) పరుగులు తీసే నీ వయసునకు (ఆత్మబలం), అద్దంలో కనిపించేది ఎవరికి వారు (ప్రేవేటు మాస్టారు), వయ్యారమొలికే చిన్నది (మంగమ్మ శపథం), హలో హలో ఓ అమ్మాయి (ఇద్దరు మిత్రులు), నీవనుకున్నది (డాక్టర్‌బాబు), చెప్పాలనివుంది... దేవతయే దిగివచ్చి (ఉమ్మడి కుటుంబం), ఎందుకో సిగ్గెందుకో (సిరిసంపదలు), వాడినపూలే వికసించెనే (మాంగల్యబలం), మనసు తీరా నవ్వులు నవ్వులు నవ్వులెనవ్వాలి (గూఢచారి 116), చెలికాడు నిన్నే రమ్మని పిలువ (కులగోత్రాలు), చిలిపి కనుల తీయని చెలికాడ (కులగోత్రాలు), ముందరున్న చిన్నదాన్ని అందమేమో (కాలం మారింది), పచ్చగడ్డి కోసేటి పడుచుపిల్ల (దసరాబుల్లోడు) పాటలు క్యాసెట్ నెం.2లోనూ వున్నాయి.

ఈ 31 పాటలలోనూ హిట్‌కాని పాట ఏదీ లేదు. అలాగే శ్రోతల స్మృతి పథం నుంచి చెరిగిపోయిన పాట కూడా ఏదీ లేదు. అయినా సరే ఇవాళ్టికీ మరోసారి విన్నా ఆనాటి ఆనందాన్ని తిరిగి అందించగలిగే సత్తా వున్న పాటలివి. అందుకే ఒక డబుల్‌ప్యాక్‌గా వచ్చినా ఒక మంచి కలెక్షన్‌గా శ్రోతల ఆదరణ చూరగొంటాయే తప్ప 'రిపీట్' అనే ఫీలింగ్ నివ్వవు. అంతటి 'ప్రియగీతాలు' కనుకనే ఇన్‌లే కవర్ ప్రింటింగ్‌తో పాటు బాగున్న ఈ 'ప్రియరాగాలు' డబుల్‌ప్యాక్‌ని ఎవరికైనా ఒక 'సంస్కారవంతమైన బహుమతి'గా అందిస్తే - కొన్న వారికి చేకొన్న వారికి సమాన సంతృప్తిని కలుగుతుంది. ◆

# బిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV



డ్యూటీ నిజాయితీగా చేయాలని, లంచాలు ఆశించకూడదని - పండగ మామూలు అడిగిన పోస్ట్‌మ్యాన్‌ని, పేపర్‌బాయ్‌ని క్లాసు పీకుతారు మీరు.



ఆ మర్నాటి నుంచి న్యూస్ పేపర్‌ని చెట్టుమీదనూ, ఉత్తరాలను మీ ఇంటి సన్‌షేడ్ మీదనూ వాళ్ళు పెట్టేసి వెళ్ళిపోతుంటే...



ఎంతరాత్రయినా సరే ఈ ఫైల్సు పూర్తి చేయాలని ఆఫీసరు వార్నింగు ఇచ్చేసరికి పొద్దుపోయే వరకు పనిచేసి మిగిలిన ఫైల్స్‌ని ఇంటికి పట్టుకెళ్తారు మీరు.



కొంచెం రెస్ట్ తీసుకుని తెల్లవారుఝామున పనిచేద్దామని కాస్తకునికేసరికి కుంభవృష్టిగా పడిన వానకి ఇల్లు కారి మొత్తం ఫైల్స్ అక్షరమ్ముక్క కూడా కనిపించకుండా నానిపోతే...




ఏ రోగమూ రాకుండా వందేళ్ళపాటు పూర్తి యవ్వనంతో బతకడానికి ఏదైనా కనిపెట్టాలని, దానికి సర్వసర్వంగాసనం అని పేరు కూడా పెట్టేసుకుని యోగా పుస్తకాలు తెచ్చుకుని ప్రాక్టీసు చేస్తారు మీరు.



దెబ్బకి ఒంట్లో వున్న నరాలు, పేగులు ముడిపడిపోగా - తిరిగి మామూలు స్థితికి రావడానికి ఓ పదేళ్ళ పాటు కేరళలో వైద్యం చేయించుకోవాలని తోటి యోగా ఫ్రెండ్స్ చెబితే...







విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ. 80/-

తెలుగువారు గర్వంగా చెప్పుకోదగ్గ దక్షిణాది గాయని శ్రీమతి పి.సుశీల పాడిన 31 సినీ గీతాలను 'హృదయగానం' అనే మకుటంతో హెచ్.ఎం.వి. వారు విడుదల చేశారు. అమ్మా చూడాలి (పాపం పసివాడు), త్యాగం ఇదియేనా (మంచి మనసులు), నిదురించే తోటలోకి (ముత్యాల ముగ్గు), రాయినైనా కాకపోతిని (గోరంత దీపం), ఇది మల్లె వేళయని (సుఖ దుఃఖాలు), కన్ను మూసింది లేదు (మనుషులు మమతలు), నిన్ను చూడనీ (మనుషులు - మమతలు). మాను మాకును కాను (మూగ మనుసులు), నీ చెలిమి నేడె కోరితినీ (ఆరాధన), ఏమని పాడెదనో (భార్య భర్తలు), మీ నగుమోము (బడి పంతులు), మనసే కోవెలగా (మాతృదేవత), వ్రేపల్లె వేచెను (శారద), గుడిలో దేవుని గంటలా (సిరి సంపదలు), వచ్చుబొట్టు చెరిగిపోదులే (పవిత్ర బంధం) మొదలైన గీతాలు క్యాసెట్ నెం.1 లోనూ...

ఇదిపాట కానే కాదు (తలంబ్రాలు), దయగల తల్లిని (అభిమానం), చేతిలో చెయ్యేసి (దసరా బుల్లోడు), చూడాలని వుంది (మనసే మందిరం), నీకోసం నా గానం (పునర్జన్మ), నాలుగు కళ్ళు రెండయినాయి (ఆత్మబలం), కోడి ఒక కోనలో (లేత మనసులు), చూసుకో పదిలంగా (అనురాగ దేవత), విరిసే కన్నులలో (డాక్టర్ బాబు) అమ్మ కడుపు చల్లగా (సాక్షి), నీలాల కన్నుల్లో (నాటకాల రాయుడు), ఎవరో రావాలి (ప్రేమ నగర్), మనసా కవ్వించకే (వండంటి కాపురం) నిత్య సుమంగళి (ఆడబ్రతుకు), అణువు అణువున (మానవుడు దానవుడు) క్యాసెట్ నెం.2 లోనూ వున్నాయి.

పి.సుశీల పాడిన సోలో హిట్‌సాంగ్స్ కొన్ని వందలున్నా ఈ పాటలను ఎన్నుకోవడానికి కారణం - ఈ 31 పాటలోనూ ధ్వనించేది వేదన... ఆవేదన!

కదిలించే వేదనలోనే ఉదయించును నాదాలు... ఉదయించే నాదంలోనే కదలాడును వేదాలు అని డాక్టర్ సి.నారాయణరెడ్డి ఓ సినీ గీతంలో రాసిన వాక్యాలు ఎంతటి అక్షర సత్యాలో తెలుసుకోవటానికి ఈ ముప్పయ్యొక్క గీతాలు ప్రత్యక్ష సాక్ష్యాలు. వింటుంటే హృదయం సానుభూతితోనూ, రసానుభూతితోనూ బరువెక్కిపోతుంది.

సినీ రంగంలో రాణించాలనుకునే వర్ధమాన గాయనీమణులు, ప్రస్తుతం ప్రకాశిస్తున్న వర్తమాన గాయనీమణులు ఈ క్యాసెట్‌ను వినడం ఖచ్చితంగా అవసరం. స్పష్టత అన్నది ఉచ్చారణలోనే కాక భావప్రకటనలో కూడా ఎంత ముఖ్యమో తెలుసుకోడానికి ఇలాటి పాటలు వింటూ ఉండాలి. ఏ మనిషికైనా శరీరం ఆరోగ్యంగా ఉండడానికి కాయకల్ప చికిత్స ఎంత అవసరమో మనసుని ఆరోగ్యంగా వుంచుకుంటూ సున్నితమైన స్పందనలు కోల్పోకుండా ఉండడానికి 'గుండెకాయ కల్ప చికిత్స' అవసరం. అటువంటి హార్ట్‌కి ఓవర్ హాలింగ్ (మామూలు పరిభాషలో ఓవరాయిలింగ్)... ఇలాంటి పాటలు విన్నప్పుడు జరుగుతూ వుంటుంది.

ఇక ఇన్‌లే కవర్ లోపల ఇచ్చిన సాంకేతిక సమాచారంలోకొస్తే - ముత్యాల ముగ్గులోని 'నిదురించే తోటలోకి' పాటను రాసింది గుంటూరు శేషేంద్రశర్మ... గుంటూరి కాదు.... వీటూరికి వేటూరికి తేడా తెలియని వారు కూడా ఉన్నారు కాబట్టి స్పష్టత మరింత అవసరం. అలాగే 'ఆరాధన' చిత్రంలోని 'నీ చెలిమి నేడే కోరితిని' పాటను రాసిన వారి పేరుని కేవలం 'చిరంజీవి' అని పేర్కొనటం తగదు. 'నార్ల చిరంజీవి' అని పూర్తిగా రాసి తీరాలి. మన సమాచారం ముందు తరాల వారికి ప్రశ్నార్థకాలుగా, సందేహాస్పదాలు మిగిలి పోకూడదు. 'బడిపంతులు'లో పాట 'మీ నగుమోము'... 'నీ నగుమోము' కాదు. ◆

---




విడుదల : సోహన్
వెల : రూ 38/-

ఎన్.టి.ఆర్ నటించిన చిత్రాలలో కొన్ని హుషారు గీతాలను తీసుకుని 'అన్న అల్లరి పాటలు' అనే మకుటంపై విడుదల చేసిన ఆడియో క్యాసెట్ హిట్ అవటంతో అక్కినేని ఫిల్మ్‌హిట్స్‌లోని కొన్ని సరదా గీతాలకు ఊపొచ్చింది. 'అక్కినేని అల్లరి పాటలు' అనే పేరుతో వాటికి ఆడియో క్యాసెట్‌గా రూపొచ్చింది.

నిలువవే వాలుకనుల దానా (ఇల్లరికం), రానని... రాలేనని ఊరికె అంటావు (ఆత్మగౌరవం), అయ్యయ్యో బ్రహ్మయ్య అన్యాయం చేశావేమయ్యా (అదృష్టవంతులు), హవ్వారే హవ్వా (బుద్ధిమంతుడు), చిన్నారి బుల్లెమ్మా సిగ్గెందుకు రావమ్మా (ధర్మదాత), చిక్కావు చేతిలో చిలకమ్మా (విచిత్ర బంధం), బులి బులి ఎర్రని బుగ్గలదానా (శ్రీమంతుడు), కనులు కనులు కలిసెను (మురళీకృష్ణ), ఎరక్కపొయి వచ్చాను ఇరుక్కుపోయాను (ఆలుమగలు), ఎక్కడి దొంగలు అక్కడనే గప్‌చిప్(ఇల్లరికం), మీ అందాల చేతులు కందేను పాపం (ప్రేమించి చూడు), నీకెట్టుందోగాని పిల్లా (మహాకవి కాళిదాసు), సిరిపల్లె చిన్నది (మంచి రోజులు వచ్చాయి), నాపక్కన చోటున్నది ఒక్కరికే (సెక్రటరీ), కిల్లాడి దొంగా డియ్యో డియ్యో (బందిపోటు దొంగలు), గొప్పోళ్ళ చిన్నది (కొడుకు కోడలు) మొదలైన 16 గీతాలున్నాయి ఈ క్యాసెట్‌లో.

తెలుగు సినిమాలలో స్టెప్ సాంగ్స్‌కి ఆద్యుడు, బాధ్యుడు అయిన అక్కినేని అభినయించిన ఈ పాటలన్నీ రియల్ హిట్స్. ఆయన స్టెప్స్‌ని అనుకరిస్తూ సంవత్సరాల తరబడి నృత్యకళ మీదనే ఆధారపడి జీవించిన బడుగు కళాకారులెందరికో అన్నం పెట్టిన పాటలివి. ఆ కోణంలో ఆలోచిస్తూ అటు అక్కినేని స్టెప్పులను, ఇటు అలా అనుకరించిన వారి స్టెప్పులను ఊహించుకుంటూ ఈ పాటలను వింటే కలిగే అనుభూతే వేరు. ఇన్‌లే కవర్‌పై వైట్ బాక్స్‌లో రెడ్ లెటర్స్‌లో కనిపించే 'అక్కినేని' అనే అక్షరాలు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు రెగ్యులర్‌గా చేసే సంతకం లోనివి. ఆ సంతకాన్ని పెద్దదిచేసి టైటిల్‌కి వాడుకోవటం అభిరుచికి, రసమయస్ఫూర్తికి ఓ నిదర్శనం. ◆

రచన: చంద్రబోస్ (1) గానం: శంకర్‌మహదేవన్, కవితాకృష్ణమూర్తి

అ: ఓ మారియ ఓ మారియ ఓ మారియా ఓ మారియా
రేపన్నది మాపన్నది పనికిరాదులే ఓ మారియా
ప్రతీరోజు విలువైంది కాదా ప్రయత్నిస్తే గెలుపేదో రాదా
చేద్దామంటే చూద్దామంటే కాలం ఆగదు
అయ్యేదేదో అవుతుందంటే కలతే తీరదు ॥ఓ మారియ॥
అ: సిరిమువ్వ రేపంటు వెనుదీస్తుందా ఘల్ ఘల్ ఘల్ మోగించగా
ఆ: సిరిమల్లె మాకంటు ముసుగేస్తుందా గుం గుం గుం పంచివ్వగా
అ: ప్రతిదినం ప్రభాతమై పదాలు తెచ్చే సూర్యుడు
ప్రకాశమే తగ్గించునా నావల్ల కాదంటూ
ఆ: ప్రతిక్షణం ఉషారుగా శ్రమించి సాగే వాగులు
ప్రయాణమే చాలించునా మాకింక సెలవంటూ
అ: ఉల్లాసంగా ఉత్సాహంగా బ్రతుకే సాగనీ
ఆ: అంతేలేని సంతోషాలు ఒళ్లో వాలనీ ॥ ఓ మారియ॥
అ: చిరుగాలి చిత్రంగ రానంటుందా ఝుం ఝుం ఝుం పయనించగా
ఆ: కొమ్మల్లో కోకిల్లా కాదంటుందా కూ కూ కూ వినిపించగా
అ: నిరంతరం దినం దినం అలాగే సహనం చూపుతూ
విరామమే లేకుండగా ఈ నేల తిరుగునుగా
ఆ: ఆకాశమే అందాలని చిన్నారి రెక్కల గువ్వలు
అనుక్షణం అదే పనే ఆరాటపడిపోవా
అ: మనసే వుంటే మార్గం తానే ఎదురొస్తుందిలే
ఆ: సత్తా వుంటే స్వర్గం కూడా దిగి వస్తుందిలే ॥ఓ మారియ॥

రచన: వేటూరి (2) గానం: ఎస్.పి.బాలు, చిత్ర

అ: సింబలే సింబలే అంబరాలు అందెలే హాయిలే
ఆ: భల్ భలే భల్ భలే చేతికందె మాకు వెండి మబ్బులే
ఇ: వెన్నెలమ్మా వేటకొచ్చే ఏనుగమ్మా అంబారీలు
ఆ: తేనెలమ్మా తేనెకొచ్చే మల్లెజాజి మందారీలు ॥సింబలే॥
అ: చందమామ చేతికొచ్చే సబ్బు బిళ్ల నేను లెమ్మనీ
ఆ: చంద్రవంక వాగు పొంగే స్నానమాడ నిన్ను రమ్మనీ
అ: పిల్ల నెమలి సంబరం ఫించమెంతో సుందరం
ఆ: పట్నమన్న పంజరం పట్టువీడె పావురం ఈ గూటికొచ్చె కాపురం
ఇ: హోయ్‌లాలో.. హోయ్‌లాలో.. ॥సింబలే॥
ఆ: ఆకాశాలే నేలకొచ్చే మేడ కన్నా నీడ మేలని



అ: అలకల చిలకలు చెలి రుసరుసలు
ఆ: ఇక జాగెందుకు ఇరుకున పడిపోగా
అ: మనసుతీరినా వయసులారని వేళా ॥అబబ్బా॥

రచన: వేటూరి (6) గానం: హరిహరన్

సరిమామగరి సస సనిదపస (2)
రిమదనిదపసాసనిదప మదపమరి
ప: యమహానగరి కలకత్తా పురి (2)
నమహో హుబిలి హౌరా వారధి
యమహానగరి కలకత్తా పురి
చిరు త్యాగరాజు నీ కృతినే పలికెను మరి ॥3॥ ॥యమ॥
చ: నేతాజీ పుట్టిన చోట గీతాంజలి పూసినచోట
పాడనా తెలుగులో
ఆ హంస పాడిన పాటే ఆ నందుడు చూపిన బాట సాగనా
పరుగులో పరుగు తీసింది పట్నం బ్రతుకుతో వెయ్యి పందెం
కడకు చేరాలి గమ్యం కదలిపోరా
ఒకరితో ఒకరికి ముఖపరిచయములు
దొరకని క్షణమున బిజి బిజి బ్రతుకుల
గజి బిజి ఉరుకుల పరుగులలో ॥యమ॥
చ: బెంగాలీ కోకిల బాల తెలుగింటి కోడలు పిల్ల
మానిని సరోజిని
రోజంతా సూర్యుడిక్రింద రాత్రంతా రజనీగంధా సాగనీ
పదగురూ ప్రేమలే లేని లోకం దేవదా మార్కు మైకం
శరన్నవలాభిషేకం తెలుసుకోరా
కలలకు నెలవట కళలకు కొలువట
తిదులకు సెలవట అతిధుల గొడవట
కలకట నగరపు కిటకిటలో ॥యమ॥
చ: వందేమాతరమే అన్నా వంగా భూతలమే మిన్న జాతికే గీతిరా
మాతంగి కాళీ నిలయ చోరంగి రంగుల దునియా నీదిరా
విను గురూ సత్యజిత్‌రే సితారా ఎస్‌డి బర్మన్‌కి ధారా
థెరీసా కీ కుమారా కదలి రారా
జనగణమనమున స్వరపద రవమున
హృదయపు లయలను శ్రుతిపరిచినప్రియ
శుకపిక ముఖసుఖ రవములతో ॥యమ॥



రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి (1&5) గానం: ఎస్.పి.బాలు / చిత్ర

ప: పాటల పల్లకివై ఊరేగే చిరుగాలి
కంటికి కనపడవేం నిన్నెక్కడ వెతకాలి
నీతోడు లేనిదే శ్వాసకి శ్వాస ఆడదే
నువ్వే చేరుకోనిదే గుండెకి సందడుండదే
నీ కోసమే అన్వేషణ నీ రూపు రేఖలేవో ఎవరినడగాలి ॥పాటల॥
నీలాల కనుపాప లోకాన్ని చూస్తుంది
తన రూపు తానెపుడూ చూపించలేనంది
అద్దంలా మెరిసే ఒక హృదయం కావాలి
ఆ మదిలో వెలుగే తన రూపం చూపాలి
రెప్పల వెనక ప్రతి స్వప్నం కలలొలికిస్తుంది
రెప్పలు తెరిచే మెలకువలో కల నిదురిస్తుంది
ఆ కలల జాడ కళ్ళు ఎవరినడగాలి ॥పాటల॥
పాదాల్ని నడిపించే ప్రాణాల రూపేది
ఊహల్ని కదిలించే భావాల ఉనికేది
వెన్నెల దారమా జాబిల్లిని చేర్చుమా
కోయిల గానమా నీ గూటిని చూపుమా
ఏ నిముషంలో నీ రాగం నా మది తాకింది
తనలో నన్నే కరిగించి పయనిస్తూ ఉంది
ఆ రాగమెపుడు నాకు ఎదురుపడుతుంది ॥పాటల॥

రచన: ఇ.ఎస్.మూర్తి (2) గానం: హరిహరన్, చిత్ర

అ: కొమ్మా కొమ్మా విన్నావమ్మా కోయిల వస్తుంది
వస్తూ వస్తూ తనతో వెన్నెల వెలుగులు తెస్తుంది
ఏవమ్మా మరుమల్లి తోరణాలు కడతావా
చిలకమ్మ ఎదురేగి స్వాగతాలు చెపుతావా
పూల పొదరిల్లే రా రమ్మన్నది
ఆ: విన్నానమ్మా తియ్యని వేణువు రమ్మను పిలుపులని
చూశానమ్మా స్వాగతమంటూ తెరిచిన తలపులని
అ: పగలు రాత్రి అంటూ తేడా లేనే లేదు పసిపాప నవ్వుల్ని చూడని
ఆ: తోడూ నీడా నువ్వై నాతో నడిచే నీతో ఏనాటి ఋణముందో అడగని
అ: చేదు చేదు కలలన్నీ కరిగితేనె వరదవని
ఆ: కానుకైన స్నేహాన్ని గుండెలోన దాచుకుని





బంతిపూల హారాలేసి ఆరాధించనా
నా చెలి నామం తారక మంత్రం
చక్కని రూపం జక్కన శిల్పం
వందకోట్ల చందమామలొకటై వెలుగుతుండగా
ఈ సుందరాంగి చూపు సోకి కాదా బ్రతుకు పండగ
ఓహో.....ఓహో.... ॥కలలో॥

రచన: చంద్రబోస్ (8) గానం: శంకర్‌మహదేవన్

డబ్బు డబ్బు డబ్బు డబ్బు
డబ్బుడబ్బుడబ్బుడబ్బుడబ్బుడబ్బుడబ్బు
ప: రైలుబండిని నడిపేది పచ్చజెండాలే
బ్రతుకుబండిని నడిపేది పచ్చనోటేలే ॥రైలు॥
తళ తళ తళ మెరిసే నోటు తీర్చును లోటు
పెళ పెళ పెళ లాడే నోటు పెంచును వేటు
అరె బోల్ మేరే భాయ్ ఈ నోట్‌కి జై
అరె బోల్ మేరే భాయ్ నా మాటకి జై ॥రైలు॥
చ: డబ్బుంటే సుబ్బిగాడినే సుబ్బరావుగారంటారు ॥2॥
ధనముంటే అప్పలమ్మనే అప్సరసని పొగిడేస్తారు
కాషే ఉంటే ఫేస్‌కు విలువస్తుంది
నోటే ఉంటే మాటకు బలమొస్తుంది.
బైకు ఉంటే అమ్మాయే జీటే వేస్తుంది
నీకు సైకిలుంటే ఆ పిల్లే సైడయ్ పోతుంది
కో: బైకు ఉంటే అమ్మాయే జీటే వేస్తుంది
నీకు సైకిలుంటే ఆ పిల్లే సైడయ్ పోతుంది ॥రైలు॥
ఆ: అయో మామోయ్... ఇప్పుడు చూడు
అ: ఏ భాష తెలియని డబ్బు అబద్ధాన్ని పలికిస్తుంది
అరరెరె... ఏ భాష తెలియని డబ్బు అబద్ధాన్ని పలికిస్తుంది
ఏ పార్టీకి చెందని డబ్బు ప్రభుత్వాన్ని పడగొడ్తుంది
డాలర్లయినా రష్యన్ రూబిలైనా డబ్బుంటేనే మనిషికి ఖానా పీనా
చేతినిండా సొమ్ముంటే అమ్మో చిలకమ్మో
ఊరినిండా చుట్టాలే అమ్మో చిట్టమ్మో
కో: చేతినిండా సొమ్ముంటే అమ్మో చిలకమ్మో
ఊరినిండా చుట్టాలే అమ్మో చిట్టమ్మో ॥రైలు॥

ఆ: హింస గీతమే వినరాదా హింస మానరా మధన
అ: తెల్లవారిన తరువాత తెల్లబోకుమా లలనా
ఆ: ఇపుడే విన్నాను చలి వేణువేదో
అ: నిదరే ఇక రాదు లేవమ్మా
ఆ: చెవులే కొరికింది చెలిమింటి మాట
అ: ఎదలే ఇక దాచలేవమ్మా
ఆ: పూలగాలికి పులకరం గాలి ఉసికి కలవరం
అ: కంటి చూపులో కనికరం కన్నెవయసుకే తొలివరం
ఆ: మొదలాయే ప్రేమ క్లాసు రాగసుధా ॥మనస్సా॥
అ: రాయలేనిది ప్రియలేఖ రాయబారమే వినవా
ఆ: వేదమంటిది శుభలేఖ వెన్నెలంటది కలువా
అ: పురులే విరిసింది నీలో వయ్యారం
ఆ: కనులే తెరిచిందిలే పింఛం
అ: వెలిగే నీలోన గుడిలేని దీపం
ఆ: ఒడిలో తేరింది ఆ లోపం
అ: ఎంకి పాటలో తెలుగులా తెలుగు పాటలో తేనెలా
ఆ: కలవని హేలా మమతలా తరగని ప్రియా కవితలా
అ: బహుశా ఇదేమో భామ ప్లసు కథా ॥మనస్సా॥

**రచన: వేటూరి (5) గానం: ఎస్.పి.బాలు, సుజాత**

ఆ: అబ్బబ్బా ఇద్దూ అదిరేలా ముద్దు
అ: అమ్మమ్మా దిద్దు మధురాలా మరో ముద్దు ॥అబబ్బా॥
ఆ: చలిపులి పంజా విసిరితే సలసలకాగే వయసులో
అ: గిలగిలలాడే సొగసుకే జో లాలీ... ॥అబబ్బా॥
ఆ: వాటేసుకో వదలకు వలపుల వల విసిరి
వాయించునీ మురళిని వయసుగాలి పోసి
అ: దోచెయ్యనా దొరికితే దొరకని కోకసిరి
రాసెయ్యనా పాటలే పైట చాటు చూసి
ఆ: ఎవరికి తెలియవు ఎదరస నసలు
అ: పరువాలాటకు పానుపు పిలిచాకా
ఆ: తనువు తాకినా తనివితీరని వేళా ॥అబబ్బా॥
అ: జాబిల్లితో జతకలు జగడపు రగడలతో
పొంకాలతో నిలునిలు పొగడ మాల వేసి
ఆ: ఆకాశమే కులుకులు తొడిమెడు నడుమిదిగో
సూరీడునే పిలుపిలు చుక్కమంచు సోకి



అ: ఆనందాల వెల్లువచ్చి లాలపోసె కంటిపాపకి
ఆ: చూడచూడ వింతలు చుక్కలేడి గంతులు
అ: ఆకుపచ్చ పొద్దులు మాకు లేవు హద్దులు
ఇ: ఈ కొండకోన సీమలో ఒహిలాలో..... ఒహిలాలో..... ॥సింబలే॥

**రచన: వేటూరి (3) గానం: ఉదిత్ నారాయణ్, స్వర్ణలత**

అ: రామ్మా చిలకమ్మా ప్రేమా మొలకమ్మా
రామ్మా చిలకమ్మా ప్రేమా మొలకమ్మా రాధమ్మా
పాలే తెలుపన్నా నీళ్లే నలుపన్నా గోపెమ్మా
ముక్కుమీద తీపి కోపాలా మూగ కళ్ల తేనె దీపాలా
గంగూలి సందులో గజ్జెల గోల బెంగాలీ చిందులో మిర్చి మసాలా
అరె వేడెక్కి ఉన్నది వెన్నెలభామా మేడెక్కి దిగదురా మేఘమాలా ॥రామ్మా॥
అ: గోపెమ్మో గువ్వాలేని గూడు కాకమ్మో
ఆ: కృష్ణయ్యో పువ్వే నాది పూజ నీదయ్యో
అ: దొంగిలించుకున్న సొత్తు గోవిందా
ఆ: ఆవులించుకుంటే నిద్దరొతుందా
అ: ఉట్టి కొట్టే వేళ రైకమ్మో చట్టి దాచిపెట్టుకోకమ్మో
ఆ: కృష్ణా మురారి వాయిస్తావో చలి కోలాటమేదో ఆడిస్తావో
కో: అరె ఆవోరే బయ్యా బన్సీబజావో
అరె ఆంధ్రా కన్నయ్యా హాత్ మిలావో.. ॥రామ్మా॥
అ: పోలమ్మో చోళీలోనా సోకు గోలమ్మో
ఆ: పోయమ్మో ఖాళీ లేక వేసే ఈలమ్మో
అ: వేణువంటే వెర్రిగాలి పాటేలే
ఆ: అది వెన్న దోచుకున్న వెన్ను చాటేలే
అ: జట్టే కడితే జంట రావమ్మో పట్టు విడుపు ఉంటే మేలమ్మో
ఆ: ప్రేమాడే కృష్ణుడు కన్ను కొట్టాలా పెళ్లాడే కృష్ణుడు కాళ్లు పట్టాలా
కో: అరె ఆవోరే బయ్యా బన్సీబజావో
అరె ఆంధ్రా కన్నయ్యా హాత్ మిలావో.. ॥రామ్మా॥

**రచన: వేటూరి (4) గానం: ఎస్.పి.బాలు, చిత్ర**

అ: మనస్సా ఎక్కడున్నావ్ ఇదేనా రావడం
ఆ: వయస్సా ఎప్పుడొచ్చావ్ ఇవాళ చెప్పడం
అ: నువ్వనుకోలేదు గుసగుసలు ఎన్నో వింటున్నా
ఆ: నేననుకోలేదు మిసమిసలు నాలో పుడుతున్నా
అ: ఇది అందమైన వింత ఆత్మ కథ ॥మనస్సా॥



నిన్ను తలచి కనులు తెరచి కలలోనె వున్నా
ఆ: పాటే నే విన్నది మాటే రాకున్నది వేరే ధ్యాసన్నది ఏదీ లేకున్నది
ఓ ప్రియా... ఓ ప్రియా.... ॥మేఘమై॥
ఆ: నిను చూడని కనులేలని కలవరించే హృదయం
నిను వీడని నీ నీడలా సాగింది బంధం
అ: ప్రేమ బాధన్నది ఎంత తియ్యనైనది ఎండమావన్నది సెలయేరైనది
ఓ ప్రియా... ఓ ప్రియా.... ॥మేఘమై॥

**రచన: సుద్దాల అశోక్ తేజ (6) గానం: సుజాత**

నీవే దేవునివి నల్లనయ్యా కాని నీకెపుడు వేదనలే ఎందుకయ్యా
నీదే విశ్వమని అందురయ్యా అయినా నీవెపుడు ఒంటరివే చల్లనయ్యా
లోకం ఆపదలు తీర్చినావు కానీ నీవే ఆపదలు మోసినావు
ఎన్నో బాధలను ఓర్చినావు అయినా మోముపైన నవ్వు నీవు చెరగనీవు ॥నీవే॥

**రచన: చంద్రబోస్ (7) గానం: ఎస్.పి.బాలు**

ప: కలలోనైన కలగనలేదే నువు వస్తావని
మెలకువలోనైన అనుకోలేదే నువు వస్తావని ॥కలలో॥
ఆ దేవుడు కరుణించి ఈ దేవత కనిపించి
ఆనందం కలిగించి ఈ బంధం కదిలొచ్చి
ప్రేమపైన నమ్మకాన్ని నాలో పెంచుతున్నది
నను కమ్మనైన అమృతాల నదిలో ముంచుతున్నది
ఓహో... ఓహో.. హా... హా... ॥కలలో॥
చ: చిన్ని పెదవిపైన పుట్టుమచ్చ కానా
చిన్ని తేనె నవ్వులలోన స్నానాలాడనా
కన్నె గుండెపైన పచ్చబొట్టు కానా
మోగుతున్న సవ్వడి వింటూ మోక్షం పొందనా
జానకి నీడే రాముని మేడ
నీ జారిన పైటే నే కోరిన కోట
తెలుగు భాషలోని వేల పదములు తరగుతున్నవి
నా వలపు భాషలోన చెలియ పదమే మిగిలి ఉన్నది
ఓహో.. ఓహో....
చ: కాళిదాసు నేనై కవిత రాసుకోనా
కాలి గోటి అంచులపైన హృదయం ఉంచనా.
భామదాసు నేనై ప్రేమ కోసుకోనా



ప్రతి జన్మకి ఈ నేస్తమే కావాలని
కోరుకుంటానమ్మా దేవుళ్లని ॥కొమ్మా॥
ఆ: ఇదిగో నిన్నే అంటూ ప్రేమే ఎదురై వస్తే ఏ పూలు తేవాలి పూజకి
అ: నీతో జతగా ఉండే వరమే నువ్వే ఇస్తే ఇంకేమి కావాలి జన్మకి
ఆ: మచ్చలేని చంద్రుడిని మాటరాక చూస్తున్న
అ: వరస కాని బంధువుని చొరవచేసి అంటున్నా
ఇంకెప్పుడు ఒంటరినని అనరాదని
నీకు సొంతం అంటే నేనని ॥కొమ్మా॥

**రచన: సుద్దాల అశోక్‌తేజ (3) గానం: ఎస్.పి.బాలు**

కో: పాటల పల్లకివై ఊరేగే చిరుగాలి
కంటికి కనపడవేం నిన్నెక్కడ వెతకాలి
నీతోడు లేనిదే శ్వాసకి శ్వాస ఆడదే
నువు చేరుకోనిదే గుండెకి సందడుండదే
నీ కోసమే అన్వేషణ నీ రూపు రేఖలేవా ఎవరినడగాలి ॥పాటల॥
అ: పాటల పల్లకివై ఊరేగే చిరుగాలి
హృదయాలు ఒడిచేర్చి ఓదార్చే చిరుగాలి
మమ్మల్ని జతచేసే వంతెనవు కావాలి ॥హృద॥
అద్దంలా మెరిసే ఓ హృదయం పగిలింది
ఆ మదిలో వెలుగు చూపించే దారేది
రేయి పగలు తను వెతికే పాటకు చిరునామా
ఎదుటే ఇపుడు ఉన్నదని ఎదురై చెప్పమ్మా
ఈ మౌనం ఇంక తగదు నీకు చిరుగాలి
ప్రేమను ధ్యానించు ప్రేమే ఒక జలపాతం
ప్రేమను పూజించు ప్రేమే ఒక సంగీతం
కో: ప్రేమను ధ్యానించు ప్రేమే ఒక జలపాతం
ప్రేమను పూజించు ప్రేమే ఒక సంగీతం
లాలల లాలలలా లలలా లలలా లాలల లాలలలా లలలా లలలా

**రచన: సిరివెన్నెల (4) గానం: రాజేష్, సుజాత**

అ: మేఘమై నేను వచ్చాను మెరుపులో నిన్ను వెతికాను ॥2॥
ఎవరితో కబురే పంపను ఎన్నటికి నిన్ను చేరెదను
ఓ ప్రియా.. ఓ ప్రియా... ॥మేఘమై॥
అ: నిన్ను వలచి అన్ని మరచి కలతపడి నిలిచున్నా

సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| మాటలు | : | దివాకర్‌బాబు |
| పాటలు | : | వేటూరి, చంద్రబోస్ |
| కంప్యూటర్ గ్రాఫిక్స్ | : | వెంకీ |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : | చంద్రమోహన్ |
| నృత్యాలు | : | సరోజ్ ఖాన్, రాజుసుందరం, లారెన్స్ |
| ఫైట్స్ | : | విజయన్ |
| ఎడిటింగ్ | : | కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఆర్ట్ | : | తోటతరణి |
| స్టిల్స్ | : | సెబాస్టియన్ బ్రదర్స్ |
| పబ్లిసిటీ | : | ఈశ్వర్ |
| డి.టి.ఎస్. మిక్సింగ్ | : | హెచ్.శ్రీధర్ (మీడియా ఆర్టిస్టు ప్రై.లి.) |
| కో-డైరెక్టర్స్ | : | జె.వి.వి.సత్యనారాయణ, చంద్ర |
| కెమెరా | : | చోటా కె.నాయుడు |
| సంగీతం | : | మణిశర్మ |
| సహనిర్మాత | : | కె.సత్యసాయి |
| నిర్మాత | : | చలసాని అశ్వనీదత్ |
| కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం | : | గుణశేఖర్ |

తారాగణం

చిరంజీవి, అంజలాఝవేరి, సౌందర్య, ప్రకాష్‌రాజ్, బ్రహ్మానందం, ఏ.వి.ఎస్., దూళిపాళ, బాలయ్య, ఎం.ఎస్.నారాయణ, మోనికాబేడీ, పి.జె.శర్మ, ఆహుతిప్రసాద్, అనంత్, రఘునాథరెడ్డి, చలసానికృష్ణారావు, గుండు హనుమంతరావు, వల్లభనేని జనార్ధన్, భానుప్రకాష్, విజయకుమార్, గణేష్, వేణుమాధవ్, మూర్తి, రామరాజు, సరస్వతమ్మ, లక్ష్మీపతి, మాస్టర్ నందన్, మాస్టర్ తేజ
గౌరవ పాత్రలో అల్లురామలింగయ్య

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# చూడాలని వుంది!


చలసాని అశ్వనీదత్


గుణశేఖర్


మణిశర్మ


వేటూరి


చంద్రబోస్



# నువ్వు వస్తావని...

My Heart Beats For You

పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

తారాగణం

నాగార్జున, సిమ్రాన్, కోట, బ్రహ్మానందం, అనంత్, తనికెళ్ళ భరణి, సుధాకర్, మల్లిఖార్జునరావు, శివాజీరాజా

సాంకేతిక నిపుణులు

| | | |
|---|---|---|
| కథ | : | ఎస్.ఎళిల్ |
| మాటలు | : | మరుధూరి రాజా |
| పాటలు | : | సిరివెన్నెల, ఇ.ఎస్.మూర్తి, సుద్దాల అశోక్‌తేజ, చంద్రబోస్ |
| ఆర్ట్ | : | ప్రభు, విజయ్‌కుమార్ |
| స్టిల్స్ | : | సెబాస్టియన్ బ్రదర్స్ |
| డ్యాన్స్ | : | రాజు సుందరం, రాఘవేంద్ర లారెన్స్, సేతు |
| ఫైట్స్ | : | కనల్ కన్నన్ |
| కో-డైరెక్టర్ | : | దేవీప్రసాద్ |
| ఎడిటింగ్ | : | నందమూరి హరి |
| కెమెరా | : | శ్యామ్ కె.నాయుడు |
| పి.ఆర్.ఓ. | : | జగన్ |
| సంగీతం | : | ఎస్.ఎ.రాజ్‌కుమార్ |
| నిర్మాత | : | ఆర్.బి.చౌదరి |
| స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : | వంకినేని రత్నప్రతాప్ |


ఆర్.బి.చౌదరి


సిరివెన్నెల


సుద్దాల అశోక్‌తేజ


చంద్రబోస్

# లక్కీ అలీ

## నటన వారసత్వం — గానం దైవదత్తం...

వారసత్వం అనేది ఒకోసారి వరంగానూ, మరోసారి శాపంగానూ పరిణమిస్తుంటుంది. బాలీవుడ్‌లో పాపులర్ కమెడియన్‌గా పేరు ప్రఖ్యాతులు గడించిన మహమూద్ కొడుకు అనగానే ప్రజలందరూ అతని నుండి ఏం ఆశిస్తారో ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అయితే తండ్రి అడుగు జాడలలో నడవకుండా తనకంటూ ఓ ప్రత్యేక వంథాను ఏర్పరుచుకోవడంలో లక్కీఅలీ విజయాన్ని సాధించారు. మహమూద్ కొడుకు అనే గుర్తింపు కాకుండా అతనికంటూ ఓ ఐడెంటిటీ ఇవాళ ఇండస్ట్రీలోనూ, ప్రేక్షకుల్లోనూ పొందారు. ఆయనకివాళ ప్రపంచవ్యాప్తంగా అభిమానులు ఉన్నారు. ఆరేళ్ళకు పైగా సంగీత ప్రపంచంలో కొనసాగుతూ తొలి ఇండీపాప్ ఆల్బమ్‌తోనే లక్కీఅలీ తన సత్తా ఏమిటో నిరూపించుకున్నారు.



ఇవాళ ఆయనకంటూ ఓ స్టయిల్ ఉంది. లక్కీ అలీ గళం నుండి వచ్చిన పాటను శ్రోతలు ఇట్టే గుర్తు పట్టేస్తారు. నటన అనేది ఆయనకు వారసత్వంగా లభిస్తే, గానం దైవదత్తంగా లభించిన వరంగా భావించవచ్చు.

పాపులర్ కమేడియన్ కొడుకుగా పుట్టినా లక్కీఅలీ బాల్యం అంత ఆనందకరమైన వాతావరణంలో సాగలేదు. చిన్నప్పట్నుంచి బోర్డింగ్ స్కూల్లోనే అతను రోజులు గడిపాడు. తల్లిదండ్రులు విడాకులు తీసుకోవడంతో బాల్యమంతా ఆప్యాయానురాగాల కోసం పరితపించడంతోనే నడిచింది. ఎనిమిది మంది సంతానంలో లక్కీఅలీ రెండోవాడు. కుటుంబంలోని సభ్యులతో ఇమడలేక ఎన్నోసార్లు ఇల్లు ఒదిలి పారిపోయాడు. అది గమ్యంలేని ప్రయాణం అని తెలిసి, మనసు మార్చుకుని మళ్ళీ ఇంటికి చేరేవాడు. యుక్త వయసులో కొద్దికాలం పాండిచ్చేరిలో ఆయిల్ రిగ్‌లో వర్క్ చేశాడు. మరి కొద్దికాలం గుర్రాలశాలలో పనిచేశాడు. ఆ తర్వాత స్నేహితుడితో కలిసి కార్పెట్ క్లీనింగ్ బిజినెస్ నిర్వహించాడు. ఈ పనులతోనే దేశ దిమ్మరిలా రకరకాల ప్రదేశాలు చుట్టివచ్చి చివరకు న్యూజిలాండ్‌లో స్థిరపడ్డాడు. అక్కడి అమ్మాయి మాసూమ్‌ని పెళ్ళి చేసుకుని ఇద్దరు పిల్లలకు తండ్రి అయ్యాడు.

తన కొడుకు ఎటువంటి ఎగుడు దిగుడులు లేని కెరీర్‌ను ఎంచుకోవాలని, జీవితంలో వీలైనంత త్వరగా స్థిరపడాలని మహమూద్ భావించాడు. తండ్రి లాగా పాపులారిటీ సంపాదించుకోవాలని, నటుడు కావాలనీ లక్కీకి ఉన్నా, అతను పెద్దగా ప్రయత్నం చేయకుండానే ఉమేష్ మెహ్రా 'హమారే తుమ్హారే'లో నటించే అవకాశం వచ్చింది. అలానే శ్యామ్ బెనగల్‌తో లక్కీఅలీకి సత్ సంబంధాలు ఉండటంతో ఆయన రూపొందించిన 'త్రికాల్'లో నటించాడు. అంతేకాదు బెనగల్ దూరదర్శన్ కోసం రూపొందించిన 'భారత్ ఏక్ ఖోజ్' సీరియల్‌లోనూ అశోకుడి సోదరుడిగా నటించాడు. ఆ తర్వాత బెనగల్ దర్శకత్వం వహించిన కొన్ని సినిమాలకు దర్శకత్వశాఖలో పనిచేశాడు. కొన్ని సీరియల్స్‌లోనూ నటించాడు. నటన ఓ వ్యాపకంగానే ఉన్నా మొదటి నుండి లక్కీఅలీకి సంగీతమంటే ప్రాణం. శాస్త్రీయ సంగీతాన్ని నేర్చుకోకపోయినా, పాటలు రాయడం, వినడం చేసేవాడు. ఆ రకంగా అతనిలో ఓ గాయకుడు, సంగీత దర్శకుడు మేల్కొన్నాడు.




తనలోని సంగీత జిజ్ఞాసను పదిమందికీ తెలియచేయాలనే ఆలోచనతో లక్కీఅలీ 'సునో' అనే ఇండీపాప్ ఆల్బమ్‌ను విడుదల చేశాడు. అది గొప్ప సక్సెస్‌ను పొందడంతో రాత్రికి రాత్రి పాప్‌స్టార్‌గా ఎదిగిపోయాడు. ఆ ఆల్బమ్‌లోని 'ఓ సనమ్...' అనే పాటను ఈజిప్ట్‌లోని పిరమిడ్స్ ముందు చిత్రీకరించారు. ఆ పాటలో అభినయించింది లక్కీఅలీ భార్య మాసూమే.

ఈ ఆల్బమ్ లక్కీకి పేరునే కాదు అనేక అవార్డుల్ని కూడా తెచ్చిపెట్టింది. 1996లో బెస్ట్ పాప్‌మేల్ వోకలిస్ట్ స్క్రీన్ అవార్డు, 1997లో ఛానల్ (వి) వ్యూయర్స్ ఛాయిస్ అవార్డు పొందడమే కాకుండా ఎంటీవీ ఆసియా ఛార్ట్స్‌లో అరవై వారాల పాటు చోటుచేసుకుందీ ఆల్బమ్. దాదాపు నాలుగు లక్షలకు పైగా క్యాసెట్లు అమ్ముడుపోయాయని అంచనా. ఈ ఆల్బమ్‌ను బిఎంజి క్రిసెండో సంస్థ విడుదల చేసింది. ఈ విజయోత్సాహంతో లక్కీ సంగీతం పట్ల మరింత శ్రద్ధ కనబరిచాడు. రెండో ఆల్బమ్‌గా 'సిఫర్'ను సోనీ సంస్థ 1998లో విడుదల చేసింది. మనిషి ఆత్మయాత్ర ఈ ఆల్బమ్ థీమ్. ఇందులోని ప్రతి పాటా జీవితంలోని ఓ కొత్త పార్శ్వాన్ని కనుకున్నట్టుగానే ఉంటుంది. ఇదీ తొలి ఆడియోలానే మంచి పేరు తెచ్చిపెట్టింది.

ఈ వరుస విజయాలతో అతని దృష్టి సినిమా

నేపథ్య సంగీతం మీదకు మళ్ళింది. రాజేష్‌రోషన్ సంగీత దర్శకత్వంలో రాకేష్ రోషన్ తన కొడుకు హృతిక్ రోషన్ హీరోగా రూపొందించిన 'కహోనా ప్యార్‌హై'లో రెండు పాటల్ని లక్కీఅలీ గానం చేశాడు. 'ఏక్‌పల్‌కా జీనా .... ఏక్ పల్‌కా మర్‌నా' పాట పెద్ద సంచలనమే సృష్టించింది. మరోసారి లక్కీ అలీని అవార్డులు వరించాయి. శాస్త్రీయ సంగీతంలో అనుభవంలేని లక్కీకి అవార్డులు దక్కడం సాటి గాయనీ గాయకులకు కంటగింపుగా అనిపించింది. అయినా ఈ విషయాల గురించి తను ఏ కామెంట్ చేయలేనని లక్కీ చెబుతుంటాడు. అతని మూడవ అల్బమ్ 'అక్స్'. అదీ సంచలనమే. తన విజయాలకు కారణం చెబుతూ, "నా పాటల్లో ఉండే ఉన్నతమైన భావాలు, నా గొంతులోని తాజాదనం బహుశా శ్రోతల్ని ఆకట్టుకుంటూ ఉండొచ్చు. అలానే నా జీవన గమనవు అనుభవాలు నా సంగీతంలో ప్రతి ఫలిస్తుంటాయి" అని అంటాడు.

"సంగీతంలో లోతుపాతులు తెలియక పోయినా నేను పుట్టి పెరిగింది సంగీతంలోనే. నా దృష్టిలో సంగీతమనేది ఓ సంకేతం. ఆలోచనా ధారను వ్యక్తం చేసే ఓ సాధనం. గిటార్, కీబోర్డ్ నేను ప్లే చేస్తాను. ఫ్లూట్ వాయిస్తాను. ఇక పాటలంటారా... నాకు తోచిన విధంగా పాడతానంతే' అంటాడు లక్కీ. విశేషం ఏమంటే లక్కీ అలీ కొన్ని చిత్రాలకు సంగీతాన్ని సమకూర్చినా అతను కథానాయకుడిగా నటించిన 'సుర్' చిత్రానికి మాత్రం ఎమ్.ఎమ్. క్రీమ్ (మన కీరవాణి) సంగీతాన్ని సమకూర్చారు. మీరెందుకు సంగీతాన్ని ఇవ్వలేదు అని అడిగితే, 'ఆ సినిమా వరకూ నేను కేవలం నటుడిని. అసలా పాత్రకు కమల్‌హాసన్ అయితే బాగుంటుందని నేను తనూజాచంద్రకు చెప్పాను. కానీ ఆమె వినలేదు. నేనే చేయాలని పట్టుపట్టింది. ఇక సంగీతం విషయానికి వస్తే కీరవాణి గొప్ప సంగీత దర్శకుడు. ఆయనంత గొప్ప సంగీతాన్ని నేనిచ్చి ఉండేవాణ్ణి కాదు' అన్నారు లక్కీ.

నేను సాధారణ జీవితం నుండి స్ఫూర్తి పొందాను తప్పితే, ఎప్పుడూ ప్రజలను అనుసరించాలనుకోను. అలానే 'కాంటే' సినిమాలోనూ నేనో ప్రాధాన్యం ఉన్న పాత్రను పోషించాను. మరి కొన్ని సినిమాల్ని అంగీకరించాను. మరికొన్ని సినిమాలకు సంగీతాన్ని సమకూర్చుతున్నాను. నేను ఏమి




చేయాలనుకుంటానో అది చేస్తాను. ప్రజలు నానుండి ఏది కోరుకుంటారో అది చేయడం నాకు కష్టమే. నాకు ప్రాధాన్యమైన రంగాలంటూ ప్రత్యేకంగా ఏమీ లేవు. ఇప్పుడు ఇక్కడ పనిచేస్తున్నాను. ఈ పని శ్రద్ధగా చేస్తాను. రేపు నాకోసం మరో రంగం ఎదురు చూస్తుండవచ్చు' అని నిర్మొహమాటంగా చెప్పేస్తాడు లక్కీ. న్యూజిలాండ్‌లోనూ, బెంగుళూరులోనూ ఉన్న ఫామ్‌హౌస్‌లలో వ్యవసాయం చేయడం కూడా సంగీతమంత ఇష్టం అంటుంటారాయన.

ఒకానొక సమయంలో కుటుంబం, ఇల్లు వంటి బంధాలకు తాను ప్రాధాన్యం ఇవ్వనని చెప్పిన లక్కీ అలీ ఇప్పుడు మొదటి భార్యకు ఇద్దరు పిల్లలు పుట్టిన తర్వాత ఇనయా అనే ఆమెను రెండో పెళ్ళి చేసుకున్నారు. ఈ విషయమై వివరణ ఇస్తూ, "నా వ్యాపకాల దృష్ట్యా నేను విస్తారంగా పర్యటనలు చేయాల్సి ఉంటుంది. ప్రతిసారి నా కుటుంబాన్ని వెంట తీసుకుని వెళ్ళలేని పరిస్థితి. నేను మనుషుల్ని త్వరగా నమ్మేస్తాను. అందువల్ల అనేక ఇబ్బందులకు గురవుతుంటాను. అదే నాతో పాటు నా మనిషి ఎవరైనా ఉంటే, వారి ద్వారా కొన్ని సమస్యల్ని ఎదుర్కోవడం తేలిక అవుతుంది. నా బదులుగా ఆ సమస్యల్ని వారు చక్కదిద్దుతారు కదా... అందుకనే నేను ఇనయాను పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. అదే విషయాన్ని నా మొదటి భార్యకు చెప్పి, ఆమె అంగీకారం తీసుకున్నాను. ఇప్పుడు ఇనయా నాతోనే ఉంటూ నాకు చేదోడు వాదోడుగా ఉంటోంది. నిజాయితీతో నేను నా ఇద్దరు భార్యలను చక్కగా చూసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను. కాబట్టి కుటుంబ వరంగా ఏ సమస్యా లేదు" అంటున్నారు లక్కీఅలీ.

వివిధ కంపెనీలతో తన ఆల్బమ్స్‌ను విడుదల చేసి సక్సెస్‌ను పొందిన లక్కీఅలీ ఈసారి నాలుగో ఆల్బమ్ 'ఇకసోయ్'ని మాత్రం సొంతంగా విడుదల చేయాలనుకుంటున్నారు. అందుకోసం ఆయన కొలంబస్ ఎంటర్‌టైన్‌మెంట్స్‌తో కలిసి బ్లూ లోటస్ అనే కంపెనీని ప్రారంభించారు.

తండ్రి మహమూద్ అలీ ఆల్‌రౌండర్. నటుడుగా, నిర్మాతగా, దర్శకుడిగా, రచయితగా, గాయకుడిగా వివిధ రంగాలలో తన ప్రావీణ్యాన్ని నిరూపించుకున్న ఆయనకు తగ్గ వారసుడిగా లక్కీ కూడా నటుడిగా, గాయకుడిగా, సంగీత దర్శకుడిగా తన ప్రతిభను చాటుకుంటున్నారు. ఇంతకు లక్కీ అలీ అనేది ఆయన ముద్దుపేరు. లక్కీ అసలు పేరు మక్సూద్ మెహమూద్ అలీ. ఏదేమైనా ఇండీపాప్ రంగానికి మాత్రం ఆయన 'లక్కీ'గా లభించినట్టే.

**- వి.అరుణ సత్యవతి**

## ఘంటసాల క్విజ్ -6 విజేతలు

1. మొదటి బహుమతి - మల్లిడి విజయభాస్కర్ రెడ్డి, కుతుకులూరు
2. రెండవ బహుమతి - యన్న వేంకట నర్సిరెడ్డి, ఉప్పలపాడు
3. మూడవ బహుమతి - సోమయాజుల సాయిప్రసాద్, ఒనకడిల్లీ(ఒరిస్సా)

**కరెక్టు సమాధానాలు:**

1. మనదేశం
2. ఎస్.వి.రంగారావు
3. సముద్రాల రాఘవాచారి
4. సముద్రాల రాఘవాచారి
5. వరుడు కావాలి

**బహుమతులు:**

1. మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
2. రెండవ బహుమతి : 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటల) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
3. మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం



ఇలపావులూరి మురళీమోహనరావు

**12**

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్‌చదవడం నిషేధం.
ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.

ఈ సీరియల్ రచయిత 1-15 జులై 2003 సంచికలో -
జంధ్యాల గారు పగలబడి నవ్విన డైలాగ్ ఏమయ్యుంటుందో ఊహించండి -
అంటూ పాఠకులకిచ్చిన క్విజ్‌కి సరియైన జవాబు
"అది ఆడదో మగదో చూడిదో పాడిదో నాకిలా తెలుస్తుందే గాడిదా" (అదే సంచికలో 45వ పేజీలో ఉంది)
ఈ క్విజ్‌లో ఎంతోమంది పాల్గొన్నా సరియైన సమాధానాన్ని రాసినవారు మాత్రం
1. సోమయాజుల సాయిప్రసాద్ - ఒనకఢిల్లీ (ఒరిస్సా)
2. జి.విజయసారథి, కర్నూలు.
ఇద్దరుండడం వల్ల డ్రా తీయవలసి వచ్చింది. డ్రా తీయడానికి సహృదయంతో సహకరించిన ప్రముఖ హాస్యనటుడు శ్రీ బ్రహ్మానందం ఫీలింగ్స్‌ని ఆయన మాటల్లోనే అందుకోండి...











'హాసం' నేను రెగ్యులర్‌గా చదివే పత్రిక
మాత్రమే కాదు ఫస్ట్ ఇష్యూ నుంచి
ప్రతి ప్రతీ దాచుకుంటున్న పత్రిక కూడా!
గురువుగారు జంధ్యాల గారికి
అంకితం ఇస్తూ మొదలైన ఈ
'ఎలుక వచ్చె ఇల్లు భద్రం'
సీరియల్‌ని చాలా జాగ్రత్తగా ఫాలో
అవుతున్నాను. కామెడీని బాగా
పండిస్తున్నారు రచయిత
ఇలపావులూరి మురళీమోహనరావుగారు.
ఇక - గురువుగారు జంధ్యాల పగలబడి నవ్విన డైలాగ్ ఏంటి?
అంటూ రచయిత పాఠకులకు ఇచ్చిన క్విజ్ చూసి 'ఇదేదో తమాషాగా వుందే!'
అని అనుకున్నాను. సాధారణంగా క్విజ్‌లూ, పజిల్సూ పత్రికలు పెడుతుంటాయి.
అటువంటిది రచయిత ప్రయిజ్ మనీని ప్రకటించటం
నాకు సర్‌ప్రయిజ్‌గా అనిపించింది.
ఈలోగా ఈ క్విజ్ ఫలితాలు మీరే డ్రా తీయాలంటూ
'హాసం' పత్రిక ఎడిటర్ రాజా నాకు ఫోన్ చెయ్యడం నన్ను ఆశ్చర్యంతో పాటు
ఆనందంలో పడేసింది.
నచ్చిన పత్రిక - మెచ్చిన సీరియల్ - నాకీ బ్రతుకిచ్చిన జంధ్యాల గారు -
ఈ మూడూ నా మూడ్ మీద వర్కవుట్ అయ్యాయి. అందుకే ఒప్పుకున్నాను.
డ్రాలో గెలుపొందిన శ్రీ సోమయాజుల సాయిప్రసాద్ గారికి నా అభినందనలు

మీ

బ్రహ్మానందం

"ఇక్కడ కారు పార్క్ చెయ్యవచ్చా?" అడిగింది అనూహ్య.
"సారీ... ఇది నో పార్కింగ్ జోన్" చెప్పాడు కానిస్టేబుల్.
"మరిక్కడ చాలా కార్లు పార్క్ చేశారు గదా" కోపంగా ప్రశ్నించింది అనూహ్య.
"వారెవ్వరూ నన్ను అడగలేదు" చెప్పాడు పోలీసాయన.
ఈ భాగంలోని కానిస్టేబుల్ కనకలింగం కూడా ఇలాంటివాడే. చదవండి




వెంకట్రావును చూసి ఆశ్చర్యపోయారందరూ.

"వెంకట్రావుగారూ.. మీరా? మీకిదేం పోయే కాలం? మీరు ఇలాంటి పనులు చేస్తున్నారా?" వెంకట్రావంటే గిట్టని ఒకాయన అన్నాడు.

"చాల్లే ఊరుకోవయ్యా... శాస్త్రిగారూ... నేను పొద్దుట్నించి మీకోసం నాలుగైదు సార్లు సెల్‌కు చేశాను. రాత్రిరెండింటికి ఇంటికొస్తారని మీ అమ్మాయి చెప్పింది. ఓ అర్జెంటు పనుండి మీ కోసం వచ్చాను." బావురుమన్నాడు వెంకట్రావు.

"అవును నాన్నా" చెప్పింది రంగవల్లి.

"అవునుసార్.... ఈయన మా మనిషే. దొంగ కాడు." చెప్పాడు కాలనీ ప్రెసిడెంటు.

అందరూ వత్తాసు పలికారు.

"అవును పోలీసుగారూ ఈయన మావాడే. చాలామంచివాడు. నిజంగా నాకోసమే వచ్చాడు. వదిలెయ్యండి" చెప్పారు శాస్త్రిగారు.

"ఛి ఛీ... పట్టక పట్టక ఒక్కడు దొరికితే వాడు దొంగకాడా? అంతా నా రాత" వెంకట్రావును బంధవిముక్తుడిని చేశాడు కనకలింగం.

"దొంగైతే అంత తేలిగ్గా దొరుకుతాడండీ మన పిచ్చిగానీ" వ్యంగ్య బాణం వేశాడొకాయన.

తిట్టుకుంటూ వెళ్ళిపోయాడు పోలీసు. అందరూ సణుక్కుంటూ ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయారు.

"అయ్యయ్యో ఎంత పని జరిగింది! వాడేమైనా కొట్టాడా?" అడిగారు శాస్త్రిగారు.

"అబ్బెబ్బె... అస్సలు నా ఒంటి మీద చెయ్యివెయ్యలేదు ఊరికే కొడతానని బెదిరించాడు. ఇంతలో మీరంతా వచ్చారు" డొక్కల్లోని బాధ దిగమింగుతూ అన్నాడు వెంకట్రావు.

"పోన్లెండి. మిమ్మల్ని వంగదీసి గుద్దుతుంటే నిజంగానే గుద్దాడేమో అని భయపడ్డా. ఇంతకూ అసలు విషయం ఏంటి? ఇంత రాత్రివేళ మా కోసం ఎందుకొచ్చారు?"




"అదంతా ఇప్పుడు వివరంగా చెప్పలేను. మీరు రేపు పొద్దున్నే ఎనిమిది గంటలకు మా యింటికి రండి. మాట్లాడుకుందాం."

"ఏంటి విషయం? రేపు ఛీఫ్ మినిష్టరు గారింట్లో అన్న ప్రాశన ఉందే! ఎలా?"

"వది నిముషాల వనండీ. వెంటనే వెళ్ళొచ్చు"

"సరే! అలాగే... రేపు ఉదయం ఎనిమిది నుంచీ ఎనిమిదీ నలభై వరకూ మీకు కేటాయిస్తున్నాను."

"సంతోషం. ఉంటాను"

వళ్ళంతా పిసుక్కుంటూ మూలుగుతూ ఇంటికొచ్చాడు వెంకట్రావు.

"దొరికాడా శాస్త్రి" అడిగింది సుందరి.

"ఆహా.... రేపు ఉదయం వస్తానన్నాడు."

* * *

ఉదయం ఎనిమిది గంటలకు శాస్త్రిగారు వేంచేశారు.

"ఏంటి విషయం వెంకట్రావు గారూ? అర్ధరాత్రి పూట మా ఇంటికి వచ్చి పోలీసుచేత...."

"ఆఁ... ఆఁ... ముఖ్య విషయం శాస్త్రిగారూ..." చెప్పబోయాడు వెంకట్రావు.

"పోలీసేంటి శాస్త్రిగారూ?" అడిగింది సుందరి.

"ఏం లేదులే.... నువ్వు శాస్త్రిగారికి కాఫీ విషయం చూడు" తప్పించబోయాడు వెంకట్రావు.

"నా దగ్గర విషయాలు దాస్తారు. ఏమైంది శాస్త్రిగారు....?"

"అబ్బే... ఏం లేదమ్మా... రాత్రి గస్తీ తిరుగుతున్న పోలీసులు వెంకట్రావు గారిని చూసి ఎవరైనా దొంగేమో అనుకున్నారు. నేను వెంకట్రావునండీ. ఫలానా ఆఫీసు అని చెప్పగానే వెంకట్రావుగారికి పోటీలుపడి నమస్కారాలు చేసి తమ పొరబాటును మన్నించమని, పై అధికారులకు చెబితే ఉద్యోగాలు ఊడతాయని బ్రతిమాలారు. అబ్బో.. ఏమో అనుకున్నాగానీ అమ్మాయ్... మీ ఆయనకున్న పలుకుబడి అపారం. పోలీసులు సైతం భయపడ్డారంటే ఆహా! మీ ఆయన మా కాలనీలో ఉంటున్నందుకు శరీరం రోమాంచిత మౌతున్నది." చెప్పారు శాస్త్రిగారు.

సుందరి గర్వంగా నవ్వింది. వెంకట్రావు నిట్టూర్చాడు.

"వెంకట్రావుగారూ. ఇపుడు చెప్పండి విషయం. నేను చాలాబిజి. అవతల ఆరు పెళ్ళిళ్ళు, రెండు చావులు, నాలుగు గృహప్రవేశాలున్నాయి." అన్నారు శాస్త్రిగారు.

"ఒకే రోజు ఇన్నింటికి ఎలా వెళ్తారండీ?" ఆశ్చర్యంగా అడిగింది సుందరి.

"ఏం చేస్తామమ్మా... పొడు పొట్టను పోషించడానికి అనేక తిప్పలు తప్పవు."

"అయ్యా శాస్త్రిగారూ... ఇంట్లో ఎలుకచేరి

## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. ఎలుకలబోను పెడితే దాన్ని ఎలుక కొరికేస్తుంది. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. అది ఎలుకను పట్టకుండా పడినిద్రపోతూ ఉంటే వెంకట్రావు మండిపడతాడు. తిండిపెట్టక మాడుస్తాడు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లి కనబడడం మానేస్తుంది. కంగారుపడుతూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో పక్కింటి ఆండాళ్ళమ్మ సలహాతో ప్రాయశ్చిత్తం చేయించాలని పురోహితుని కోసం ఫోన్ చేసిచేసీ విసిగిపోయిన వెంకట్రావు ఆయన్ని ఎలాగైనా కలవలాన్న ఉబలాటంలో అర్ధరాత్రి బయలుదేరి వెళ్లి కానిస్టేబుల్ కనకలింగం చేతికి చిక్కుతాడు -(ఇక చదవండి)

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

"నశ్యం భశ్యకరం
నేత్రద్వయం నాశనం"
అన్నది ముక్కు పొడుం మీద పెద్దవాళ్ళు వేసే ఛలోక్తి.
అటువంటి నశ్యాన్ని నసాళానికంటే లెవెల్లో పీల్చే ఓ శాస్త్రి గారు ఏం చేశాడో చదవండి.

ఇల్లు గుల్ల చేస్తుంటే దాన్ని చంపడానికో దిక్కుమాలిన పిల్లిని తెచ్చాం"

"శ్రేష్టం!"

"కానీ అది అప్పటికే కడుపుతో ఉన్న పిల్లి"

"దివ్యం"

"దానికెక్కడా చోటులేనట్లు మా ఇంట్లోని అటకమీద ఆరుపిల్లి కూనలను ఈనింది."

"శుభం"

"పాపం పసి కూనలు కదా అని జాలిపడి రెండు రోజులు వాటికి పాలు పట్టాం."

"పుణ్యం"

"కానీ. మర్నాడు చూస్తే వాటిలో ఇక పిల్లికూన చచ్చింది."

అంతే! కుర్చీకింద భూకంపం వచ్చినట్లు ఎగిరిపడ్డారు శాస్త్రిగారు.

"పావం! పావం! మహాపావం!" లబలబలాడారు.

"ఏం చేయాలో తోచక మిమ్మల్ని పిలిచాం" చెప్పాడు వెంకట్రావు.

"ఏం చేయాలని మెల్లగా అడుగుతారేంటి? చాలా చెయ్యాలి. అమ్మాయ్ నా బుర్ర మొద్దుబారి పోయింది. ముందునువ్వు చిక్కని డికాషన్ వేసి. నాలుగు చెంచాలు పంచదారతో నీళ్ళు కలపని పాలుపోసి ఒక లోటాతో కాఫీ పట్రా. చెబుతా"

"లోటా కాఫీ ఎందుకు శాస్త్రిగారూ? ఈ మధ్య పుణ్యాఃవచనాలు కాఫీతో చేస్తున్నారా ఏంటి?

పెద్దగా నవ్వారు శాస్త్రిగారు "చమత్కారంలో మీ ఆయన తరువాతే ఎవరైనా అమ్మాయ్. ఈ కాలనీలో ఎవడు నోరు తెరిచినా కంపే. కానీ మీ ఆయన వాగ్ధాటికి గంగాదేవైనా పొంగి దివి నుండి భువికి ఎగురుతూ వస్తుంది." అన్నారు.

వెంకట్రావు ఛాతీ పొంగింది. సుందరి కాఫీ




తీసుకురావడానికి లోపలికెళ్ళింది.

శాస్త్రిగారు నశ్యం డబ్బా తీశారు. చిటికెడు నశ్యాన్ని బొటనవేలు, మధ్యవేలుతో బిగించి పెద్ద శబ్దం చేస్తూ గట్టిగా పీల్చుకున్నారు. ఒక్క నిముషం పాటు కళ్ళు తేలవేస్తూ ఆనంద పారవశ్యంలో మునిగిపోయారు.

"ఆహా...హా...హా... ఈ నశ్యగంధాన్ని ఎవరు కనిపెట్టారో తెలియదుగానీ వెంకట్రావు గారూ! ఆహా! దీనిని ఆఘ్రాణించగా కలిగే సౌఖ్యం సురాపాన విందులోగానీ, అందాల మగువల పొందులో గానీ ఉండదంటే నమ్మండి. గట్టిగా పీల్చగానే గుండెకవాటాల్లోకీ, మెదడు నరాల్లోకీ, కళ్ళలోకి, చెవిగూబల్లోకి, స్వరపేటికలోకి ఒకేసారి చొచ్చుకుపోయి స్వర్గం కళ్ళముందు సాక్షాత్కరిస్తుందనుకోండి" అన్నారు శాస్త్రిగారు.

"శాస్త్రిగారూ... నేను నశ్యం పీల్చను. మందు వానన కూడా చూడను. అమ్మాయిలంటేనే నాకు చచ్చే భయం. ఇక ఈ స్వర్గాల సంగతి నాకేం తెలుస్తుంది?" అన్నాడు వెంకట్రావు.

ఇంతలో లోటాతో కాఫీ తెచ్చింది సుందరి. లోటాలో ముఖం పెట్టి వాసన పీల్చారు శాస్త్రిగారు.

"ఆహా ఫిల్టర్ వెయ్యడంలో అమ్మాయిని మించిన ఘనాపాఠీలు ఈ చుట్టుపక్కల అగ్రహారాల్లోనే లేరండీ. నేను కాశీ నుండి రామేశ్వరం వరకు నాలుగుసార్లు చుట్టి వచ్చాను. ఎక్కడ తాగినా చుట్ట కంపు తప్ప కాఫీ ఇంపులేదు. ముందు దీనిని తాగితే గానీ నాకు నోట మాట వచ్చేట్లులేదు." జుర్రుమని శబ్దం చేస్తూ కాఫీ తాగారు శాస్త్రి.

మళ్ళీ నశ్యం పట్టు పట్టారు.

"ఆహా... వెంకట్రావుగారూ. నశ్యాన్ని పీలిస్తే క్యాన్సరొస్తుందని, క్షయ వస్తుందని చదువుకున్న మూర్ఖులు అంటుంటారు. మా తాత రోజూ డబ్బా నశ్యం పీలుస్తూ నూటైదు సంవత్సరాలు బ్రతికారు. మా నాన్నగారు రోజూ అటు ముక్కు ద్వారా పీల్చడమే కాక తాంబూలంలో కూడా నశ్యాన్ని వేసుకుంటూ తొంభై సంవత్సరాలొచ్చినా గుండుముక్కలా ఉన్నారు. పల్లెల్లో రైతులు మూరెడు పొడుగు చుట్టలు కాలుస్తుంటారు. ఏదో విధంగా అవతలివాడి వ్యాపారం చెడగొట్టడం తప్ప వీళ్ళకేం పన్లేదు. ఏమంటారు?"

వెంకట్రావుకు విసుగొచ్చింది.

-(ఇంకావుంది)



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

ఆగస్టు 21 ఆదినారాయణరావు జయంతి సందర్భంగా...

# ఆదినారాయణరావు గారికి అంజలి...





ఆయన స్వరూపం లలితం. స్వభావం అతిలలితం.
ఆయన చక్కని భావుకుడు, చిక్కని కవి, అంతుచిక్కని
ఆధ్యాత్మికవేత్త, ఆయన మాట తేనె తెలుగుతేట.
మానససరోవరంపై స్వరం పదం తెలిసి హాయిగా తేలియాడే
కలహంస ఆయన కట్టిన పాట... కమ్మని పాట.
సత్యసాయి సేవా జీవనగంగలో మునిగి తేలిన
ముముక్షువు ఆయన. అంతరంగాన్ని అంజలిగా
మలుచుకున్న మధురమూర్తి -

మధువంతీ, జై జైవంతీ, బంతీ చేమంతీ అంత తేలికగా చేతికందే పాటల తోట ఆయనది. నవ రోజ్‌లు మాల్కోస్‌లు నవనవలాడుతూ రోజూ పూసే విరితోట ఆయన మనసు.

ఆయనే సుప్రసిద్ధ సంగీత దర్శకుడు శ్రీ ఆదినారాయణరావు.

శాస్త్రీయ సంగీత రత్నాకరంలోని అనర్ఘమణులను వెతికి వెలికి తెచ్చే కృషిలో తనకు తెలియకుండానే మహా సంగీత పరిశోధకుడైనాడు ఆయన. వేదపనసల వల్లింపులోను, నాట్యజతుల అలరింపులోను, గ్రామరాగ గణాల ప్రస్తారింపులోను, పౌరాణిక కాల్పనిక, చారిత్రిక, జానపద పద్ధతులలోను సంగీతం పొందుతూ వచ్చిన పరిణామాలను, వేళలు, వర్ణాలు, మనోధర్మాలు, అవస్థలు శృతిచేసుకున్న ఆలాపనలలోని స్థాయీ భేదాలను, వాడవలసిన వాద్య విశేషాలను తరచిచూచి తరతరాలకు తెలియజెప్పాలనే తపన, తపస్సు ఆయన జీవితాన్ని ఆక్రమించింది.

ఆయన హృదయం గంభీర స్వరార్ణవం. ఆయన నరనరాలు నాదరసామృతఝరులు. ఆయన పంచప్రాణాలు గీత గోవిందుని వేణువులో రాగ రంజితమైన ప్రాణవాయువులు - అయినా ఆయన మౌని.

అదుపు పొదుపు పట్టు విడుపు తెలిసి సినిమాకు కావలసినంత సంగీతమే సమకూర్చిన సినీ సంగీత జ్ఞాని ఆయన.

ఈయన ఎవరో కాదు... ఆయనే... హాయనే అనుభూతికి తన గీతిని అంకితం చేసిన శ్రీ ఆదినారాయణరావుగారే!



దేవులపల్లి, నండూరి వంటి కవుల కవితలకు తన తలనిచ్చి మోసిన వల్లూరి జగన్నాథరావు పంతులు గారి అమృతలేఖిని, యతి ప్రాసలీలా తరంగిణీ అయిన జానపద గౌతమీ వాహినీ తీరమే ఆయన కట్టుకున్న అందాలసాహితీ సంగీత కుటీరం. ఆ మధుర కవితలు ఆకళించుకున్న అచ్చ తెలుగు సంగీతం మాస్టారు ఆదినారాయణరావు గారు.

ఆకుపచ్చగా నారుమళ్లూ, పసిడిపచ్చగా పంటచేలూ వున్నన్నాళ్లూ జానపదం పండుతూనే వుంటుందని, తెలుగుతనం పలుకుతూనే వుంటుందని నమ్మిన ఆశాజీవి ఆదినారాయణుడు. నిర్మాణకర్మగా ఎన్నో గేయాలు జానపద రీతిలో వెలయించిన వల్లూరి వారి వారసత్వం ఆయనది.

ఇంతకీ ఎవరీ వల్లూరి?

'అన్నాడె వస్తనన్నాడె నా నేస్తము నిలువ లేనన్నాడె' అని సీతా అనసూయలు పాడి, ఆకాశవాణి వారు పదేపదే ప్రసారం చేసి పుణ్యం కట్టుకున్నారు గానీ, లేకపోతే ఈ మాత్రం కూడా వల్లూరి వారి చిరునామా మనకు దొరికేది కాదు.

అనేక చిత్రాలకు సంగీతం సమకూర్చే సందర్భాలలో ఆదినారాయణ రావు గారు ఆ ముద్రను వీడలేదు. ఆ ముద్దును పోగొట్టుకోలేదు. 'అల్లూరి సీతారామరాజు' చిత్రానికి ఆయన చేసిన పాటలు కొన్ని ఇందుకు సాక్ష్యాలు. దేశీయమైన విప్లవ గీతాలలో, ఛందస్సులలో కనిపించే గమకం, ప్రకంపనం, ఉచ్చారణ ధోరణి 'సీతారామరాజు' చిత్ర గీతాల్లో ఆదినారాయణరావు గారు సాధించారు.

'రగిలిందీ విప్లవాగ్ని ఈ రోజు ఆ అగ్ని పేరు అల్లూరి సీతారామరాజు' అనే పాటలో అది ప్రస్ఫుటంగా కానవస్తుంది.

మన సంగీత దర్శకులలో ఆదినారాయణరావు గారికున్నంత భారతీయ సంగీత పరిచయం వున్నవారు అరుదు. ఆయన సినిమాల కోసం కాక విడిగా తన కోసం వివిధ సంగీత రీతులపై నిరంతర పరిశోధన జరిపారు. బాలగంధర్వ పూర్వయుగం నాటి మరాఠీ సంగీత రీతులు, బెంగాలీ, అస్సామీ సంగీతాల జానపద ధోరణులు ఆయనకు తెలిసినంత చాలా కొద్ది మంది సంగీత దర్శకులకు తెలుసు. గిరిజన సంగీత మాధుర్యాలంటే ఆయనకు ప్రత్యేకాభిమానం. వారిని కంపోజింగులో కలుసుకున్నప్పుడల్లా ఉత్సాహం కొద్దీ ఈ విషయాల మీదే ఆయనను కదలించి ఎన్నో విషయాలు తెలుసుకునేవాడిని. షెహనాయి వాద్యాన్ని గురించి ఆయనకు ఒక పుస్తకం రాయదగినంత విషయం తెలుసు. నవరసాలనూ రాగాలుగా ఆధ్యాత్మిక మూలంతో వినిపించే గిరిజన వాద్యం షెహనాయి అని ఒకసారి ఆయన చెప్పి అందుకు ఎన్నో ప్రమాణాలు చూపించారు.

'భక్తకన్నప్ప' చిత్రంలో నేను రాసిన 'శివశివశంకర భక్తవశంకర' అనే గీతానికి స్వరరచన చేసింది ఆదినారాయణరావుగారే. తరువాత సత్యం గారు మిగిలిన పాటలు స్వరబద్ధం చేయడం జరిగింది. 'తల్లీ తండ్రీ నీవేనమ్మ చల్లని తల్లీ గౌరమ్మా' అనే మరోపాటను, 'కిరాతార్జునీయం' రూపకాన్ని సత్యం గారు స్వరపరిచారు. ఆదినారాయణరావు గారి సహాయకులుగా, ఆయన సంగీత బాణీని పూర్తిగా ఆకళించుకున్న ప్రతిభాశాలి సత్యంగారు. ఆ చిత్రంలో నేను రాసిన మూడు పాటలు వారి సత్సంప్రదాయాన్ని ప్రకటించే సంగీతఝరులు-

ఆదినారాయణరావు గారికి సాహిత్యాభిలాష, అభిమానం మెండు అని ఆయన స్వరపరిచిన పాటల వల్లే తెలుస్తుంది. స్వయంగా కవిత రాయగల భావుకత వారి సొత్తు. రాసినవీ కొన్ని వున్నాయి. 'శబ్దం' అంటే ఆయనకు ప్రాణం. శబ్దం అంటే అక్షర సంయోగం వల్ల పుట్టే పదంలో ధ్వనించే నాదం, 'సిరిసిరిమువ్వ'లో నేను రాసిన పాటలు అంజలీదేవి గారికి, ఆదినారాయణరావు గారికి ఎంతో యిష్టం. 'ఝుమ్మంది నాదం' వంటి పాటలను గురించిన ప్రస్తావన తెచ్చి ఆ దంపతులు ఎంతగానో మురిసిపోయేవారు. 'అనార్కలీ' చిత్రంలో ఆయన ఎంతో హుందాతనం గల అందమైన సంగీతం అందించారు. మొఘలాయి రాజసంతో పాటు మొహబ్బత్ మధురిమలను వెదజల్లే బాణీలవి. 'రాజశేఖరా నీపై మనసు తీరలేదురా, రాజసాన ఏలరా' (ఘంటసాల, జిక్కీ) పాట స్వరంలో చిరంజీవిత్వాన్ని సంపాదించుకుంది. అలాగే తనంత లలితంగా ఆదినారాయణరావు గారు చేసిన కొన్ని 'బాణీలు' 'కలిసె నెలరాజు కలువచెలిని కలిసె యువరాజు అనార్కలిని' వంటివి మరపురాని మాధుర్యాలు. -

'సువర్ణసుందరి' చిత్రంలో ఆదినారాయణరావు అఖిల భారత స్థాయి గుర్తింపును పొందారు. 'హాయిహాయిగా ఆమనిసాగే'... అలాగే 'పిలువకురా.... నలుగురిలో నను ఓ రాజా' వంటి పాటలు ఆదినారాయణరావు గారితో పాటు తెలుగు సినిమా సంగీతానికే పేరు తెచ్చిపెట్టాయి.

కర్ణాటక, హిందుస్తానీ సంగీతాలను సమన్వయం చేసి బాణీలు సృష్టించడంలో ఆయన అందెవేసిన చెయ్యి, నేను పైన పేర్కొన్న పాటలన్నీ ఈ సమన్వయానికి నిదర్శనాలే. పహాడీ, పీలూ, మాల్కోస్, ఖమాస్ రాగాలలో ఆయన స్వరపరచి సినిమాలలో రాని ప్రయివేటు గీతాలు కొన్ని విని నేను ముగ్ధుడనైనాను. అవీ, వాటితో పాటు ఆదినారాయణరావు గారు రాసి స్వరరచినవీ కొన్ని కవితలు, గేయాలు వెలుగుచూడవలసి వుంది. ఆ కృషికి పూనుకుని శ్రీమతి అంజలీదేవి ఆదినారాయణరావు గారి మధురస్మృతికే గాక, తెలుగు, లలిత సంగీతానికి చేస్తున్న సేవ అభినందనీయం.

'అల్లూరి సీతారామరాజు' చిత్రంలో 'వస్తాడు నా రాజు ఈరోజు' అనే పాటకి ఎంతో సందర్భోచితంగా ఆయన చేసిన ట్యూన్ మెప్పుదలకి సైతం అందనంత స్థాయిలో వుండిపోయింది. ముఖ్యంగా అందులో ఆయన

వాడిన 'షెహనాయి' బిట్టు మరపురానివి.

'సిరిసిరిమువ్వ' చిత్రం ప్రీవ్యూ చూసి శ్రీమతి అంజలీదేవిగారు, శ్రీ ఆదినారాయణరావు గారూ ప్రత్యేకంగా నాకు ఫోన్ చేసి ఎంతగా మురిసిపోయారో తలుచుకుంటే ఇప్పటికీ ఆ దంపతుల కళాతృష్ణ ఎంతటిదో అనే వినమ్రభావం కలుగుతుంది. శ్రీశైల మల్లికార్జున మహాలింగ పరిష్వంగంలో గోదావరి పొంగిపోవచ్చు, భద్రగిరి శ్రీ రాముడి పాదాలను కృష్ణవేణమ్మ కడగవచ్చు. కానీ నిష్కల్మష కళా హృదయులైన ఆ దంపతుల వంటి వారిని సినీ రంగంలో ఎక్కడని, ఎప్పుడని చూడగలం? పరిశ్రమ అంతా ఒకే కుటుంబంగా, విజయాలైనా, అపజయాలైనా సమష్టిగా పంచుకున్న పంచదార చిలకల పాల మనసులు మళ్లీ చూడగలమా - ఆనాటి ఆత్మీయత, అభిమానం ఈనాడు తిరిగి రావడం ముఖ్యంగా సినీ పరిశ్రమకు అత్యవసరం.



అంజలీ పిక్చర్స్ వారు నిర్మించిన 'కన్నవారిల్లు' చిత్రంలో పాటలు రాయడానికి నన్ను తొలిసారిగా పిలిచారు శ్రీ అంజలీ, ఆదినారాయణరావు దంపతులు. ఆ కంపోజింగు జరిగినన్నాళ్లు నాకు ఎన్నో సంగీత మర్మాలను తెలుసుకునే అవకాశం దొరికింది. గురువు రహస్యోపదేశం చేసినట్టుగా ఆదినారాయణరావు గారు అనేక విషయాలు చెప్పేవారు. నిజమైన సంగీతానికి సాహిత్యం అవసరం లేదనేది ఆయన చెప్పిన మర్మాలలో ఒకటి. వాగర్థాల వంటివి అవి కావనేది ఆయన విశ్వాసం. స్వరంలో పదం వుంటుందనీ, శ్రుతిలో భావావేశం, రాగంలో వ్యాఖ్యానం వుంటాయని, అదే నిజం కాకపోతే గాత్రంతో పాటుగా నోరులేని వాయిద్యాలకు చోటెక్కడ వుంటుందనీ, కోయిల పాటకు సాహిత్యం ఎవరిస్తారని ఆయన సంగీత లాక్షణికుల పక్షాన ప్రశ్నించారు. సంగీతం సర్వతంత్ర స్వతంత్ర కళా విశేషంగా అందరూ అంగీకరించిందే - కానీ సాహిత్యాధారం లేని సంగీతం పండితులకు నచ్చినట్లు పామరులకు నచ్చుతుందా, అర్థమవుతుందా అనేది ప్రశ్న! అందుకు జవాబుదారీ వహించి వాగ్గేయం నుంచి జానపదం వరకు సంగీత రీతులెన్నో పుట్టుకొచ్చాయని చరిత్ర చెబుతుంది. అదే ఆదినారాయణరావు గారూ చెప్పేవారు.



సంగీతానిది ప్రత్యేక భాష అని, అది ఒక మధుర ఘోష అనీ, దానికి లిపి సిరాతో కాక స్వరంతో రాసి వుంటుందని ఆయన వల్ల తెలుసుకున్నాను.

'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణిః' అన్న లోకోక్తికి అర్థం పసిపిల్లలకు, పశువులకు, పాములకూ కూడా సంగీతం తెలుసు అని, కానీ దాని నిగూఢార్థం వేరే వుంది. సంగీతమనేది అసామాన్యమైనది, అందరికీ అందనిదీ. అందుకే శిశుః అంటే షణ్ముఖుడైన కుమారస్వామికి మాత్రమే తెలుసు. పశుః అంటే రిషభకర్త అయిన గాన నాట్య యోగి నందీశ్వరుడికి మాత్రమే అది తెలుసు. అనంతుడు అపారశాస్త్ర జ్ఞాని, మహాపండితుడు ఫణిః అంటే ఆదిశేషువుకు మాత్రమే తెలుసు. అందరికీ అందేది కాదు సంగీతమని ఆ విశేషార్థం. ఆదినారాయణరావు గారు ఈ విశేషార్థ గౌరవాన్ని ఋజువు చేసినవారు. ఇక సంగీతానికి గల ఇతరేతర శక్తులు, యోగ్యతలను గూర్చిన పరిశోధన వేరు. నాద చికిత్సను గురించిన ఎంతో చరిత్ర ఇటీవల క్రమంగా రూపుదిద్దుకోవడం మనమెరిగినదే - మొక్కల మీద కూడా సంగీతానికి గల ప్రభావం ఎంతో పరిశోధనాంశంగా ఈనాడు మారింది. అయితే ఆదినారాయణరావు గారు సంగీత శాస్త్ర పరిశోధనను యిటు మళ్లించలేదు.

మహాకవి క్షేత్రయ్య, భక్త తుకారాం వంటి చిత్రాలలో ఆయనకు కథను బట్టి మాత్రమే సంగీతం యిచ్చే అవకాశం దొరికింది. అయితే ఇతర కథలకన్న వీటిలో సంగీతానికి అధిక ప్రాధాన్యం వుండడం వల్ల ఆయన ఈ చిత్రాలను తానే నిర్మించారు. పూర్వీకులు, మహానుభావులు కొన్ని సన్నివేశాలకు స్పందించి చేసిన బాణీలు దత్తత చేసుకుని ఆ ధోరణిలోనే స్వరపరచే సంప్రదాయం ఆయన కూడా పాటించారు. "అమర్ భూపాలీ" (శాంతారామ్) చిత్రంలో వసంతదేశాయి చేసిన 'ఘనశ్యామ సుందరా శ్రీధరా అరుణోదయ ఆలా' అనే పాట బాణీని ఆలంబనగా తీసుకుని ఆదినారాయణరావు గారు 'ఘనాఘన సుందరా' వంటి పాటలు స్వరపరిచారు.

'కన్నవారిల్లు' చిత్రానికి నేను పాట రాసేవేళ సన్నివేశం దర్శకుడు ప్రత్యగాత్మ చెప్పడం కాగానే 'ట్యూన్' ఏమైనా ఇస్తారా అని సంగీత దర్శకుడు, నిర్మాత శ్రీ ఆదినారాయణరావు గారిని అడిగాను. 'మీరు ముక్కలు యివ్వండి నేను చేసుకుంటాను' అన్నారు. 'అలాగే... కానీ మంచి ట్యూన్ వున్నా యివ్వండి అలా కూడా ఒక పల్లవి రాస్తాను అన్నాను. 'స్వేచ్ఛగా రాయండి... మీకు నచ్చేటట్టు నేను చేస్తాను కదా' అన్నారు. అంతటి సంగీత జ్ఞాని అలా అనడంతో ఆయన ఎంత నిగర్వి అనుకున్నాను.

అంజలీ పిక్చర్స్‌కి నేను రాసే అదృష్టం 'కన్నవారిల్లు', 'చండీప్రియ' రెండు చిత్రాలకే కలిగినా అది మరపురాని అనుభూతిగా మిగిలిపోయింది. అంజలీదేవిగారు, ఆదినారాయణరావుగారు సహృదయతకు, ఆదరణకు రెండు రూపాలు. వారిద్దరూ పాట రాసేటప్పుడు చిలకా గోరింకలల్లే కూడబలుక్కుంటూ రాసిన పాటను, అందులోని సాహిత్యాన్ని విశ్లేషించి చూసుకునేవారు. నన్ను ఆ దంపతులు 'ప్రియమైన అతిథిగా' ఆదరించేవారు. అది ఎంతటి ఉదాత్త సంప్రదాయం. ఈ రోజుల్లో అదంతా ఒక స్వప్న జగత్తుగా మిగిలిపోయింది. ఈ సందర్భంలో 'కాంచనగంగ' (ఉషాకిరణ్) చిత్రంలో నేను రాసిన 'మధురాపురీ వుంది యమునా నదీ వుంది బృందావనీ వుంది కాళింది వుంది... లేనివాడొక్కడే శ్రీ కృష్ణమూర్తి' అనే పాట జ్ఞాపకం వస్తూ వుంటుంది. ఆనాటినుంచీ సినీ పరిశ్రమ, దాని కార్యకలాపాలు జరుగుతూనే వున్నాయి. కానీ ఆనాటి సంప్రదాయం, సహృదయం కొరవడిపోయాయి. ఆనాటి పెద్ద మనసులు రానురాను తెరమరుగైపోతున్నాయి.

ప్రసన్నత కళాకారుడిలో వుంటే అతను సృష్టించే కళా విశేషంలోనూ అది ప్రాణమై నిలుస్తుంది. రాగంలో ప్రసన్నత భావం సుకుమారమైనప్పుడే కనిపిస్తుంది. ఎదమెత్తనౌటకై సొదగుందరా నీ మదిగల అహమ్మెల్ల మాసిపోవునురా' అన్న భావగీతం ఈ సత్యాన్నే చాటుతుంది.

'మీరు ముక్కలు యిస్తే అవి సన్నివేశానికి తగిన నాజూకు పసందులుగా వుంటాయి. మీరు ఏ పదాలు వాడితే బాగుంటుందో అవే వాడుతారు. అవి నాకు స్వరాన్ని స్ఫురింపజేస్తాయి. అటువంటి మాటలతో మీరు పాట రాయడంలో ఒక 'రిథమ్' నాకు కనపడుతుంది. కనుక రాసిన దానికి బాణీ కడితే శిల్పంలా అందంగా, పుష్పంలా గంధంగా, కడిగిన ముత్యంలా ముద్దుగా వుంటుంది' అన్నారు ఆయన ఒకసారి. 'చండీప్రియ' చిత్రంలో 'ఓ ప్రియా చండీప్రియా' అనే పాట ఎంతో చక్కగా చాలాకాలం నిలిచే పాటగా ఆయన చేశారు. అలా ఆయనే చేయగలరు అనిపించే పాట అది.



'భారతీయ సంగీతశాస్త్రము - ఆదినారాయణీయము' అనే ఆయన రాసిన సంగీత శాస్త్ర పరిశోధనా గ్రంథం ఇటీవల జులై 10 తేదీన తమిళనాడు గవర్నర్ శ్రీ పి.యస్.రామమోహనరావు ఆవిష్కరించారు. ఎంతో శోభాయమానంగా జరిగిన ఈ ఉత్సవంలో చెన్నై తెలుగు వారసత్వం, సంప్రదాయం నేత్రోత్సవంగా మళ్ళీ సాక్షాత్కరించాయి. శ్రీ అక్కినేని నాగేశ్వరరావు, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ వైస్ ఛాన్సెలర్ డా॥ పి.మురళి, కర్ణాటకలోని విశ్వేశ్వరయ్య సాంకేతిక విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు శ్రీ బాలవీరారెడ్డి, శ్రీమతి పి.సుశీల, జిక్కి, శ్రీ పి.బి.శ్రీనివాస్ వంటి వారు ఎందరో హాజరైన తెలుగు వైభవంగా రాజభవన్ దర్బారు హాలులో జరిగిన సభ అది.

తెలుగు సాంస్కృతిక వైభవంతో, కళామంటపంగా చెన్నై రాజభవన్ దర్బారు హాలు వెలిగిపోతున్నదని ఆనాడు గవర్నర్ అభిభాషించారు. మరింతగా కళానరస్వతి దర్బారుగా రాజభవన్ వెలుగొందాలని ఆయన ఆకాంక్షించారు. ఇదెంతో ముదావహం.

శ్రీ ఆదినారాయణరావు గారు ఇందుకు పూర్తిగా అర్హులు. ఎంతో పరిశోధన చేసి రాసిన ఈ బృహద్గ్రంథాన్ని సంగీత కళాశాలలలో పరిశోధనా విభాగానికి పాఠ్య గ్రంథంగా చేయడం అత్యవసరం. అందుకు పూనుకోగల సమయజ్ఞత, విజ్ఞత ఆంధ్ర ప్రభుత్వ విద్యా సాంస్కృతిక శాఖలు ప్రదర్శించ గలవని నమ్ముతున్నాను.

శ్రీకృష్ణాష్టమినాడు పుట్టి కృష్ణ గానలీలా తరంగిణిగా జీవితాన్ని సుందరంగా దిద్దుకున్న శ్రీ ఆదినారాయణతీర్థుల మధురస్మృతికిదేనా అక్షరాంజలి -

**-వేటూరి సుందరరామమూర్తి**

---

## Some లక్షణం

# నవ్వుల సందడి




" 'కార్టన్'ల కొలది వెతల
'డెసర్టు' న 'ఒయసిస్సు' వోలె 'స్మైల్' మొలిపించే
'కార్టూ' నొక్కటి చాలును
'హర్టు' ను అలరించి 'బీటు' నదుపున పెట్టన్"

ఈ పుస్తకంలో 'బాలి' గారివి రెండు కార్టూన్లు, చంద్ర గారిది ఒకటీ వున్నాయి.




చంద్రగారి కార్టూన్ ఎవరికైనా చూడగానే నవ్వు తెప్పించక మానదు. ఇద్దరు దొంగలు బ్యాంకు దోపిడీ చేసి, ఆ డబ్బు తీసుకుని బ్యాగులో వేసుకుని పారిపోదామనుకుంటే, ఆ బ్యాగు జిప్పు తెరుచుకోదు. ఒక్కసారి ఆ దొంగల పరిస్థితి వూహించుకోండి. భీభత్సరసం నించి గూడా హాస్యరసం ఉత్పత్తి చేయొచ్చని చక్కగా నిరూపించిన కార్టూన్ ఇది.



గుండె జబ్బులున్నవాళ్ళు గుండెల్లో ఏమీ దాచుకోగూడదు-
ప్రియురాల్ని సైతం-

అంతేగాదు-



అత్తగారి కడుపు మంటకి 'అల్సరే' కారణం కానక్కరలేదు. కోడలి మెళ్లో గొలుసైనా కారణం కావచ్చు-

అంటాయి బాలిగారి కార్టూన్లు.

ఇంటికొచ్చిన బిచ్చగాడు అమ్మగారి వంట బాగుందని మెచ్చుకున్నాడని (అసలా వంట అమ్మగారిదో, అయ్యగారిదో వాడికి తెలీదుగా!) వాణ్ణి ఏకంగా ఇంట్లోకి తీసుకొచ్చి 'డైనింగ్ టేబుల్' ముందు కూచోబెట్టి ఇల్లాలు వడ్డిస్తోంటే, పాపం ఎదురుగా నిలబడి చూసే ఆ గృహస్థు మొహం ఎలా వుంటుందో చూడాలని వుందా? ఐతే 'గోపీ' గారి కార్టూన్ చూడండి.






ఎనిమిదో పేజీలో శ్రీధర్ జ్యోతిష శాస్త్రంలో వాడే 'ప్రశ్న' అనే పదంతో వ్యంగ్యాన్నీ, సంగీతం మీద బహుళ ప్రచారంలో వున్న 'జోక్' ఆధారంగా హాస్యాన్నీ సృష్టించారు.

**-నిశాపతి**



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | | |
|---|---|---|
| చిత్రం | : మనసే మందిరం (తెలుగు) | నెన్‌జిల్ ఓర్ ఆలయమ్ (తమిళం) |
| రచన | : ఆచార్య ఆత్రేయ | కణ్ణదాసన్ |
| సంగీతం | : ఎమ్.ఎస్. విశ్వనాథన్ | విశ్వనాథన్ రామమూర్తి |
| గానం | : పి.బి.శ్రీనివాస్ | పి.బి.శ్రీనివాస్ |
| అభినయం | : జగ్గయ్య సావిత్రి | ముత్తురామన్, దేవిక |

1962 లో విడుదలైన 'నెన్‌జిల్ ఓర్ ఆలయమ్' (మనసులో ఒక ఆలయం) తమిళ చిత్రానికి తమిళ చలన చరిత్రలో ఒక ప్రత్యేక స్థానం ఉంది. 'నిరంతర త్రిభుజం' (ఒక నాయకుడు ఇద్దరు నాయికలు లేదా ఒక నాయిక ఇద్దరు నాయకులు) ప్రక్రియ పాటించి జాగ్రత్తగా చిత్రాలు తీస్తే ప్రేక్షకాదరణ పుష్కలంగా ఉంటుందని నిరూపించిన ఈ చిత్రం- అతి తక్కువ రోజులలో నిర్మించిన చిత్రంగానూ పేరు గడించింది. మొత్తం కథ అంతా దాదాపుగా ఒక కేన్సర్ వైద్యశాలలో జరిగినట్టు చూపినా - సన్నివేశాల రూపకల్పన, పాత్రల చిత్రీకరణ, దర్శకుడే రాసిన సంభాషణలు, కథా గమనానికి తోడ్పడిన మధురమైన గీతాలు ఆ చిత్రాన్ని ఆనాటి వ్యాపార చిత్రాలనుంచి భిన్నమైనదిగా నిలబెట్టాయి.

కథానాయిక దేవిక, నాయకులు కల్యాణ్ కుమార్, ముత్తురామన్ మొదలైన వారికి ఎంతో పేరు తెచ్చిపెట్టింది 'నెన్ జిల్ ఓర్ ఆలయమ్'. ఈచిత్రాన్ని 'మనసే మందిరం' గా 1966 లో తెలుగులో నిర్మించినపుడు నాయిక పాత్రలో సావిత్రి, ఆమెను ప్రేమించిన వైద్యుడి పాత్రలో నాగేశ్వరరావు (తమిళంలో కల్యాణ కుమార్ ధరించిన పాత్ర) నాయిక భర్త పాత్రలో జగ్గయ్య (తమిళంలో ముత్తురామన్ ధరించిన పాత్ర) నటించారు. తెలుగు చిత్రానికీ శ్రీధరే దర్శకత్వం వహించారు.

సి.వి.శ్రీధర్‌కు దర్శకుడిగా పెద్ద పేరు తెచ్చిన 'కల్యాణ పరిశు' (పెళ్లి కానుక) చిత్రంలో పాటలు రాసిన మహాకవి పట్టుక్కోట్టై కల్యాణ సుందరం 1959లో తమ ఇరవై తొమ్మిదవ యేట మరణించారు. కల్యాణ సుందరం పాటలు రాస్తున్న నాటికే తమకంటూ ఒక పేరు తెచ్చుకున్న కణ్ణదాసన్ - 'నెన్ జిల్ ఓర్ ఆలయమ్' చిత్రానికి పాటలు రాస్తున్నారని తెలిసినప్పటినుంచీ తమిళ చలన చిత్ర ప్రేక్షకులలో ఉత్కంఠ పెరిగింది. 'కల్యాణ పరిశు' చిత్రానికి ఎ.ఎం.రాజా సంగీత దర్శకత్వం వహించారు- 'నెన్ జిల్ ఓర్ ఆలయమ్' చిత్రానికి (అప్పటికింకా విడిపోని) విశ్వనాథన్ రామమూర్తి సంగీత దర్శకత్వం వహించారు. ఆ చిత్రంలోని పాటలు విశేషమైన ప్రాచుర్యం గడించాయి. ఆరోజుల్లో చాలా తమిళ చిత్రాలలో తాత్త్విక ధోరణిలో ఒక పాటయినా ఉండడం ఆనవాయితీగా కనిపిస్తుంది. 'నెన్ జిల్ ఓర్ ఆలయమ్' చిత్రంలో 'నినైప్పదెల్లామ్ నడన్దు విట్టాల్' అనే గీతం అటువంటిదే. ఈపాటను తమిళంలో గానం చేసిన పి.బి.శ్రీనివాస్ తెలుగు చిత్రంలో ఇదే సన్నివేశం కోసం రాసిన 'తలచినదే జరిగినదా' పాటనూ గానం చేశారు.

**కణ్ణదాసన్ రాసిన తమిళ గీతం:**



నినైప్పదెల్లామ్ నడన్దు విట్టాల్
దెయ్‌వమ్ ఏదుమిల్లై
నడన్దదైయే నినైత్ తిరున్దాల్
అమైది ఎన్లుమిల్లై



ముడిన్‌ద కదై తొడర్ వదిల్లై
ఇఱైవన్ ఏట్టినిలే
తొడర్‌న్‌ద కదై ముడివదిల్లై
మనిదన్ వీట్టినిలే

ఆయిరమ్ వాశల్ ఇదయమ్- అదిల్
ఆయిరమ్ ఎణ్ణంగళ్ ఉదయమ్



యారో వరువార్ యారో పోవార్
వరువదుమ్ పోవదుమ్ తెరియాదు

ఒరువర్ మట్టుమ్ కుడి ఇరున్ దాల్
తున్‌బమ్ ఏదుమిల్లై
ఒన్నిరుక్క ఒన్ను వన్‌దాల్
ఎన్నుమ్ అమైది ఇల్లై



ఎంగే వాళ్‌క్కై తొడంగుమ్- అదు
ఎంగే ఎవ్విదమ్ ముడియుమ్
ఇదుదాన్ పాదై ఇదుదాన్ పయణమ్
ఎన్‌బదు యారుక్కుమ్ తెరియాదు



పాదైయెల్లామ్ మాఱివరుమ్
పయణమ్ ముడిన్ దు విడుమ్
మాఱువదై పురిన్‌దు కొన్‌డాల్
మయక్కమ్ తెళిన్‌దు విడుమ్

**తమిళ గీతానికి భావానువాదం ఇది:**

తలచిన వన్నీ జరిగితే దైవమంటూ ఏదిలేదు
జరిగిన దాన్నే తలుస్తూ ఉంటే శాంతి ఎన్నడూ లేదు



ముగిసిన కథ కొనసాగదు-
దేవుడు రాసిన గ్రంథంలో
సాగిన కథ ముగియదు
మనిషి ఇంటిలో

వేయి వాకిళ్ళ హృదయం- అందులో
వేయి ఆలోచనల ఉదయం
(వేయి ఆలోచనలు ఉదయిస్తుంటాయి)
ఎవరో వస్తారు (వస్తుంటారు) ఎవరో పోతారు (పోతుంటారు)
రాకా పోకా తెలియదు

ఒకరు మాత్రం కాపురముంటే
దుఃఖ మేమీ ఉండదు
ఒకటి ఉండగా వేరొకటి వస్తే (ఒకరుండగా మరొకరు వస్తే)
ఏనాటికీ శాంతి ఉండదు

ఎక్కడ జీవితం మొదలవుతుంది- అది
ఎక్కడ ఎలా ముగుస్తుంది



ఇదే దారి ఇదే పయనం
అని ఎవరికీ తెలియదు

దారులన్నీ మారుతుంటాయి
పయనం ముగిసి పోతుంది
మారుతున్న దాన్ని అర్థం చేసుకుంటే
మైకం (భ్రమ) తొలగి పోతుంది.

తమిళగీతం ప్రధానంగా గుండె బాధను చెబుతున్నట్టు కనిపిస్తుంది. గుండెకు వేయి ఆలోచనలు. ఆ గుండెలో ఇది వరలోనే ఎవరో కొలువుండగా- విధి వైపరీత్యం వల్ల ఆ జీవితంలోకి మరెవరో ప్రవేశించారు. ఒకరు కొలువున్న హృదయంలో మరొకరికి స్థానం కల్పించడం అంటే అశాంతికి గురి కావడమే కదా! జీవితం ఫలనా పద్ధతిలో సాగాలి అని ఆశించినా ఎన్నుకొన్న మార్గం మారిపోవచ్చు. మారిన మార్గం అంతు చిక్కేలోగా జీవితం అయిపోవచ్చు. అందుకని మార్పును అర్థంచేసుకోవాలనీ, అలా అర్థం చేసుకుంటే మైకం తొలగి మళ్ళీ స్పృహ తెలిసి వాస్తవం గ్రహించి జీవితాన్ని దిద్దుకోవచ్చనీ పాట హెచ్చరిస్తున్నది.

తమిళగీతంలో కలల ప్రస్తావన లేదు. ఒకరిని ప్రేమించి మరొకరిని పెళ్లాడిన ఉదంతం ప్రస్తావన ప్రత్యక్షంగా లేదు. ఆత్రేయ రాసిన తెలుగు పాటలో తమిళగీతంలో లేని ఆలోచనలు చాలా కనిపిస్తాయి.

తమిళగీతం బాణీలోనే తెలుగు పాట పల్లవీ ప్రతిధ్వనిస్తున్నది. తమిళగీతంలో 'వెయ్యి వాకిళ్ళ హృదయం' అని ఉన్న పంక్తి తెలుగులో 'మనసున కెన్నో మార్గాలు' అని కనిపిస్తుంది. 'ఆ హృదయంలో వేయి ఆలోచనలు' అని తమిళగీతం చెబుతుంది. తెలుగు పాట ఆలోచనలు వేరు. 'కనులకు ఎన్నో స్వప్నాలు' అని ఒక పంక్తిలో చెప్పి ఆ తర్వాతి పంక్తిలో చెప్పి ఆతర్వాతి పంక్తిలోనే 'ఏమౌనో మన కలలు?' అని ప్రశ్నిస్తారు ఆత్రేయ. 'ఎవరొస్తారో ఎవరుంటారో' అని తెలుగు పాటలో ప్రశ్నరూపంలో కనిపించే పంక్తి తమిళంలో 'ఎవరో వస్తారు ఎవరో పోతారు' అని కనిపిస్తుంది.

తమిళగీతం బాణీలోనే తెలుగు పాట రాయవలసి రావడం వల్ల తెలుగు పాట లో అక్కడక్కడ సౌలభ్యం కొంత తగ్గినట్టనిపిస్తుంది. 'ఎదలో ఒకరే కుదిరిన నాడు మనసే ఒక స్వర్గం'లో ఎద అన్నా మనసు అన్నా ఒకటే కదా! తర్వాతి 'ఒకరుండగా వేరొక రొచ్చారా లోకం ఒక నరకం' అనే పంక్తిలో - మనసుచోట లోకం వచ్చి కూచుంది. తమిళగీతంలో మనసులోని స్వర్గం ప్రస్తావనా లోకం నరకమయ్యే ప్రస్తావనా లేవు. స్వర్గమైన మనసే నరకమూ కావాలి. కాని మనసు కవి ఆత్రేయ మనసుకు మారుగా లోకం అనే మాట ఎందుకు వాడినట్టు? మనసును బట్టే లోకం స్వర్గంగానో నరకంగానో కనిపిస్తుంది అని సమాధానం చెప్పుకోవాలి.

చివరి చరణంలో తమిళగీతంలో లేని ప్రస్తావనలు తెచ్చారు ఆత్రేయ. ఒకరిని ప్రేమించిన నాయిక మరొకరిని పెళ్ళాడింది. ప్రేమ పవిత్రమైనదే. పెళ్ళి పవిత్రమైనదే. 'మరి నిజమైన బంధం ఏది?' అని ప్రశ్నిస్తూ తర్వాతి పంక్తులలో వేదాంత ధోరణిలో సమాధానం చెబుతారు ఆత్రేయ. 'మంచి చెడూ మారేదె మనదన్నది మాసేదే' అంటూ 'ఇది సహజం ఇది నిత్యం ఎందులకీ భేదం' అని పాటను ముగిస్తారు - ఆయన.

తమిళగీతం పల్లవిలో రెండవ పంక్తిలో 'జరిగిన దాన్నే తలుచుకొంటూ ఉంటే శాంతి ఎన్నటికీ ఉండదు' అని ఉండగా ఆత్రేయ 'జరిగినదే తలచితివా శాంతి లేదు నీకు' అని రాశారు. పల్లవి మొదటి పంక్తిలోని చివర ఉన్న 'ఎందులకు' అనే మాటకు ఈ రెండవ పంక్తిలోని 'నీకు' అనే మాట అంత్య ప్రాసలాగా వినిపించాలన్నది ఆయన ప్రయత్నం కావచ్చు. ఆత్రేయ పాటల్లో మామూలుగా కనిపించే తేట మాటల అల్లిక - ఈపాట పల్లవి ఎత్తుగడలోనే కాక పాటలో చాలా చోట్ల కనిపించకపోవడం ఆశ్చర్యం కలిగించే విషయం!

- పి.ఎస్.గోపాలకృష్ణ

**ఇక్కడ ఆత్రేయ రాసిన తెలుగు పాట:**

తలచినదే జరిగినదా దైవం ఎందులకు
జరిగినదే తలచితివా శాంతిలేదు నీకు
ముగిసిన గాథ మొదలిడదు దేవుని రచనలలో
మొదలిడు గాథ ముగిసెదెప్పుడో మనుజుల బ్రతుకులలో ॥తల॥
మనసునకెన్నో మార్గాలు కనులకు ఎన్నో స్వప్నాలు
ఎవరొస్తారో ఎవరుంటారో ఏమౌనో మన కలలు.. ॥మన॥
ఎదలో ఒకరే కుదిరిననాడు మనసే ఒక స్వర్గం
ఒకరుండగ వేరొకరొచ్చారా లోకం ఒక నరకం॥తల॥
ప్రేమ పవిత్రం - పెళ్ళి పవిత్రం - ఏది నిజమౌ బంధం
ఏది అనురాగం - ఏది ఆనందం - బ్రతుకునకేది గమ్యం
మంచీ చెడూ మారేదే - మనదన్నది మాసేదే
ఇది సహజం - ఇది నిత్యం - ఎందులకీ భేదం ॥తల॥



## హిందీ సినీ సంగీతంలో మలుపులూ - మజిలీలూ

### 1957

సి.రామచంద్ర స్వరరచనలో 'నౌషర్వీన్ - ఎ- అదిల్' చిత్రంలో లతా - రఫీ గానం చేసిన 'తారోం కి జుంబాం పర్ హై', 'భూల్ జాయే సారే గమ్', రఫీ పాడిన 'యే హస్రత్ థి' పాటలు హిట్ అయ్యాయి.

సలీల్‌చౌధురి సంగీతంలో వెలువడిన 'ఏక్ గగన్ కి కహానీ' లో తలత్ పాడిన 'రాత్ నే క్యా క్యా క్వాబ్', 'ఝుమే రే నీలా అంబర్' పాటలు పెద్ద హిట్ అయ్యాయి.


హేమంత్‌కుమార్

ఫాషన్ చిత్రంలో మనోజ్‌కుమార్ కోసం 'ధర్తీ కి గోద్ మేం' పాటను సంగీత దర్శకుడు హేమంత్‌కుమార్ స్వయంగా పాడారు. అదే చిత్రంలో ఓ కామెడీ పాత్రలో కూడా ఆయన నటించటం ఓ విశేషం. అలాగే ఏక్ ఝులక్ చిత్రం కోసం ఆశా తో 'యే హస్తా హువా', గీతాదత్‌తో 'ఆ జా జరా' రెండు డ్యూయెట్స్ హేమంత్ పాడారు. 'మిస్ మేరీ' చిత్రం కోసం హేమంత్ స్వరపరిచిన 'బృందాబన్ క కృష్ణ కన్హయ్యా', 'యే మర్ద్ బడే', 'సో గయా సారా జమానా' పాటలు ఎవరు మరచిపోగలరు.

'చంపా కాళి' చిత్రం కోసం లతా పాడిన 'చుప్ గయా కోయీ రే' పాట లతా హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయింది.

మిస్ ఇండియా చిత్రంలో రఫీ గానం చేసిన 'బదలా జమానా'(ఎస్.డి.బర్మన్ సంగీతం), మిస్టర్ ఎక్స్ చిత్రంలో గీతా -రఫీ ల డ్యూయెట్ 'సద్కే తేరీ చాల్ కే' ఈ సంవత్సరం హిట్ అయిన మరికొన్ని గీతాలు.


రఫీ

-(వచ్చే సంచికలో మరికొంత)

సప్తస్వర సుందరి



# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

ప్రారంభ దశలోనే "లత" ప్రతిభని గుర్తించి, తగిన ప్రోత్సాహాన్నిచ్చిన సంగీత దర్శకులు బహు కొద్దిమంది. నేపథ్య గాయనిగా ఆమె పేరు శిఖరాలకి ఎదిగిన పిదప "లత" చేత పాడించినవారూ బహు కొద్దిమందే! పాడించగోరని సంగీత సంయోజకులు వేళ్ల మీద లెక్కింప దగినంతమంది మాత్రమే - వారిలో ఓ.పి.నయ్యర్ ఒక్కరు. కాని లత గానం గురించి ఆయనా సదభిప్రాయం గలిగినవారే -

ఆదిలోనే అత్యంత అధికంగా ప్రోత్సాహం ఇచ్చిన వారు - ఖేమ్‌చంద్‌ప్రకాశ్, దత్తాదావ్‌జేకర్, గులాం హైదర్. క్రమేపి, హుస్నలాల్ భగత్‌రాం, నౌషాద్, సి.రామచంద్ర, శంకర్-జైకిషన్, రోషన్. తరువాత మోస్ట్ సక్సెస్‌ఫుల్ కాంబినేషన్ - లతా మదన్‌మోహన్‌లదే. అయినా సజ్జాద్ హుస్సేన్‌కి లతా పాడిన పాటల ప్రత్యేకత వాటిదే!

నౌషాద్ సంగీత దర్శకత్వంలో లతా మొదటి పాట రికార్డింగు సంగతీ, సందర్భం చెప్పుకోదగ్గవి. అప్పటికే లత కొన్ని పాప్యులర్ సాంగ్సు పాడివున్నా నౌషాద్‌కై పాడడం చాలా ప్రాముఖ్యత గల సన్నివేశం."రతన్" "అన్‌మోల్‌ఘడీ" చిత్రాలలో అన్ని గీతాలూ పాప్యులర్ చేసిన నౌషాద్, సంగీతరంగంలో మైదాస్... అనగా ఆయన పట్టినదల్లా బంగారమే!

అవి "అందాజ్" చిత్రనిర్మాణపు రోజులు. నర్గీస్, రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్‌లు చిత్ర నాయికా నాయకులు. నర్గీస్‌కి సాధారణంగా షంషాద్‌బేగమ్ పాడుతున్న రోజులు. లతాకి అప్పుడప్పుడే పేరొస్తున్న దినాలు. నౌషాద్‌ని కలిసితీరాలని పట్టుబట్టి లతాని తీసుకువెళ్లి ఆయనకి పరిచయం చేసిన పరమోదార స్వభావుడు, అప్పటికే నేపథ్య గాయకులలో ముఖ్యుడుగా పరిగణింపబడిన ముఖేశ్.

కర్దార్ అనే నిర్మాత తనకిచ్చిన ప్రత్యేకమైన గదిలోనే నౌషాద్ తమ స్వరరచనలు చేస్తూ వుండేవారు. కర్దార్ స్టూడియోలో - లత తను స్వయంగా వెళ్లి ఆడిషన్ ఇచ్చే పరిస్థితిని దాటి జనాదరణ పొందిన పిదప ఎవ్వరినీ కలుసుకోడానికి ఇష్టపడకపోయినా, నౌషాద్‌గారే స్వయంగా ఆమెని కలుసుకోవాలనే అభిలాషతో వున్నారనీ, అంతటి గొప్ప సంగీత దర్శకుడి మాట నిరాకరించడం నిరాదరణగా పరిణమిస్తుందనీ ముకేశ్ నొక్కినొక్కి చెప్పి ఒప్పించడం వలన అతని పట్ల గౌరవాభిమానాలున్న లతా నౌషాద్‌ని కలుసుకుంది.

## లతా గానలహరి
### ధీరేసే ఆజారే



ధీరేసే ఆజారే అఖియన్ మేఁ
నిందియా ఆజా రే ఆజా
ధీరేసే ఆజా ధీరేసే ఆజారే..
చుప్‌కేసే నైనన్ కీ బగియన్ మేఁ ॥నిందియా॥ ॥ధీరేసే॥
హెూ... లేచల్ సుహానే సప్‌నోం కీ కలియాఁ
సప్‌నోం కీ కలియాఁ
లేచల్ సుహానే సప్‌నోం కీ కలియాఁ ,
ఆకే బసాదే పల్‌కోం కీ గలియాఁ
పల్ కోంకీ ఛోటీ సీ గలియన్ మేఁ ॥నిందియా॥ ॥ధీరేసే॥
ఓ... తారోంసే ఛుప్ కర్ తారోం సే చోరీ,
తారోంసే చోరీ
తారోంసే ఛుప్‌కర్ తారోంసే చోరీ,
దేతీ హై రజనీ చందా కో లోరీ
సోతా హై చందా భీ నిందియన్ మేఁ,
నిందియా ఆజారీ ఆజా ॥ధీరేసే॥ ॥నిందియా॥

చిత్రం : అల్‌బేలా
గీతం: రాజేంద్రకిషన్
సంగీతం: సి.రామచంద్ర

నౌషాద్ సంగీత మనీషియే కాక, పెద్దమనిషిగా పేరు గడించుకున్న మాన్యవ్యక్తి. మొదటి పరిచయంలో లతాతో - "అమ్మాయీ! నువ్వు పాడే బాణీ చాలా ఉత్కృష్టమైనది. నీ పాటలు ఇంతవరకూ, నేను రికార్డుల్లో విన్నానే కాని, ఎదురుగా కూర్చొని వినే అవకాశం చిక్కలేదు. నీ పాట నేరుగా వినాలని నా అభిలాష. ఇది నేను సంగీత దర్శకుడిగా అడగడం లేదు. ఒక కళాకారుడు ఒక కళాకారిణికి వినయంగా చేస్తున్న అభ్యర్థన. నేనేదో నిన్నూ నీ ప్రతిభనీ పరీక్షించడం కోసం ఇలా అడిగానని అనుకోకు. నా కుతూహలం మాత్రమే" - అని ఆప్యాయతతో పలికారు. ఆ పలుకులు విని ఆశ్చర్యపోయిన లతా ఆయన మాటని కాదనలేకపోయింది. వెంటనే తనదైన బాణీలో "లాహోర్" - అనే చిత్రానికై శ్యాంసుందర్ స్వరపరిచిన ఒక విశిష్టమైన 'గజల్' విస్మయం కలిగేటంత నిర్దుష్టంగా పాడగానే, నౌషాద్ ప్రభావితులైపోయి, "నీపాట వింటూ వుంటే, నీ స్పష్టమైన ఉచ్చారణలో ఉర్దూభాషలో ప్రావీణ్యం గడించడానికి నువ్వు ప్రత్యేకమైన దీక్షా శ్రద్ధలతో పరిశ్రమిస్తున్నావనే విషయం, విదితమౌతూ వుంది." అని శ్లాఘించాడాయన.

"ఉర్దూలో నా ప్రావీణ్యం ఎంతటిదో నిర్ణయించి చెప్పగలవారు మీరే కదా" అని వినమ్రతతో లతా కృతజ్ఞత తెలుపుకుంది.

ఈ సన్నివేశం జరిగిన బహుకొద్ది రోజుల్లోనే నౌషాద్ 'అందాజ్' చిత్ర నిర్మాత అయిన మెహబూబ్‌ఖాన్‌తో "మన చిత్రంలో నర్గీస్‌కి 'లత' అనే మహారాష్ట్ర బాలిక చేత పాడిస్తే మంచి ఫలితం లభిస్తుంది." అని తన అభిప్రాయాన్ని వెల్లడించారు. మెహబూబ్ నిర్ఘాంతపోయి, "మీరెప్పుడూ ఖచ్చితంగా పని చేసే వ్యక్తి అని నేనెరుగుదును. కాని మనం రికార్డు చెయ్యవలసిన పాట 'గజల్' అవడం వలన, 'ఉర్దూ' నిర్దుష్టంగా పలకవలసిన ఆవశ్యకత చాలా వుందనేది మీకు తెలియనిది కాదు కదా" అని ఒకింత సందేహాన్ని వెలిబుచ్చారు. "ఆ విషయం మీరు నాకు వదిలెయ్యండి. అమెచే నిర్దుష్టంగా పాడించుకునే పూచీనాదే..." అని నౌషాద్ అనేసరికి, తన పరిమితిని తానెరిగిన మెహబూబ్ మారు మాటాడలేదు. ఆయనకి



దర్శకనిర్మాత మెహబూబ్ ఖాన్

నౌషాద్ నిర్ణయంపైన గల నమ్మకం ఉక్కుకన్నా గట్టిది.

రిహార్సల్సు నాలుగు రోజులపాటు మాత్రమే! అప్పటికింకా ఉర్దూలో పరిపూర్ణత గడించకపోయినా ఆమె గ్రహణశక్తీ , జ్ఞాపకశక్తీ అక్కరకు వచ్చాయి. ఆమెపై తనకు గల నమ్మకం వమ్ము కాలేదని నౌషాద్‌కి అమితమైన సంతోషం ఒకవైపున్నా రికార్డింగు ముగిసే దాకా ఆయనలో ఆదుర్దా, టెన్షన్ లేకపోలేదు.

మెహబూబ్‌గారిది చాలా ప్రఖ్యాతిపొందిన బేనర్. రికార్డింగు నాడు నగరంలోని ప్రముఖ ప్రముఖులెందరో విచ్చేస్తారనేది నిస్సందేహం. "నర్గీస్" లాంటి ప్రసిద్ధ నటీమణి ఆ చిత్రానికి నాయిక - ఆమెకి ప్లేబ్యాక్ పాడేందుకు ఉర్దూలో సంభాషించడం అలవాటులేని ఒక కొత్త గాయిక ఎన్నిక అయ్యింది వారందరూ కుతూహలంగా చూస్తారు. అంతమంది ముందు ఈ కొత్త గాయిక జంకూ కొంకూ లేకుండా పాడి విషమ పరీక్షలో నెగ్గగలదా? ఒక విధంగా తనకేకాక ఆ అమ్మాయికి కూడా ఒక ఛాలెంజి!

ఎందుకైనా మంచిదనే భావనతో లతాకు రికార్డింగు రోజున వచ్చిన ఫలానా నగర ప్రముఖులు వస్తున్నారని చెప్పలేదు. ఎవ్వరినీ చెప్పనీలేదు. రికార్డింగు నాడు మొదట కొన్ని రిహార్సల్సు అయి, తనకి తృప్తి కలిగేదాకా మైకులు కూడా పెట్టనీయకుండా, "టేకు" తీసుకోవచ్చు అని అనిపించిన పిదపనే, కౌశిక్ గారిని మైక్రోఫోనులని అరేంజ్ చెయ్యమన్నారు.

అల్లామియాను ఒకసారి ప్రార్థించి, ఆత్మవిశ్వాసానికై లతాకు మరికొన్ని సూచనలిచ్చి మొదలుపెట్టారు. ఏడు టేకుల పిదప పాట ఓకే అయిపోయింది. నిర్దుష్టమైన ఆమె ఉర్దూ ఉచ్చారణ చూసి మెహబూబ్ విస్మయచకితు

లతాచే "అల్లా తేరో నామ్" వంటి మెలొడీ ప్లస్ భక్తి పాటను రూపొందించిన మహా మేధావి సంగీతదర్శకుడు జయదేవ్. ఆయన లతాచే పాడించిన మరొక చక్కని సోలో గీతం - "సప్‌నా" చిత్రంలోని "జానేకిత్‌నీ బార్ హృదయ్‌సే, మైనే తుఝేపుకారా, జిత్‌నీ బార్‌భీసునేఁ బార్‌బార్ సున్‌నాహీ చాహ్‌తాహై సున్‌నే వాలోఁకా మన్! ఈ పాటలో "లత" చూపిన ప్రత్యేక ప్రతిభ ప్రత్యేకంగా ప్రశంసనీయం. ఇదొక మోడ్యులేషన్ ముద్ద.



జయదేవ్, లతా కాంబినేషన్ - అల్లా తేరో నామ్ (హమ్‌దోనో)

అలాంటి జయదేవ్ సుమన్ కల్యాణ్‌పూర్‌తో కలిసి నాచే యుగళగీతం ("తళమళ" అనే హంటింగ్ కన్నడగీతం) పాడించారు. నేను బొంబాయి వెళ్ళినప్పుడల్లా ఆయన ఫ్లాట్‌కి వెళ్ళి, ఆయన్ని తప్పక కలుసుకునేవాణ్ణి. వెళ్ళినప్పుడు 'సప్‌నా' పాట వినిపించమని కోరేవాణ్ణి. ఎన్నిసార్లు విన్నానో చెప్పలేను. అయితే, ఈ పాటనేనడిగినప్పుడల్లా జయదేవ్ ఒక కండిషన్ పెట్టేవారు. నేను విక్రం ప్రొడక్షన్స్ వారి హిందీ డబ్బింగ్ చిత్రం "మహిషాసురమర్దిని"కై పాడిన "టైటిల్‌సాంగ్" పాడి వినిపించాలని కండిషన్.

ఆ పాట "జగ్‌కీ తారాన్‌హారీ"లో "మాతా" అనే పదాన్ని నేను మోల్డ్ చేసి బ్లెండ్ చేసిన వైనం ఆయనకు వర్ణించలేనంతగా నచ్చింది. తను ఒంటరిగా వున్నప్పుడే కాక, చుట్టూ శిష్యపరివారం కూర్చున్నప్పుడు కూడా వాళ్ళకి నన్ను ఘనంగా పరిచయం చేసి , నా కేసి తిరిగి, "ఏదీ ఆ "మాతా" అనే పదాన్ని పాడండి అని తను పాడి, నాచే పదేపదే పాడించేవారు. ఆ పాట ఆయనకే కాదు, హంటింగ్ సాంగ్స్ కంపోజింగ్ స్పెషలిస్టు అనదగిన రవి గారికి కూడా బాగా నచ్చింది. ఓ సారి నేను ఆయనను ఫ్లాట్‌లో కలిసిన సందర్భాన ఆయన "మైఁ ఆప్‌కో ఏక్‌ఖాస్‌గీత్ సునావూంగా, వో మేరా ఫేవరేట్ హై" అని ప్రశంసించి, తను ప్రత్యేకంగా రికార్డు చేసుకున్న "జగ్‌కీ తారాన్‌హారీ" పాటని ప్లే చేసి వినిపించారు. నా ఆనందాశ్చర్యాలకి మేరలేదు. ఇలాటి సందర్భాలలో ఆ పాటని కంపోజ్ చేసిన మిత్రుడు జి.కె.వెంకటేశ్‌కి ప్రతీసారీ కృతజ్ఞతావందనం సమర్పించుకునేవాడిని.



జయదేవ్

\- పి.బి.యస్.

## లతా సిస్టర్స్ మరే గాయనిని పైకి రానివ్వరని

# ఆరోపించిన సులక్షణా



'దూర్ కా రాహీ' లోని 'బేకరార్ దిల్ తూ గాయేజా' పాటతో ఒక్కసారి సంగీతరంగంలోకి దూసుకువచ్చిన గాయనీమణి సులక్షణా పండిట్. 'ఈ లతా, ఆశా ఉన్నంతకాలం వేరే గాయని, ఎంత ప్రతిభ వున్నా పైకి రావడం కల్ల. వారు రానీయరు.'' అని స్టేటుమెంటు ఇచ్చిందంటే దాని వెనుక ఆమె - చిన్నప్పటినుండీ లతా అభిమాని అయివుండి కూడా - ఎంత నిస్పృహకు లోనయిందో అర్థం చేసుకోవచ్చు.



రాజస్థాన్‌కి చెందిన శాస్త్రీయసంగీతకారుల కుటుంబంలో పుట్టింది సులక్షణా పండిట్. ఆమె తాతగారు పండిట్ మోతీరామ్, చిన్నతాతగారు జ్యోతిరామ్ రాష్ట్రస్థాయిలోనే పేరుమోసిన విద్వాంసులు. ఆమె తండ్రి పండిట్ ప్రతాప్ నారాయణ్ గాయకుడు. పినతండ్రి పండిట్ జస్‌రాజ్ భారత సంగీతరత్న బిరుదాంకితులు. కానీ ఇంట్లో ఆడవాళ్లు సంగీతం నేర్చుకోవడం నిషిద్ధమన్న కారణంగా ఆమెను నేర్చుకోనివ్వలేదు. తండ్రి సాధన చేస్తూ ఉంటే చూస్తూండేది. కలకత్తాలో జరిగే సంగీతసభలకు హాజరయ్యేది.

రేడియోలో లతాపాటలు విని మురిసిపోయేది సులక్షణా. తండ్రి ఒకరోజు 'జయజయవంతి' రాగం ఆలపిస్తూండగా పక్కనే కూచుని విని ఆయన ముగించగానే ఆ రాగంలో లతా 'సీమా' సినిమాలో 'మన్‌మోహనా, బడే ఝూఠే' పాటపాడి వినిపించింది. కూతురి గొంతులో పలికిన మాధుర్యం విన్న తండ్రి కఠినమైన శాస్త్రీయసంగీతం కంటె లలితసంగీతమే కూతురికి నప్పుతుందని గ్రహించి ప్రోత్సహించాడు.

1969లో బొంబాయిలో 'బైశాఖీ-దీ-రాత్' కార్యక్రమంలో సులక్షణా ఓ ఘజల్ పాడింది. దానికి రఫీ, దిలీప్‌కుమార్ హాజరయ్యారు. వారామెను ఎంతో ప్రశంసించారు. రఫీ లండన్‌లో తన ప్రోగ్రాం ఇవ్వడానికి వెలుతూ ఆమెను వెంట తీసుకెళ్లాడు. సునీల్‌దత్ ట్రూపులో పాడుతూ కిశోర్‌కుమార్ పరిచయం కావడంతో ఆమె 'దూర్ కా రాహీ' లో పాడగలిగింది. ఆమెకు పరిచయమయిన వారంతా 'నీలో స్టార్ మెటీరియల్ ఉంది. నటించకూడదా?' అని అడిగినా ఆమె 'నాకు పాడడమే ఇష్టం' అనేది.

---

లయిపోయారు. నగరప్రముఖులు ముక్కు మీద వేలేసుకున్నారు. అంతమంది ముఖ్యులున్నా ఏ మాత్రం నెర్వస్‌నెస్ లేకుండా పాడగలిగిన లతా ఆత్మవిశ్వాసం కూడా అందరినీ ఆకట్టుకుంది.

పాట ముగిసాక ఆ పాట టేకులు వినకుండా ఇంటికి మరలడం లతా అలవాటు. ఎంత బాగా పాడినా, ఇంకా బాగా పాడివుండవచ్చునే అని తనకి కలిగే అసంతృప్తిభావన ఆమెను కలవరపరచేది. అయితే ఆ రోజు అలా వెళ్లడానికి కుదరలేదు. తీసుకున్న టేకుల్లో దేనిని ఫైనలైజ్ చేయాలన్న విషయంలో లతా అభిప్రాయం తెలుసుకుందామని భావించి నౌషాద్ ఆమెను ఆగమన్నారు.

అదే 'అందాజ్' సినిమాలో మరొకపాట - 'తోడ్ దియా దిల్ మేరా' పదిహేను టేకుల తరవాత గాని ఓకే చెయ్యబడలేదు. నౌషాద్ మనస్తత్వం అలాంటిది. ఆయనకి పూర్తి విరోధం సి.రామచంద్రది. రెండు, మూడు రిహార్సల్సు కన్న అవసరం లేదని ఆయన అభిప్రాయం. అలగే తనకి ఓ టేకు నచ్చితే చాలు, ఎవ్వరెన్ని విధాల అభిప్రాయాలు వెలిబుచ్చినా, తన నిర్ణయాన్ని మార్చుకునే స్వభావం కాదాయనది.

ఉదాహరణకి దక్షిణాదికి చెందిన పక్షిరాజా స్టూడియో అధినేత ఎస్.ఎమ్. సుబ్బయ్యనాయుడు 'అగ్గిరాముడు'ను హిందీలో 'ఆజాద్' గా తీస్తూ బొంబాయికి వెళ్లి నౌషాద్‌ను కలిశారు. సినిమాలో అన్ని పాటలూ పదిరోజుల్లో రికార్డుచేసి ఇవ్వాలనీ, కావాలంటే ఎంత డబ్బయినా ఇస్తాననీ అన్నాడాయన. తనది అంత వేగంగా సంగీతం ఇచ్చే పద్ధతి కాదని నిర్మొగమాటంగా తిరస్కరించారు నౌషాద్. అప్పుడు నిర్మాత సి.రామచంద్రను కోరగా, దానినో ఛాలెంజిగా తీసుకుని ఆయన ఆ పదిరోజుల్లోనే అన్ని పాటలూ కంపోజు చేసి, రికార్డింగు కూడా పూర్తి చేసేసి ఇచ్చారు.

'సంకల్ప్' సినిమాలో ఖయ్యాం మ్యూజిక్ డైరక్షన్‌లో 'తూహీ సాగర్ హై తూ హీ కినారా, ఢూండ్‌తా హై తూ కిస్‌కా సహారా' పాట పాడినప్పుడు రికార్డింగు చూడడానికి వచ్చిన గేయరచయిత కైఫీ ఆజ్మీ, నిర్మాత-దర్శకుడు రమేష్ సైగల్ ఆ భక్తిగీతాన్ని బికనేర్‌లో శివాలయంలో పిక్చరైజ్ చేస్తున్నామని, తనే తెరపై పాడితే బాగుంటుందనీ అన్నారు. షూట్ చేసేటప్పుడు ఒక్క రీటేక్ కూడా లేకుండా సులక్షణా నటించడంతో ఆమె నటనా ప్రతిభ ఒక్కసారిగా బయటపడి నిర్మాతల నుండి ఒత్తిళ్లు పెరిగాయి. ఒకవక్క నటిస్తూనే పాటలు పాడసాగిందామె.

రాజశ్రీ ప్రొడక్షన్స్ వారి రాజ్‌కమల్ (చిన్నప్పటినుండీ సులక్షణా తెలుసాయనకు) సంగీతదర్శకత్వంలో 'జజ్‌బాత్', 'పాయల్ కీ ఝుంకార్' సినిమాలకు 30 పాటలు పాడాలంటే సరేనంది. అతి త్వరగా పాడి రికార్డు చేసింది. ఓ స్టూడియోలో నటిస్తూనే మేకప్‌తో సహా ఇంకో స్టూడియోలోని రికార్డింగు థియేటరుకి వరుగులు పెడుతూ వెళ్లేది కానీ పాడే ఛాన్సు వదులుకునేది కాదు.



సోదరి విజేతాతో...

అందం, గానం రెండూ కలగలసి ఉన్నాయి కాబట్టి నూర్జహాన్, సురయా ఫక్కీలో నటగాయనిగా పేరు తెచ్చుకోవాలని సులక్షణా ఆశించింది. కానీ నిర్మాతలు 'నువ్వు అందంగా ఉన్నావు కాబట్టి నటిస్తే చాలులే. లతా చేతో, ఆశా చేతో ప్లేబ్యాక్ పాడించుకుంటాం' అనసాగారు. లతా సిస్టర్స్ మోనోపలీకి దడిసి వాళ్లలా అంటున్నారని సులక్షణా అభిప్రాయపడి పై విధంగా స్టేటుమెంటు ఇచ్చింది.

సహజంగా ఇది లతాకు కోపం తెప్పించింది. సులక్షణాను ప్రోత్సహిస్తే లతా తమను వెలివేస్తుందేమోనన్న భయంతో మ్యూజిక్ డైరక్టర్లు, నిర్మాతలు ఆమెను పిలవడం మానేశారు. ఇక వేషాలపై ఎక్కువగా శ్రద్ధపెట్టింది. ఉల్‌ఝన్, సలాఖే, హేరాఫేరీ, అప్నాపన్, శంకర్ శంభు, అమర్ శక్తి, ఫాంసీ, ..ఇలా ఎన్నో విజయవంతమైన సినిమాలలో కథానాయికగా నటించిందామె.

కిశోర్‌కుమార్‌తో క్లోజ్‌గా ఉన్నా పెళ్లి దాకా రాలేదు. సంజీవ్‌కుమార్‌ను పెళ్లాడుతుందనే అందరూ అనుకున్నారు కానీ అతను వెనక్కి తగ్గాడు.ఆమెతో బాటు ఆమె చెల్లెలు విజేతా పండిట్ కూడా గాయనిగా, నటిగా రంగప్రవేశం చేసింది. తన తొలిసినిమా (లవ్ స్టోరీ) హీరో కుమార్‌గౌరవ్‌ను పెళ్లాడుతుందని అనుకున్నారు కానీ అదీ జరగలేదు.

అన్నిటికంటె చిత్రమైన విషయం ఏమిటంటే ఏ లతానైతే సులక్షణా నిరసించిందో, అదే లతా చేత తనకు ప్లేబ్యాక్ పాడించుకోవలసి వచ్చింది. అదీ లతా మహిమ! చిత్రసీమపై ఆమెకు గల పట్టు!

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

అందుచేతనే 'అల్‌బేలా' సినిమాలో జోలపాట 'ధీరే సే ఆజా అఖియన్ మే, నిందియా ఆజారే ఆజా' రికార్డింగు స్టూడియోలోనే ట్యూను చేయబడి, నిమిషాల్లో లతా నేర్చుకుని పాడగానే ఓకే అయిపోయిందిట. ఆ జోలపాటలోని వయొలిన్ బిట్ మార్దవానికి మచ్చుతునక. గుండెని కదిలించే ఆర్తి ఆ 'పీస్'లో ఉంది. ఆ వాయులీనవాద్యంతో పోటీపడుతూ లతా పేథోస్ పలికించింది. ఇలా సంగీతదర్శకుల బాణీలు, పద్ధతులు వేర్వేరైనా అందరిచేతా శభాషనిపించుకున్న గాయని లతా.

లతాను నౌషాదే తీర్చిదిద్దారనీ, ఉర్దూ నేర్పించారనీ అనుకోవడం కద్దు. కానీ ఓ సారి నౌషాదే స్వయంగా వివరించారు - "ఇవన్నీ వదంతులు. లతా తన దివ్యవాణితో నా స్వరరచనలకు జీవం పోసిందని నా అభిప్రాయం. ఆమెకు ప్రప్రథమంగా అవకాశం ఇచ్చిన గులాం హైదర్‌కే ఆ మన్ననలు అందాలి.

మేటి నిర్మాణసంస్థ ఫిల్మిస్తాన్ సారథి ఎస్.ముఖర్జీ లతాను తీసుకోవడానికి ఇష్టపడలేదు. గొంతు చాలా సన్నగా వుందనీ, తమ సినిమాలలోని నడిమివయసు నాయికలకు అంతగా నప్పదని ఆయన అభ్యంతరం. అప్పుడు గులాం హైదర్ 'చూస్తూ



ప్రోత్సహించిన సంగీతదర్శకుడు నౌషాద్

వుండండి. అనతికాలంలో ఆమెచే పాడించుకోవడానికి నిర్మాతలు క్యూలు కడతారు.' అన్నారు.

తనకు 'మజ్‌బూర్' సినిమాకి సంగీతం ఇచ్చే అవకాశం రాగానే 'అంగ్రేజీ ఛోరా చల్‌గయా', 'దిల్ మేరా తోడా, ముఝే కహీ కా న ఛోడా' పాటలు పాడించి లతా సత్తాను ఆయన చాటిచెప్పారు. దీనిలో 'దిల్ మేరా తోడా' పాట ట్యూను ఆయనకు రైలుకోసం వేచివున్న సమయాన తటాలున తట్టిందిట. తట్టగానే 555 సిగరెట్ డబ్బామూత మీద వేళ్లతో తాళం వేస్తూ ఒక్కొక్క లైనుకీ ట్యూను కడుతూ, నిమిషాలలో పూర్తి చేసేశారుట. ఆ పాట లతాచే పాడించి 'నూర్జహాన్ వంటి గాయికామణిని లోకానికి పరిచయం చేసే ఘనత తనకే దక్కిందని అందరితో అనేవారు."

గులాం హైదర్‌కి లతా పాడిన మొదటిపాట ఇదయితే, చివరిపాట 'మెహందీ' సినిమాలోని 'బే దర్ద్ తేరే దర్ద్‌కో సీనేసే లగాకే, రోలేతే' అనే పాట. కానీ ఆ పాట ఆ సినిమాలో ఉపయోగించబడక, దరిమిలా 'పద్మిని' సినిమాకి ఉపయోగపడింది. ఆ పాట రికార్డయిన మర్నాడే గులాం హైదర్ పాకిస్తాన్ తరలివెళ్లిపోయారు!

లతా పాటను నిరసించిన ప్రముఖులలో ఎస్.ముఖర్జీతో బాటు రంజిత్ స్టూడియో ఓనర్ చందూలాల్ షా కూడా ఉన్నారు. ఆయన మాతృభాష గుజరాతీ. అవినాష్ వ్యాస్ అనే సంగీతదర్శకుడి వద్ద నేర్చుకుని లతా పాడిన ఓ గుజరాతీ పాట విని ఆయన పెదవి విరిచాడు. తన కంపెనీ సంగీతదర్శకుడైన ఖేమ్‌చంద్ ప్రకాష్ లతా గురించి పొగుడుతూంటే విభేదించాడు. తీవ్రంగా వాదించాడు. దానితో బాధపడి, ఖేంచంద్ ప్రకాష్ ఆ కంపెనీనుండి రిజైన్

చేసేశారు. వెంటనే బాంబే టాకీస్ ఆయన్ని బుక్ చేసుకుంది. ఖేమ్‌చంద్ ప్రకాష్ గారే లతాచేత 'మహల్' సినిమాలో 'ఆయేగా ఆయేగా ఆనేవాలా' పాట పాడించి లతాకు చిరకీర్తి సంపాదించిపెట్టినది.

'అందాజ్' పాట రికార్డయిన పిదపనే లతాకి రాజ్‌కపూర్ ఆర్.కే. ఫిలింస్ వారి 'బర్‌సాత్' కై పిలుపు వచ్చింది. పిలుపు తెచ్చినది స్వయానా సంగీతదర్శకుడు జైకిషన్. అతనెవరో లతాకు తెలియదు కానీ అతని అందం ఆకట్టుకుంది. అతను వెళ్లాక చెల్లితో 'చూడవే ఆర్కే కంపెనీ యజమాని రాజ్‌కపూర్‌లాగేనే అక్కడ పనిచేసే ఈ అబ్బాయి కూడా ఎంత అందంగా ఉన్నాడో'.అంది.



జైకిషన్

తరువాత రిహార్సల్సుకి వెళ్లినపుడు గుర్తుపట్టింది - ఆ అందమైన అబ్బాయి, మరెవరో కాదు, సినిమాకు సంగీతం ఇస్తున్న సంగీతదర్శకుల జంటలో ఒకడని. పేరు జైకిషన్ అని. మరో అతను శంకర్. అలా ప్రారంభమయింది శంకర్, జైకిషన్, లతా, ముకేశ్ ల ఆర్.కే. స్వర్ణయుగం.

(సశేషం)

# నిండు నూరేళ్లు జీవించిన హాస్యజీవి




**"నూరేళ్ల మూడు నెలలు జీవించాలని ఉందిరా"**

**"పైన ఆ మూడు నెలలు ఎందుకో?"**

**"సన్మానాలు, అవీ ఏవో ఉంటాయిగా. ఆ ముచ్చట తీర్చుకుని పోదామని..."**

ఈ జోకును నిజంగా నిజం చేసిన మహానుభావుడు బాబ్‌హోప్. 'ది గ్రేటెస్ట్ కమెడియన్ ఆన్ ద ఎర్త్' గా ఖ్యాతి పొంది, విపరీతంగా కీర్తి, ధనం సంపాదించిన బాబ్‌హోప్ మే 29 న 100 ఏళ్లు పూర్తిచేసుకుని సన్మానాలు అవీ జరుపుకుని... గతనెల... అంటే...జూలై 27 న స్వర్గస్తుడయ్యాడు. నిజానికి పుట్టింది ఇంగ్లండులో అయినా అమెరికన్ హాస్యానికి చిరునామాగా పేరుపొందిన బాబ్‌హోప్ అసలు పేరు లెస్లీ టౌన్స్ హోప్. తన కొచ్చిన అవార్డులు దాచడానికి ఆయన ప్రత్యేకంగా వేర్‌హౌస్ ఒకటి కట్టించాడు కూడా.

ఇన్నేళ్లు ఎలా జీవించగలిగారని అడిగినప్పుడు సింపుల్‌గా ఆయన ఇచ్చిన సమాధానం - 'హాస్యం'!

నవ్వించడం, నవ్వడం వల్లనే తన యూత్‌ఫుల్‌నెస్‌ను కాపాడుకోగలిగానని అన్నాడాయన. రేడియో, టీవీ, సినిమా, స్టేజి షో - అన్ని రంగాల్లోనూ ఆయన హాస్యం వెల్లివిరిసింది. అసంఖ్యాకమైన ఆయన జోకుల్లో కొన్ని -

☺ "నేవీలో పనిచేసేవాళ్లు స్నేహితులను అస్సలు మర్చిపోరు తెలుసా! ఓ సారి నాతో పనిచేసిన ఒకతనికి అతను దివాళా తీసే పరిస్థితి వస్తే నేను డబ్బిచ్చి ఆదుకున్నాను. ఎంత సంతోషించాడో...?"

"అది సరే. నీ ఉపకారాన్ని గుర్తు పెట్టుకున్నాడా ... లేదా... అది చెప్పు ముందు."

"గుర్తు పెట్టుకోకపోవడమేం, మళ్లీ సారి దివాళా తీసినప్పుడు సాయం కోసం నా దగ్గరికే వచ్చాడు."

☺ "మనం ముసలివాళ్లమయిపోతున్నామని ఎప్పుడనిపిస్తుంది?"

"బర్త్‌డే కేక్ ఖర్చుకంటె కాండిల్స్ ఖర్చు ఎక్కువయినప్పుడు!"

☺ చెత్తకుప్పలో తిరుగాడుతున్న రెండు బొద్దింకలు మాట్లాడుకుంటున్నాయి - "కొత్తగా కట్టిన నేవీ క్వార్టర్స్ చాలా నీట్‌గా ఉన్నాయి, రూములు తళతళలాడిపోతున్నాయి, వెతికిచూద్దామన్నా కిచెన్‌లో ఒక్క మరక కూడా కనబడదు. ఆఖరికి బాత్‌రూమ్స్‌లో కూడా ఒక్క చిత్తుకాగితమైనా కూడా దొరకదు..." చెప్పుకొస్తోంది ఓ బొద్దింక. ఏదో చెత్త నములుతున్న రెండో బొద్దింక విసుక్కుంది "ఇవన్నీ నేను తింటున్నప్పుడే చెప్పాలా?" అని.

☺ బాబ్‌హోప్ సహనటుడు బింగ్ క్రాస్‌బీ ఓ సారి బాబ్‌ని తిట్టాడు, ఒళ్లు పెరిగిపోతూన్నా ఏమీ చేయటం లేదేమని.

"చూడు బింగ్, వయసు పెరిగేకొద్దీ వెయిట్ తగ్గించడం కష్టం. ఎందుకంటే అప్పటికే నీ శరీరం, కొవ్వు మంచి స్నేహం పెంచేసుకుని చెట్టాపట్టాలేసుకుని ఉంటాయి. విడిపోవడానికి ఇష్టపడవ్!"

☺ తన ఫ్రెండు ఫ్రెడ్ ఎలెన్ సినిమాల్లో ఎందుకు పనిచేయలేదని అడిగితే బాబ్‌హోప్ ఇచ్చిన సమాధానం - 'ఆ ముక్కే నేనూ అడిగాను. 'లేదు బాబ్, నా మొహం రేడియోకి మాత్రమే పనికొస్తుందని అన్నారు' అని చెప్పాడు ఫ్రెడ్!

- ఎమ్బీయస్ ప్రసాద్



# తెలుగువారిని కాచివడబోసిన భమిడిపాటి



తెలుగుతనం ఉట్టిపడేరచనలు చేయడంలోనూ, తెలుగువారి అవగుణాలను అర్థం చేసుకుంటూనే నుతారంగా వెక్కిరించడంలోనూ బాపు-రమణలు సిద్ధహస్తులని మనందరకీ తెలిసినదే. అయితే ఈ విషయంలో వారిద్దరూ గౌరవించేది 'హాస్యబ్రహ్మ' భమిడిపాటి కామేశ్వరరావు గారిని.

1958లో భమిడిపాటివారు అస్తమించినప్పుడు రమణ గారు తను రాసిన 'సాటిలేని భమిడిపాటి మాటకచ్చేరి' అనే వ్యాసంలో 'తన జాతి గురించి కూలంకషంగా తెలుసుకుని ఆ తెలుసుకున్న యావత్తు సుబ్బరంగా, నిబ్బరంగా చెప్పగలిగినవాడిని కలిగిన జాతులలో ఒకటి తెలుగుజాతి ఒకటి, తెలుగుజాతిలో అలా చేయగలిగినవారు కామేశ్వరరావు గారు ఒక్కరే.' అంటూ నివాళినర్పించారు. అదే వ్యాసంలో 'కామేశ్వరరావు గారు ఆంధ్రుడి విశ్వరూపాన్ని దర్శించగలిగారు, అందరికీ - వారి వారి సంస్కారాన్ని బట్టి అది హృదయగతం కాగల అవకాశాన్ని కలిగించారు. జాతి వికాసానికి కూడని లక్షణాలను గర్హించారు. అవి ఉన్నందుకు 'అన్నన్నా' అని బాధపడి లేచి, హన్నా అని కోప్పడి, నాన్నా అని లాలించారు.' అంటూ విశదీకరించారు.

అంతేకాదు, భమిడిపాటివారి శతజయంతి సందర్భంగా 1997 లో విజయవాడలో చేసిన ప్రసంగవ్యాసంలో ఆయన భమిడిపాటి వారి హాస్యాన్ని మచ్చు చూపించారు.

* 'తెలుగుల తెగులులను గురించి -

మొదటిది- అహం బ్రహ్మాస్మి అన్నట్లుగానే 'నేనా? ఒహ గొప్పవాణ్ని' అని స్వపరిచయం చేసుకోవడం

రెండు -తెలుగు అక్షరాలు 'క-చ-ట-త-ప'లు దేని తలకట్టు దానికుండి కలిసి చావ్వు. తెలుగువాడూ అంతే ఎవడి పిలకవాడిదే! అనైక్యత అక్షరాలలోనే కనబడుతుంది.

మూడు-'వాడు పైకొచ్చేస్తున్నాడ్రోయ్' అని ఏడ్చే అసూయ

నాలుగు-'నా మీదే నర్రోయ్' ఎవరేమన్నా తనమీదేనేమోనన్న అనుమాన ప్పిశాచం



అయిదు-'య్యాస్. అయామే టెలుగూన్!' అని చెప్పుకునే వల్లమాలిన భాషాభిమానం!

* "నువు నన్ను చెడతిట్టి పోస్తున్నావట..?"

"రామ రామ. కల్లోకూడా తిట్టలేదు. నీ మీద ఒట్టు."

"అయితే మనసులో తిట్టుగుని కుసిల్లి ఛస్తున్నావు."

* తెలుగువాడిని చూసి వీడు తెలుగువాడు అని తేల్చుగుందికి బుద్ధి ప్రయోగించాలి. వాడు తెలుగుతప్ప అన్నిటినీ అనుకరిస్తాడు. అనుకరణమే వాడి సొత్తు. ఒకడు బియ్యం మరెట్టి బాగుపడితే అంతా ఆ మరే తిప్పుతారు. ఒహడు మోటారు కారు ఎక్కితే అం-థా కారే. దివాలా తీస్తే అంథా అదే పని...



* వ్యాకరణాలు పుట్టిన కొత్తల్లో ఆదికవి నన్నయ అధర్వణుడూ వాళ్లూ తెలుగు వ్యాకరణాన్ని సంస్కృతంలో రాశారు..ఎంచాత? తెలుగులో రాస్తే ఆట్టే నిలవుండవనీ-ట!

* గోదావరీ తీరవాసులు పుణ్యజనులనిన్నీ, ఋషులు కూడా ననిన్నీ ఎక్కడివాళ్లూ అనుకుంటారు. పుణ్యజనులు అనడంలో ఆశ్చర్యం లేదు - ఈ యుగంలో. ఎంచేతంటే మెయిన్‌రోడ్డుమీద ఎక్కడ చూసినా జనం ముక్కుమూసుకునే నడుస్తూంటారు. స్మరించుకుంటూ వుంటారు.

* తెలుగువాళ్ల సభలో -

ఒకరు- దైవప్రార్థన తెలుగులో చేద్దాం

మరొకరు- తెలుగుని ప్రార్థనేమిటి నీ మొహం. దేవుడికి తెలుగురాదు. సంస్కృతాన్నే గానీ.

మరొకడు- జనగణమన పాడదాం

ఇంకోడు- అందులో ఆంధ్ర అన్నమాట గానీ కృష్ణాగోదావరీ స్మరణగానీ లేదు. కనక వద్దు.

మరొకడు- పోనీ వందేమాతరం పాడండి

ఇంకోడు- దేవుడు మొగవాడు. వందే పితరం అని పాడాలి.

మరొకడు- పితరం అంటే (ఛందస్సు) మాత్రలు చెడతాయి.

ఇంకోడు- మాతరం అంటే గోత్రాలు విడతాయి.

తెలుగుజాతి ఉన్నంతకాలం భమిడిపాటి చిరంజీవే!

- కమ్యూనికేటర్ ఫీచర్స్

---

ఆగస్టు 24 కళ్యాణ్‌జీ వర్ధంతి సందర్భంగా...

# కళ్యాణ్‌జీ హాస్యప్రియత్వం



సుప్రసిద్ధ హిందీ సంగీతదర్శకద్వయం కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీలలోని కళ్యాణ్‌జీని 'హాసం' అనవచ్చు. ఎందుకంటే ఆయనలో. హాస్యం, సంగీతం కలగలిసి ఉన్నాయి కాబట్టి.

సైనికుల కోసం రేడియోలో ప్రసంగించినప్పుడు, కళ్యాణ్‌జీ-ఆనంద్‌జీ నైట్స్‌లో కిశోర్‌కుమార్‌తో కలిసి ప్రదర్శనలు ఇచ్చినప్పుడు ఆయన అనేక జోకులు పేల్చేవారు. వాటిలో ఒకటి -

"మా ఆవిడ ఇంగ్లీషు అంతంతమాత్రమే. నా కంటె అధ్వాన్నం! కానీ ఫిలింఫీల్డులోకి వచ్చాం కాబట్టి పెద్ద, పెద్దవాళ్లను కలిసినప్పుడు మాట్లాడుతూండాలని అక్కడా అక్కడా కనబడ్డ ఇంగ్లీషు ముక్కలు ఏరుకుని వాడుతూంటాం.

ఓ రోజు ఓ పార్టీకి తీసుకెళ్లాను ఆవిడ్ని. అవతలాయన ఈవిడతో 'థాంక్‌యూ' అన్నాడు. దానికి ఈమె రోటీన్‌గా 'నో మెన్షన్' అంటుందా లేక స్టయిల్‌గా 'వెల్‌కమ్' అంటుందా అని చూస్తూండగా ఆవిడ 'ప్లీజ్ సౌండ్ హారన్' అంది. వెంటనే పక్కకు లాక్కెళ్లి అడిగాను, ఇదెక్కడిదని. 'లారీల వెనక్కాల థాంక్‌యూ కింద అదేగా రాసివుంటుంది!?' అని వాదించింది. ఇంకేం చెప్పమంటారు!?" అన్నారాయన.

దటీస్ కళ్యాణ్‌జీ.

- సి.ఎస్.ఎన్.మూర్తి



# బాపు విశ్వరూపం

18

తెలుగుభాషకు బాపు చేసిన సేవల్లో ఒకటి అందమైన అక్షరాలు సమకూర్చడం. అంటే అంతకు ముందు అక్షరాలు అందంగా లేవనికాదు. కాస్త స్పెషల్‌గా రాయాలంటే కాస్త తబ్బిబ్బు పడే పరిస్థితి ఉండేది. ఇంగ్లీషులో అయితే ఏ,బి,సి,డిలకు నాలుగురకాలైన బదులు ఉంటాయి. అచ్చులో ఉపయోగించే కాపిటల్స్, స్మాల్ లెటర్స్, తర్వాత వ్రాతలో ఉపయోగించే వంపుల అక్షరాలు, వాటి స్మాల్ లెటర్స్. వీటిని అనేక పెర్మిటేషన్స్, కాంబినేషన్స్‌లో కలిపి రకరకాల అందాలు తేవచ్చు. అక్షరాలను రకరకాలుగా రాసి ఎన్నో రకాల ఫాంట్స్ తయారు చేశారు. ఎమ్మెస్ వర్డ్ లాటి సాఫ్ట్‌వేరు చూస్తే కనీసం ఏబై రకాల ఫాంట్స్ కనబడతాయి.

## Bapu is A Great Calligrapher
## *Bapu is A Great Calligrapher*

భారతీయ భాషల విషయానికొస్తే ఉర్దూ అక్షరాలను అందంగా వ్రాసే అలవాటు కనబడుతుంది. సత్యజిత్‌రాయ్ బెంగాలీ అక్షరాలను చిన్న చిన్న మార్పులతో అందంగా ఎలా వ్రాయవచ్చో దారి చూపించాడంటారు.



సత్యజిత్‌రాయ్ డిజైన్ చేసిన బుక్ జాకెట్స్

సినిమా దర్శకుడు కావడానికి ముందు ఆయన పబ్లిసిటీ ఆర్టిస్టు కదా. సింపుల్‌గా అనిపిస్తూనే ఎలిగెంట్‌గా, ఎట్రాక్టివ్‌గా ఎలా రాయవచ్చో ఆయన చూపారు.

తెలుగులో మనకు పెద్ద, చిన్న అక్షరాలు లేవు కాబట్టి అన్నీ ఒకే తీరులో కనబడి కాస్త మొనాటనీ ఉంటుంది. బాపు ముందు వారు వాటిని అందంగా కనిపింపచేయడానికి చాలా అవస్థ పడేవారు. ఇంగ్లీషు అక్షరాల స్టయిల్లో ఏవేవో పలుకలుగా రాశేవారు. లేదా అక్కడక్కడ గీతలు పెట్టేవారు.

ఒక్కోప్పుడు అక్షరాలను విపరీతంగా అలంకరించేవారు. హెడింగ్ పెట్టాలంటే అక్షరాల చుట్టూ లతలు, పువ్వులూ పెట్టి హంగామా చేశేవారు.

చిత్రలేఖనంలో ప్రవేశం ఉంటే తప్ప మామూలువాళ్లకు ఆ రకంగా అక్షరాలు రాయడం సాధ్యపడేది కాదు. మరోరకంగా వేయాలంటే అక్షరాలు పలకలుగా రాశేవారు.

### బాపుకు ముందు...




8-11-1950 నాటి ఆంధ్రపత్రిక వీక్లి ఇన్నర్ టైటిల్



1952 ఆంధ్రపత్రిక వీక్లి నాటి కథ హెడింగ్



ఆంధ్రపత్రిక వీక్లి 1953 నాటి కథ హెడింగ్




1952లో ఏడాది పాటు నడిచిన సీరియల్‌కు టైటిల్ అలంకరించిన విధానం



ఆంధ్ర పత్రిక వీక్లీలో చిన్నపిల్లల శీర్షిక




(1956)




(1967)




(1994)

ఆ దశలో బాపు రంగప్రవేశం చేశారు. మొదట్లో అప్పుడప్పుడు పాతరకంగా రాసినా (రమణ గారి సీతాకల్యాణం కథకు అక్షరాలు రాసిన తీరు చూడండి)




త్వరలోనే అక్షరాలను పూర్తిగా కాకుండా కొంత రాసి వదిలేసినా తక్కినది స్ఫురించే విధంగా చిత్రలిపి తయారుచేశారు. పబ్లిసిటీ డిజైన్స్ లోనూ, కథల టైటిల్స్ రాయడం లోనూ దాన్నే వాడసాగారు. ధైర్యంగా అని ఇక్కడ చేర్చాలి. ఎందుకంటే సనాతనులు చాలామంది ఈ వంకరటింకర అక్షరాలను చూసి నివ్వెరపోయారు. గోలచేశారు.

దీన్ని అతిశయోక్తిగా భావించేవారికోసం ఓ చిన్న సమాచారం - 'హాసం' కార్యాలయానికి ఓ ఉత్తరం చేరింది. బాపుగారు అక్షరాలలో 'సున్న'ను పూర్తిగా వదిలిపెట్టేస్తున్నారని ఫిర్యాదు. మన భారతీయులు ఎంతో కష్టపడి 'సున్న'ను కనిపెట్టి ప్రపంచానికి బహూకరిస్తే బాపుగారి పుణ్యమాని అది కనుమరుగయిపోతోందని ఆయన వాపోయారు. భారతీయులు కనిపెట్టింది గణితంలో 'సున్న' అని, బాపు లుప్తం చేస్తున్నది లిపిలో 'సున్న' అని ఆయనకు తట్టలేదు. బాపుస్క్రిప్టుకు ఇంత పేరు వచ్చాక కూడా ఇలాటి విమర్శలు వస్తూ ఉంటే అప్పుడెలా వుండేదో ఊహించవచ్చు.

ఏది ఏమైనా బాపు లిపి ప్రజాదరణ పొందింది. ఎందుకంటే బొమ్మలు వేయడం రానివారు కూడా దానిని అనుకరించగలిగారు. సింపుల్‌గా కనబడుతూనే ఆకర్షణీయంగా కనబడింది ఆ లిపి.




**1964 లో ఆంధ్రప్రభ వీక్లీలో నడిచిన సత్యప్రభ సీరియల్ టైటిల్**



**అతి కాజువల్‌గా రాసినట్టున్నా (య వత్తు చూడండి) తెలుగువారిని ఆకట్టుకుంది., 1967 ఆంధ్రప్రభ వీక్లినుండి**

మామూలుగా, స్కూలు చెప్పిన ప్రకారం గుండ్రంగా రాస్తే బోసిగా అనిపించే లిపి బాపు స్టయిల్లో రాస్తే అందంగా అనిపించసాగింది. ఇక ఎక్కడ చూసినా బాపు స్టయిలే. సినిమాలలో క్రెడిట్స్ కూడా బాపుగారి చేత రాయించసాగారు.



బాపు అక్షర శైలికి ఉన్న డిమాండు గుర్తించిన అనూ ఫాంట్స్ వారు పదేళ్ళ క్రితం బాపు అక్షరాలను కంప్యూటరీకరించారు. వేరువేరు పేర్లతో లభ్యమయ్యే అవి ఇలా ఉంటాయి.

అక్షరశిల్పి బాపు - ఈ ఫాంట్ పేరు బాపు బోల్డు

అక్షరశిల్పి బాపు - ఈ ఫాంట్ పేరు బాపు బ్రష్

అక్షరశిల్పి బాపు - ఈ ఫాంట్ పేరు బాపు స్క్రిప్టు

లిపికి సంబంధించి ఇది ఒక విప్లవమనే చెప్పాలి. ఏ భాషలోనూ ఒక చిత్రకారుడి పేర అక్షరాలు రాసే స్టయిల్ పేరుబడడం జరగలేదు. విప్లవమనేది నిరంతరం సాగాలనే బాపు నమ్ముతారు కాబట్టి తన అక్షరాల శైలి మారుస్తూ పోయారు. మీరే చూడండి -




**(1961)**




**(1979)**




**(1994)**

బొమ్మలలో క్లుప్తత సాధించినట్టే అక్షరాలు రాయడంలో పొదుపు పాటించసాగారు. క్రమేణా అక్షరాలు మరింత కుచించుకుని పోయి, ఓ రెండు గీతలు పెడితేనే చాలు ఫలానా అక్షరం అని పాఠకులు పోల్చుకుంటారు అన్న ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగారు. దానికి తగ్గట్టే పాఠకులూ మార్చిన ప్రతీసారి ఆయన్ని ఫాలో అవుతూనే ఉన్నారు.

ఉదాహరణకి ఆయన సంతకంలో జరిగిన మార్పులు చూడండి.




కంప్యూటరులో లిపి అందుబాటులో ఉంది కదా అని బాపుగారు స్వయంగా రాయకపోయినా ఫరవాలేదు అన్న పరిస్థితి లేదు. ఆయన పెర్సనల్ టచ్ ఎప్పటికప్పుడు ఇస్తూనే వున్నారు. అందువల్ల ఆయన చేత స్వయంగా రాయించుకోవాలన్న మోజు ఎప్పటికి పోకుండా ఉంది. అదీ తమాషా!



# అంతేరా బావమరిదీ



ఆదివిష్ణు

## జరిగిన కథ



భాగ్యనగరంలోని ప్రముఖ పారిశ్రామికవేత్త బసవరాజు, జానకిల కూతురు ఉమ. కొడుకు మురళి. ఉమ ప్రియుడు వేణుకి నాగపూర్లో ఉద్యోగం వచ్చినా ఉమకోసం హైదరాబాదులోనే ఉద్యోగంకై చూస్తూంటాడు. అతని బావ రంగనాధం తన బాల్య మిత్రుడు బసవరాజును స్వయంగా కలిసి అడుగుతానంటాడు. ఈ లోపుల బసవరాజు పేపర్లో వార్తలు చదివి ఖంగారుపడి బావమరిదికై ఉద్యోగాలకోసం వచ్చే ఫ్రెండ్సును కలవకూడదని నిశ్చయించుకుంటాడు. అందుకే అతన్ని కలవడానికి వచ్చిన రంగనాధాన్ని చూడ నిరాకరిస్తాడు. కానీ తరువాత బాధపడతాడు. ఆ సంగతి తెలియని రంగనాధం బసవరాజుపై మండిపడుతూంటాడు. బావగారి పేరు చెప్పకుండా ఉద్యోగానికై వేణు డైరక్టుగా వెళతాడు. బసవరాజు అతన్ని చూసి ఇంప్రెస్ అయి ఉద్యోగం ఇస్తాడు. ఆ ఉద్యోగానికి ఒప్పుకున్నందుకు ఉగ్రుడైన రంగనాధం వేణుని ఇంట్లోంచి పొమ్మంటాడు. బసవరాజు వల్ల తనకు జరిగిన అవమానం గురించి భార్యకు చెబుతూ వుంటాడు రంగనాధం.

(ఇక చదవండి)



"అంటే ఏమిటే నీ ఉద్దేశం? ఆ చెప్పు దెబ్బలు నేను తిని వుంటే ఆనందంగా వుండేదా నీకు? ఇప్పుడు తింటున్నాను గదా? ఆనందించు. బాగా ఆనందించు! ఎంత వద్దని వారించినా నీ తమ్ముడు - నా విరోధి కంపెనీలో చేరిపోయేడు! నా విరోధి - నాతో సంప్రదించకుండానే నీతమ్ముడ్ని తన గుప్పెట్లో పెట్టేసుకున్నాడు! దొంగ రాస్కెల్ - ఆ బసివిగాడు అంతేనే! చిన్నప్పుడు - ఎలిమెంటరీ స్కూల్లో నా పలకా బలపం లాక్కునేవాడు! హైస్కూల్లో నోట్సులవీ లాక్కునే వాడు. కాలేజీలో రికార్డు పుస్తకాలు లాక్కునేవాడు. ఇప్పుడు జీవితంలో నా బామ్మర్దిని లాగేసుకున్నాడు!"




అలా అంటూనే రంగనాథం వీధిలోకి అడుగుపెడుతుండగా - అన్నపూర్ణ అడిగింది-

"అటెక్కడికీ?"

"అడక్కు! నాకు మిగిలింది శూన్యమేగా! ఆ శూన్యంలోకే దూసుకుపోతా!"

అని పెద్దపెద్ద అంగల్తో ఇంటినుంచి బయటపడ్డాడు. అన్నపూర్ణమ్మ వంట గదిలోకి వెడుతోంది!

రంగనాథం వీధిలో అడుగుపెట్టగానే - కృష్ణమూర్తి కనిపించేడు. అతను ఒక బడ్డీ కొట్టు దగ్గర నిలబడి సిగరెట్లు కొనుక్కుంటున్నాడు!

కృష్ణమూర్తి రంగనాథాన్ని చూడగానే - సిగరెట్లు కొనుక్కోవడం మానుకుని గబగబా వెళ్లిపోతున్నాడు.

రంగనాథం కృష్ణమూర్తిని విడిచిపెట్టలేదు!

ముందు కృష్ణమూర్తీ వెనగ్గా రంగనాథం నడుస్తున్నారు. ఆ నడకలోనే రంగనాథం మాటాడుతున్నాడు -

"చూచి కూడా వెళ్లిపోతావే? పలకరిస్తే పాపమవుతుందా?"

నడుస్తూనే కృష్ణమూర్తి అంటున్నాడు -

"ఈ మధ్య మీ ధోరణి అధోరకంగా వుందండి. రంగనాథం గారూ! పలకరిస్తే ఏం గొడవ అవుతుందోనన్న భయంతో వెళ్లిపోతున్నా!"

"అంతేలే! మమ్మల్ని పలకరించిన మనుషుల్ని కరవడం మా హాబీ!"

"విడిచిపెట్టండి బాబూ! అసలే వర్రీసులో వున్నాను!"

"మీకెందుకుంటాయి వర్రీసూ? సకల వర్రీసు మాకే వుంటాయి! సమస్తమైన బాధలూ మాకే వుంటాయి! మా నాన్నకి పక్షవాతం! మా అమ్మకి క్షయరోగం! మా ఆవిడికి ఉబ్బసం! నాకు చెప్పక్కర్లేదు - మతి చలించింది!-"

ఆ లిస్టు ఎంతవరకు సాగేదో గాని - కృష్ణమూర్తి రోడ్డు మీద వెడుతున్న ఆటోలో ఒక్క గెంతు గెంతి కూచున్నాడు! అతను కూచున్న ఆటో వేగం పెంచుకుంది!

కృష్ణమూర్తి ఆటోలో పారిపోయి నందుకు రంగనాథానికి కోపం వచ్చింది.

తాను కూడా ఆటో ఎక్కి వెంబడించాలనుకున్నాడు.

అంచేత అతను ఆటోకోనం వెతుకుతుండగా - సిగ్నల్ ఇవ్వని కారణంగా బసవరాజు కారు రోడ్డు మీద ఆగివుండటం చూసేడు!

సిగ్నలిస్తే ఆ కారు తన ముందునుంచే వెళ్లాలి! ఈ పాయింటు తట్టగానే రంగనాథం నేలమీద వెతుకుతున్నాడు.

రాయి కనిపించింది. తీసుకున్నాడు!

కానీ ఆ రాయి చాలా చిన్నది! దాంతో పని జరగదని ఊహించి ఆ రాయి పారేసి - పెద్ద సైజు రాయి కోసం వెతికేడు!

ఆ పక్కనే వుంది - కొబ్బరికాయంత రాయి!

ఆ రాయి తీసుకుని చాటుగా నిలబడ్డాడు!

సిగ్నల్ పడింది!

బసవరాజు కారు తనవేపే వస్తోంది!

* * *

బసవరాజు ఆఫీసు!

ఒక ఫైలు తీసుకుని వేణు బసవరాజు గదిలోకి వెళ్లేడు.

బసవరాజుని చూచి షాకు తిన్నాడు!

బసవరాజు తలకి కట్టు కట్టబడి ఉంది!

ఆ బేండేజి వేపు వేణు ఆందోళనగా చూసేడు!

వివరాలడుగుదామనుకున్నాడు! కానీ - బసవరాజు - "కూచో" అన్నాడు.

వేణు కూచుంటో అడిగేడు -

"అంత పెద్ద దెబ్బ ఎట్లా తగిలింది సార్?"

"ఆఫీసుకి వస్తుంటే - ఎవడో రౌడి వెధవ రాయిచ్చుక్కొట్టేడు!"

"కార్లో వచ్చేరుగా?"

"వాడి కసికి కారొక లెక్కా? వాడు విసిరిన రాయి అద్దం పగలకొట్టడమే గాకుండా - తలక్కూడా పంక్చరు వేసింది!"

"మీ మీద ఎవరికుంటుందండీ - అంత కోపం?"

"కోపమొక్కటే కాదు! కొండంత కక్ష కూడా వుంది!"



"రౌడీ వెధవల్ని ఎందుకు ఏమిటని అడగలేం గదా? కారణాలు లేకుండానే కక్ష పెంచుకుంటారు! గురి తప్పుతుందని తెలిసినా - పెద్దపెద్ద రాళ్ళు విసుర్తారు! కార్లో కడప వెళ్లి సురక్షితంగా తిరిగి వచ్చేనయ్యా! సొంత ఊళ్లో అడుగుపెట్టి - ఇదిగో ఈ దిక్కు మాలిన దెబ్బ తినేసేను! సప్త సముద్రాలూ సునాయాసంగా దాటి - ఇంటి ముందు మురికి గుంటలో పడటమంటే - ఇదే!"

"పోలీసు కంప్లయింటిస్తే బావుండేదేమో!"

'కంప్లయింటిచ్చి - మన కళ్లను మనమే పొడుచుకోమంటావా?"

ఆ మాటఅర్థం గాని వేణు ఆశ్చర్యంగా అడిగేడు -

"రౌడీ వెధవల మీద మీకంత జాలెందుకండీ?"

"ఆ రౌడీ వెధవ నాకు ఫ్రండు!"

ఆ మాట వినగానే వేణు అదిరిపడ్డాడు.

అందువల్ల బోలెడు ఆశ్చర్యంగా అడిగేడు -

"ఫ్రండా? మీ ఫ్రండ్సులో రౌడీలు కూడా వున్నారా సార్?"

"ఎందుకడుగుతావులే! చెప్పుకుంటే సిగ్గుచేటు! ఇంతకీ ఆ రౌడీరాస్కెల్ ఎవరనుకుంటున్నావ్?"

వేణు ఎంతో కుతూహలంగా అడిగేడు -

"ఎవరు సార్?"

"మీ బావ!"

వేణు గొప్ప షాకు తిన్నాడు! ఆ షాకుతోనే అడిగేడు -

"మా బావ... మిమ్మల్ని... ఇంత గట్టిగా కొట్టడమా?"

"చెట్టు చాటుగా రాయి విసిరితే - ఎవరికీ కనిపించననుకున్నాడు తెలివితక్కువ దద్దమ్మ! నాకు సుబ్బరంగా కనిపించేడు!"

"కనిపించేడుగదా! కారు ఆపి కారణం అడగలేకపోయారా?"




"ప్రత్యేకించి అడగడం దేనికి? నాకు తెలీకపోతే గదా? వాడ్ని సంప్రదించకుండా - నీకు ఉద్యోగమిచ్చేనని ఉడుకుబోత్తనం! మనిషి ఎదిగేడేగాని - మెదడు ఎదగలేదు! ఊ... వాడి విషయం విడిచిపెట్టు! ఇది కడప ఫైలు! కడపలో మన ప్రొడక్టుకి డిమాండు బాగా పెరిగింది! వివరాలు స్టడీ చెయ్యి!"

అని ఫైలు వేణు చేతికిచ్చేడు!

సరిగ్గా అప్పుడే ఫోన్ మోగింది!

బసవరాజు ఫోన్ తీసుకున్నాడు-

"హల్లో బసవరాజు హియర్! ఎవరు మాటాడేది?"

అవతల్నుంచి రంగనాథం గొంతు మార్చి అంటున్నాడు -

"నేను-"

"నేనంటె?"

"అబ్దుల్ రెహమాన్!"

"అబ్దుల్ రెహమానా!"

"దెబ్బ తగిలిందిట కదా?"

"రాయిచ్చుక్కొడితే తగలదా?"

"బాగా తగిలిందా?"

"వచ్చి చూడచ్చుగా?"

"బిజీగా వున్నాను! సాయంత్రం ప్రోగ్రాం పెట్టుకున్నాను!"

"మళ్లా సాయంత్రం కూడానా? అసలింతకీ మీరు -"

"చెప్పేగదా! అబ్దుల్ రెహమాన్!"

"అది ఫేక్‌నేమని తెలుస్తూనే వుంది! ఆకాశరామన్న పేరుతో దాక్కోవద్దు! దమ్ములుంటే అసలు పేరు చెప్పు!"

"చెప్పను!"

"ఒరే నీ అసలు పేరు నేను చెప్పగలనురా! కొట్టాలనుకున్నప్పుడు - ధైర్యంగా - ఎదటపడి ఫైటింగుకి దిగాలి! చెట్టు చాటెందుకురా చవట! వద్దు! నువ్వు నాతో మాటాడొద్దు! ఫోన్ పెట్టేయ్!"

అని బసవరాజు ఫోన్ పెట్టేసేడు.

తాపీగా కట్టు సవరించుకుంటో వేణుతో అన్నాడు -

"విన్నావుగా? మీ బావ!"

"అబ్దుల్ రెహమాన్-"

"అని పేరెట్టుకుని సాయంత్రం మళ్లా రాళ్ళు విసుర్తానని వార్నింగిస్తున్నాడు! వార్నింగు!

ఊఁ సర్లే! ఆ అబ్దుల్ గాడి గురించి ఆలోచిస్తూ మనసు పాడుచేసుకోవద్దు! కడప ఫైలు శ్రద్ధగా స్టడీ చెయ్యి! వెళ్లు!"

వేణు - కడప ఫైలుతో - మెదడంతా బావ తాలూకు అఘాయిత్యం గురించిన ఆలోచనలతో - ఆ గది నుంచి బయట పడుతున్నాడు!

గది బయట -

హడావిడిగా వస్తున్న పాణి - వేణుకి డేష్ యిచ్చేడు!

అతని చేతిలో వున్న దినపత్రిక కిందపడింది!

వేణు - ఆ పేపర్ని తీసి పాణికిస్తూ అన్నాడు -

"అస్సామీ పేపరు కాబోలు!"

పేపరు తీసుకుంటో అన్నాడు పాణి-

"యస్! అస్సామీ పేపరే! బాగా కనిపెట్టేరు!"



"బసవరాజు గారికి అస్సామీ కూడా వచ్చా?"

"నో! నో! వారికి ఆ భాషతో టచ్‌లేదు! నాకుంది!"

"అయ్‌సీ!"

"బాస్‌తో అర్జంటు విషయం మాటాడాలి!"

అని పాణి గబగబా బసవరాజు గదిలోకి వెళ్ళిపోయేడు.

అతను వెళ్ళిన వేపు చూస్తో ఆలోచనల్లో పడ్డాడు వేణు!

* * *

రంగనాధం ఇల్లు.

రంగనాధం ప్రశాంతంగా వుండటం వల్ల - ఆ ఇల్లు కూడా ప్రశాంతంగా వుంది!

రంగనాధం ఉప్మా తింటున్నాడు!

ఆ ఇల్లు-

ఎప్పుడూ లేనంత ప్రశాంతంగా వున్నందుకు - రంగనాధం బుద్ధిగా ఉప్మా తింటున్నందుకూ - అన్నపూర్ణమ్మ ఎంతో ఆనందించింది.

ఆనందంగానే అన్నది -

"వేణు ఫోన్ చేసేడు!"

"ఏమన్నాడు? ఉద్యోగమదీ బావుందన్నాడా?"

భర్త ఎంతో నార్మల్‌గా మాటాడుతున్నందుకు సంతోషిస్తూ - మరింత ఉప్మా వడ్డిస్తూ అన్నది అన్నపూర్ణమ్మ -

"వాడికేమండీ? అన్నీ వాడికి అనుకూలంగానే వుంటాయి! వాడి కుడి భుజమ్మీద కుంకుడు గింజంత పుట్టుమచ్చ వుంది!"

రంగనాధం ప్రశాంతంగానే ప్రశ్నించేడు -

"ఉద్యోగం గురించి అడిగితే - పుట్టుమచ్చల గురించి చెబుతావేమిటి అర్థం లేకుండానూ?"

"ఆ పుట్టుమచ్చ అక్కడే అందరికీ వుంటుందా ఏమిటి? కుడి భుజమ్మీద పుట్టు మచ్చ వుంటే - కుబేరుడవుతాడని శాస్త్రమండీ!"

అప్పుడు రంగనాధానికి కోపమొచ్చింది!

"నీ శాస్త్రం తగలెయ్య!"

అంటో ఉప్మా ప్లేటుని గాల్లోకి విసిరేసి అంటున్నాడు -

"పుట్టుమచ్చలు చూచుకుని తృప్తిపడే జాతే మీది! కుడి భుజమ్మీద పుట్టుమచ్చ వుంటే కుబేరుడవుతాడనీ - ఎడం భుజమ్మీద వుంటే వెర్రి వెధవవుతాడని పిచ్చి పిచ్చి సూత్రాలు చెప్పేవంటే చెప్పుచ్చుక్కొడతా!"

"అదికాదండీ!"

"నోర్ముయ్! మూసెయ్‌నోరు! నేనడిగిందేమిటి? ఉద్యోగం ఎట్లా అఘోరించిందో చెప్పేడా అని అడిగేను! అవునా? బాగుందని వాడంటే - బాగుందన్నాడని చెప్పు! ఏడ్చినట్టుందని అంటే - ఏడుస్తున్నాడని చెప్పు! కుంకుడుగింజంత మచ్చ - దబ్బకాయంత దెబ్బ - నీదెవసం - ఇవన్నీ ఎవడడిగేడు?"

అతని మాటలకి అడ్డం పడే ప్రయత్నం చేసింది అన్నపూర్ణమ్మ.

రంగనాధం ఆమెను మాటాడనివ్వలేదు -

"మాటాడకు! నేనడిగిందేమిటి? ఉద్యోగం - ఉద్యోగం బావుందన్నాడా అనిఅడిగేను!

నువ్వు చెప్పాల్సిందేమిటి? వాడు బావుందని అంటే బావుందనీ - బేవార్సుగా వుందని అంటే నీచంగా వుందని- సింపులు - సింపులు వాక్యంతో చెబితే సరిపోయేది! అది చెప్పకుండా - అక్కడెక్కడో మచ్చ వుంది! ఇక్కడెక్కడో చిన్న పుండుందీ - ఇవన్నీ చెప్పమని ఎవడు అడిగేడు నిన్ను?"

"తప్పయిపోయింది! ఎరక్కపోయి ఏదో అన్నానే అనుకోండి! దానికింత రాద్ధాంతం చేయాలా?"

రాద్ధాంతం అనే మాటకి రంగనాధం వళ్ళు మండిపోయింది.

అటూ ఇటూ వెతికి కంచు గ్లాసు తీసుకున్నాడు.

దాన్ని పక్క గదిలోకి విసిరేస్తూ రంకెలు పెడుతున్నాడు -

"అవునే! నేను రాక్షసముండా కొడుకుని గదా! అంచేత రాద్ధాంతమే చేస్తాను! మీరు జాతకరత్న మిడతంభొట్లు వారసులు గదా? ఎంచక్కా పుట్టు మచ్చల శాస్త్రం క్షుణ్ణంగా చదివేసి - ఆ సబ్జెక్టులో డాక్టరేటు పుచ్చుకున్న పండితులు గదా! ఏ దిక్కుమాలిన మచ్చ ఎక్కడ తగులుకుంటే ఏమవుతుందో వివరించి చెప్పే విదుషీమణులు!పెద్ద మాట వాడేసేను! ఏమైతే అయ్యింది! ఆ మాటే ఖాయం చేసేసుకో! నీ యిష్టమొచ్చిన బిరుదులు తగిలించేసుకో! వాటికి అర్థాలు తెలీకపోయినా - అట్లాగే పిలిపించుకో! నీ సొంత పేరు ఇంటి పేరుతో సహా మరిచిపో! నీ పేరుతో నిన్నెవరైనా పొరపాటున పిలుస్తే - అట్లకాడతో వాతలు పెట్టేసుకో!"

అని గబగబా వీధిలోకి వెళ్ళిపోతున్నాడు! అతని వాలకం గమనించి భయపడి - మాటాడకుండా బొమ్మలా నిలబడిపోయింది అన్నపూర్ణమ్మ!

- అక్కడ బసవరాజు ఆఫీసుగదిలో-

పాణి అస్సామీ పేపర్లో అద్భుతమైన వార్తని పూర్తిగా చదివేసేడు!

అతను చదివినదంతా శ్రద్ధగా విన్నాడు బసవరాజు!

అందులో అక్షరం అర్థం గాకపోయినా బసవరాజు ఎంతో ఆనందించేడు!

పాణిని అభినందిస్తూ అన్నాడు -

"వెరీగుడ్! అస్సామీ భాషలో కూడా నీకు అద్భుతమైన ప్రవేశమున్నందుకు ఆనందిస్తున్నాను! ఆ భాషలో కూడానువ్వు అసాధ్యుడివని తెలిసి నిన్ను అభినందించకుండా వుండలేక పోతున్నాను!"

"థేంక్యూసార్!"

అన్నాడు పాణి - ఆనందంతో మెలికలు తిరిగిపోతూ!

"ఇప్పుడు ఆ వార్త యొక్క పూర్తి వివరాలు తెలుగులో చెప్పు!" అన్నాడు బసవరాజు.

పాణి తెలుగులో చెప్పేందుకు సిద్ధపడగా - బసవరాజు అడ్డం పడ్డాడు -

"ఊరు పేరు వద్దు! విషయం చెప్పు!"

పాణి చెప్పడం ప్రారంభించేడు -

**(ఇంకావుంది)**

## కొంటెకొశ్నెన్లు - తుంటరి జవాబులు




**బి.వి.ఆర్ - రుద్రారం**

ప్ర: ఎన్నికలు జరగని మండలం?

జ: నక్షత్ర మండలం

**ఆదిరాజు - చందానగర్**

ప్ర: సంబంధం లేకపోయినా సరదాకి అడుగుతున్నాను. విశ్వనాథ వారికి వీరప్పన్‌కి 'వి' తప్ప ఇంకేదైనా ఉందా...

జ: విశ్వనాథ వారిది కల్పవృక్షం, వీరప్పన్‌ది 'కలప' వృక్షం.

**చక్రపాణి -బి.హెచ్.ఇ.ఎల్. టౌన్‌షిప్**

ప్ర: అత్తారింటికి అల్లుడు వెళ్లొచ్చుగాని అల్లుడింటికి అత్తగారు వెళ్లకూడదా?

జ: వెళ్ళొచ్చు. కాకపోతే అత్తారింటికి అల్లుడు వెళితే చుట్టపుచూపు. అల్లుడింటికి అత్తారు వెళితే చట్టపుచూపు (తనిఖీ అన్నమాట)

**రమణశాస్త్రి - సంగారెడ్డి**

ప్ర: ఆడవాళ్ళు వయసు పైబడిందని ఎప్పుడొప్పుకుంటారు?

జ: అద్దం ముందు నిలబడే ఓపిక లేనప్పుడు.

## ఈ రూటేవేరు




జూదం = 'జూ'కి వెళ్లడానికి కావలసిన ధైర్యం (ధమ్)

- బివిఆర్, రుద్రారం

See Hand = కనికరము

స్ట్రీట్ మిల్క్ = వీధిపాలు

- మహేంద్రాడచలం, టెక్కలి.



## పేరు - రిపేరు




సీతయ్య - పెళ్లి - సంబరం - చాలా బావుంది

ఒట్టేసి చెబుతున్నా - నీకు నేను నాకు నువ్వు

అమ్మాయిలు అబ్బాయిలు - ఎంజాయ్

- వై.ధీరజ్‌కుమార్, నందిగామ

## చిలిపి లిపి




Co why సరళ

Yes వర Lux me

E లయ Raw Jaw

KV మహ they one

- టి.యల్.ప్రసాద్, విశాఖపట్నం

## డబుల్ రోల్



ఆ 'డాబా' మీద కూర్చున్న వారంతా బ'డాబా'బులే!

'కాలు' తొక్కింది కాక 'ఫ కాలున' నవ్వుతావేం?

అక్కడ 'పోగుపడ్డ' పాత సామానులోనే

నీ చెవి'పోగు పడ్డ'ట్టుంది.

- బి.వి.ఆర్., రుద్రారం

## షార్ట్‌కట్స్




| | | |
|---|---|---|
| ఆవుల యామినీ సంధ్య | = | ఆయాసం |
| నీలం రమా సంగీత | = | నీరసం |
| రంపా గుర్నాథం | = | రంగు |
| రుద్రారం చిరంజీవి | = | రుచి |
| వాసా సత్యనగేష్ | = | వాసన |
| కందుల పురుషోత్తం | = | కంపు |
| డోర్నాల కుమార్ | = | డోకు |

- తెలికిచర్ల రామకృష్ణ, విజయనగరం.

## పేరడీ పేరేడ్



ప: మాయింట్లో ఒక పెట్టుంది
మాయ, మంత్రములు చేస్తుంది
మా ఇంట్లో ప్రతి ఒక్కరినీ అది
పిచ్చోళ్ళుగ తెగ మార్చిందీ...
బుల్లితెర, బుల్లితెర బుల్లితెర
దాని దుంపతెగ, దుంపతెగ, దుంపతెగ
బుల్లితెర, బుల్లితెర బుల్లితెర
దాని దుంపతెగ, దుంపతెగ, దుంపతెగ
హే... బుల్లి, బుల్లి, బుల్లి - బుల్లి, బుల్లి, బుల్లి, బుల్లి - బుల్లి,
బుల్లి, బుల్లి, బుల్లే హొయ్ ॥మాయింట్లో॥

చ: అయ్యబాబోయ్! సీరియళ్ళు అరగంటకి ఒకటి
అంతులేని పిచ్చి యాడులు నిముషానికి ఇరవై
ఓలమ్మో! యెంకమ్మో! ఎంటీవీ గ్రైండుల గోల
ఓరయ్యో! సుబ్బయ్యో! వీ ఛానల్ గంతుల లీల
వద్దురా, వద్దురా, వద్దురా - అరె సిగ్గురా, సిగ్గురా, సిగ్గురా॥2॥
హే... వద్దు, వద్దు, వద్దు, వద్దు - వద్దు, వద్దు, వద్దు వద్దూ...
యా... ॥మా యింట్లో॥

చ: క్విజ్‌లంటూ, ప్రైజులంటూ వెర్రెక్కిస్తోంది
పిల్లగాళ్ళ చదువులన్నీ చెట్టెక్కించిందీ
ఓలమ్మో! యెంకమ్మో! మిడ్‌నైటు మసాల ఘాటు
ఓరయ్యో! సుబ్బయ్యో! ఆ ఫ్యాషన్ టీవీ పోటు
వద్దురా, వద్దురా, వద్దురా - అరె సిగ్గురా, సిగ్గురా, సిగ్గురా॥2॥
హే.. వద్దు, వద్దు, వద్దు - వద్దు, వద్దు, వద్దు, వద్దూ
॥మా యింట్లో॥

-తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.

('అవేకళ్ళు' చిత్రంలో "మావూళ్ళో ఒకపడుచుందీ" పాటకు పేరడీగా...)

## చిలిపి కవిత

వాడు పరమ దగుల్బాజీ
మర్డర్లు చెయ్యడం వాడికి చాలా ఈజీ
తెలియక ఇచ్చాను వాడికి అప్పు
అదే నేను చేసిన అతి పెద్ద తప్పు
ఎప్పుడడిగినా ఏదో ఓ క్లాసు పీకి
ఎప్పటికీ తీర్చి చావడు నా బాకీ
గట్టిగా అడగడానికి లేదు నాకు దమ్ము
గోడకు వేసిన సున్నమయ్యింది నా సొమ్ము
నా డబ్బు వసూలయేదెట్టా?
వీడి పిండాకూడు పిల్లలకి పెట్టా
- టి.యల్.లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.



# ఆనందరావ్గూ - తిరుపతి యాత్ర

- పి.వి.బి.శ్రీరామమూర్తి



ఎట్టకేలకు అంగీకరించాడు ఆనందరావు భార్య మాటని.

పెళ్లయిన అయిదు సంవత్సరాలలో రెండుసార్లు అబార్షన్లయాయి అనంత లక్ష్మికి. అందుకే, గర్భం నిలిచి మగపిల్లాడే పుడితే ఏడూళ్లు భర్తచే జోగి దండిస్తాననీ - తిరుపతి కొండకు నడిచి వస్తామనీ - కొండమీద దొర్లిదొర్లి ప్రదక్షిణలు చేస్తానని ఆమె మొక్కుకుంది. ఇంక -పుట్టిన పిల్లాడికి దేవుని పేరే పెడతాననుకోవటం మామూలు విషయమే.

అయితే-

ఏడూళ్ళు- అందునా- పరిచయంలేని ఊళ్లలో జోగి దండటానికి ఆనందరావు సుతారామూ అంగీకరించలేదు మొదట్లో. తరువాత గునిసాడు. ఎలాగో - రాత్రి ఎన్నో రకాలుగా కితకితలు పెట్టి భర్తని ఒప్పించింది అనంతలక్ష్మి.

చివరకో శనివారం, ఆఫీసుకు సెలవు పెట్టించింది. బ్యాండు మేళం నుండి ఓ బ్యాండు వాణ్ణి కుదిర్చింది. శనివారం ఉదయాన్నే లేచి భర్తకి తలంటిస్నానం చేయించింది. శ్రీనివాసుని ఫోటోకి పూజచేయించింది. కొబ్బరి కాయ కొట్టించింది. హారతినిప్పించింది. పట్టు పంచె కట్టించింది. భుజం మీద ఉత్తరీయం వేసింది. నిలువునా కుంకుం బొట్టు పెట్టింది. దేవునికి దండం పెట్టి సాగనంపింది.

వెళ్ళేటప్పుడు బ్యాండు అబ్బాయికి మరీ మరీ చెప్పింది. "నాయినా, ఈయనకి అసలే మొహమాటం, జాగర్తా చూస్కో." అని. దగ్గర్లోనే ఉన్న పల్లెటూరుకు ఏడో గంటకి చేరుకున్నారు.

ఊర్లో అడుగు పెట్టి-

ఓ గుమ్మం దగ్గరకెళ్ళేసరికి ఓ ముష్టి బృందం- "రామ నామము - రామ నామము రమ్యమైనది రామనామము - అండ పిండ బ్రహ్మాండమందున అమరి యున్నది రామనామము" అని పాటలు పాడుతున్నారు. ఆ ఇంటి ఇల్లాలు వచ్చి -

"ఇదిగో ఈ రూపాయి మీ పది మందీ నర్దుకోండి." అంది. వాళ్లు గొణిగారు. సణుక్కున్నారు. రూపాయి పట్టుకుపోతూ-

" దరమ తల్లి, పావలాలకే ఠికాణా లేదు. పది పైసలంట పది పైసలు. నువ్వుచ్చు కున్నావు గానీ - నా నయితే ఇసిరి కొడుదును" అంది అందులో ఓ ఆడది.

ఆ తరువాత లైన్లో ఉన్న ఆనంద రావుని చూసి - "నలభై పైసలుంటే ఇవ్వు. ఇదిగో అర్ధరూపాయి" అంది.

"అది కాదమ్మా. నేను ముష్టివాణ్ణిగాను. జోగి ఏడూళ్లు దండి తిరుపతి వెళ్తానని మా ఆవిడ మొక్కుకుంది".

"ఆఁ..నీలాటి వాళ్లు తొంభయిమంది ఇలాగే అంటారు. దేవుడు పేరుతో ఇదో ఘరానా మోసం. ఏం చేస్తాం? ఆ అర్ధా పట్టుకెళ్లు" అని విసురుగా గేటు తలుపు వేసి ఇంట్లోకెళ్లింది.

ఆనందరావు మనసు చివుక్కుమంది. ముఖం ఎర్రబడింది. బ్యాండబ్బాయి గమనించి "పరవానేదు బాబూ! ఆ పాపం ఆమెదే" అని ముందుకు నడిచారు. ఏ ఇంటికెళ్లినా చీదరింపులే. ఒకరేమో "దున్నపోతులాగా ఉన్నావు. మీకిదేం పోయే కాలం?" అని తిడుతూ



రూపాయో, అర్థో విసిరికొడితే - మరొకరు "అలా వెళ్లు నాయనా, చెయ్యి ఖాళీలేదు'' అనేవారు.

మొత్తం మీద ఏడు శనివారాలూ - తిట్లు కాస్తూ - ఏడూళ్ళూ తిరిగితే - ఆ దండిన డబ్బు బ్యాండు వానికే సరిపోలేదు.

పూరీ తిరుపతి ఎక్స్‌ప్రెస్‌కు రిజర్వేషన్ చేయించుకుని తిరుపతి బయలుదేరారు. భార్యకీ-తనకీ ఎదురెదర బెర్త్‌లే. సామానంతా -అడుగు బెర్త్ కావటం వల్ల జాగర్తగా అడుగున పెట్టి సూట్‌కేస్‌కి గొలుసు కట్టి- తాళం కప్ప వేసాడు. చీకటి పడుతుండగా తెచ్చుకున్న టిఫిన్లు కానిచ్చేసి- బెర్త్‌ల మీద పడకలు వేశారు. అనంతలక్ష్మి బాబుని పక్కన వేసుకుంది. ఎక్స్‌ప్రెస్ రాజమండ్రి దాటింది.

పాసింజర్లు బిలబిలమంటూలోన ప్రవేశించారు. సీట్లు వెతు క్కుంటున్నారు. పడుకున్న వాళ్లని లేపి " ఇది మీ నెంబరా? సారీ ఫర్ ది డిస్ట్రబెన్స్" అని వెళ్తున్నారు.

ఎవరో ముసలావిడ వచ్చి అనంత లక్ష్మి కాళ్ల దగ్గర కూర్చుంది. "ఎవరూ?" అంది అనంతలక్ష్మి.

"నేనే నమ్మా. తిరుపతి పోవాలి. రిజర్వేషన్ దొరకలేదు. టి.టి.కి మా అబ్బాయి చెప్పాడు. టి.టి. అందాకా సర్దుకోమన్నాడు" అంది.

"అలాగా, పోనీ. అలా సర్దుక్కూర్చోండి"

"నా తల్లే. ఎంత మందికుంటుందీ మంచి తనం. ఏం పేరమ్మా?"

"అనంతలక్ష్మి"

"ముచ్చటయిన పేరు. నా కూతురి పేరూ అదే." అని అలాగా మాటల్లో దించింది. అర్థ గంటలో "నువ్వటే కాంతం పిన్ని కూతురివా? మీ ఆయన పేరు ఆనందరావు కదూ!" అంది.

"అవునూ." అంది లేచి కూర్చుని అనంత లక్ష్మి.

''ఇంతకీ ఎక్కడికే ఒంటరిగా ఈ ప్రయాణం?"

''ఒంటరిగా కాదు. రెండుసార్లు అబార్షన్లయితే మొక్కుకున్నాం. కొడుకు పుడితే తిరుపతి వస్తామని. తిరుపతి వెళ్తున్నాం. ఇదిగో - ఈ పడుకున్నది మా ఆయనే'' అని ఆనందరావుని చూపెట్టింది.

"ఏమిటీ? మీరు తిరుపతేనా? మరే, తోడు దొరికింది. హమ్మయ్య. ఒరే భడుద్దాయి. ఆనందూ లేవరా! నేనీకు వరుసకు వదినే్న అవుతా!" అని అనంతలక్ష్మి ప్రక్కన కూర్చున్నదల్లా ఆనందరావు పక్కన చేరింది.

"ఎన్నాళ్ళకు కలిసావురా! మీ అమ్మబాగుందా? మీ అక్కనే ఊరిచ్చారు?" ఇత్యాది యోగక్షేమాలన్నీ అడిగి - "ఆనందూ! కాసేపు కునుకు తీసావు. కాసేపు నడ్డి వాలుస్తాను. అలా ఆ కిటికీ దగ్గర కూచోరాదూ!" అంది.

ఆనందరావుకి ముక్కు గిరిపోయింది కోపంతో. పళ్ళు పటపటా కొరికాడు బోలెడు డబ్బులిచ్చి - పదిరోజులముందు నుండి రిజర్వ్ చేయించుకుంటే త్రాష్టంలా వచ్చి - బోడి చుట్టరికం కలుపుకుని - నా సీటుకే ఎసరు పెట్టింది.

ఆనందరావు అయిష్టంగా - కదలకుండా - మెదలకుండా ఉండేసరికి - "పోనీండి. పెద్దావిడ. కొంచెం సర్దుకోండి" అని అనంతలక్ష్మి రికమెండేషన్ చేసే సరికి - చేసేదేం లేక- లేచి కూర్చున్నాడు. సీటు దొరకటమే తరువాయి - ఎయిరు పిల్లో తీసి ఆనందరావుకే ఇచ్చి - నిండా గాలి నింపమని - గాలి నింపాక - తలకింద పెట్టుకుని పడుకుండిపోయింది గుర్రుపెట్టి. ఆ పడుకోవటం గుడివాడ దగ్గర లేచింది. లేవగానే పెట్టేబేడా సర్దుకుని "వస్తానే లక్ష్మీ, ఇక్కడ మా పిల్లా - అల్లుడూ ఉన్నారు. రేపో, ఎల్లుండో తిరుపతి వస్తా. వీలుంటే తిరుగు ప్రయాణంలో దిగండి. స్టేషన్ దగ్గరే ఇల్లు" అని అల్లుడు పేరు చెప్పి - దిగిపోయింది. వెళ్ళిపోతున్నావిణ్ణి - ఒక్క తన్ను తన్నాలనిపించింది ఆనందరావుకి.

తిరుపతిలో దిగి - స్నానాలు ముగించుకుని- కాలినడకన ఏడుకొండలూ ఎక్కటం మొదలెట్టారు. కొంతవరకూ సరదాగానే గడించింది కానీ సామాన్లో చంకన- బాబుని భుజం మీదా వేసుకుని కొంత దూరం నడిచేసరికి మాత్రం 'ఇంకా ఎన్ని మెట్లెక్కాలా' అనుకున్నాడు.

ముందు రోజు రాత్రి సరిగా నిద్రలేకపోవటం చేత - భోజనం కూడా లేకపోవటం చేత కళ్ళు బరువు - కాళ్ళ పీకూ ప్రారంభం అయ్యాయి. టిఫిన్ చేసి వెళ్దామంటే అనంతలక్ష్మి ఒప్పుకోలేదు. "టిఫిన్ చేసి కొండకెళ్తామా? ఇంకేమన్నా ఉందా? మహాపరాధం! ఆ ఆలోచనే రాకూడదు, చెంపలేస్కోండి!" అంది.

చెంపలేసుకోక తప్పలేదు ఆనందరావుకి.

మరికొంతసేపు నడిచాడు కొండపైకి. చల్లనిగాలి మనసుకి ఆహ్లాదాన్నిస్తోంది. సూర్యుని లేతకిరణాలు నులివెచ్చగా వున్నాయి. మంచు బిందువులు కరిగి చెట్ల ఆకుల మీద నుంచి మీదపడి గిలిగింతలు పెడుతున్నాయి. కాసేపు కూర్చొని వెళ్తే బావుణ్ణనిపించింది.

"లక్ష్మీ కాసేపు కూచుందాం" అన్నాడు.

కాదన్లేదు అనంతలక్ష్మి. ఇద్దరూ కూర్చున్నారు. జనం గుంపులు గుంపులుగా నడుస్తున్నారు. ఒకాయన లక్ష్మీ పింగళి-కాటూరి "గడిచిన యాపదల్ కథలుగా సహయాత్రికు తోడ చెప్పుచున్..." అనే పద్యం రాగయుక్తంగా చదువుతూ - ముందుకు నడుస్తున్నాడు.

కొంతమంది ఘంటసాల వారి ప్రయివేటు గీతం "ఏడుకొండల వాడా... నమో వెంకటేశా!" అని... పాటలు పాడుకుంటూ ముందుకు నడుస్తోంటే-

అనంతలక్ష్మి "తిరుమల మందిర సుందరా!" అని పాడ్డం మొదలెట్టింది. వింటూ కూర్చున్న ఆనందరావుని - "మీరూ గొంతు కలపండి" అంది చేత్తో పాడుస్తూ. ఆనందరావు గొంతు పాటలకి పనికిరాదు. అయినా పాటందుకునే సరికి బాబు గొల్లుమన్నాడు. అనంతలక్ష్మి వాణ్ణి ఒళ్ళో వేసుకుంది. "మీరు పాడండి" అంది. ఆనందరావు పాడుతునే ఉన్నాడు. నడుస్తూ కొండ ఎక్కుతున్న ముసలి దంపతులు వీళ్ళనే ఎగాదిగా చూస్తూ - "కొండమీదికీ దాపురించారా!" అని రూపాయి బిళ్ళ విసిరింది.

"మేం ముష్టోళ్ళలా కనిపింఛామా?" కస్సుమన్నాడు ఆనందరావు.

"మాకేం తెల్సూ? ఆ ఆకారం చూస్తే - 'ఏమో' అనుకున్నా" అంటూ ఎర్రగా చూస్తూ ఆమె ముందుకు నడిచింది. ఆమె వెళ్ళాక ఆనందరావు అద్దం చూసుకున్నాడు. జుట్టు తాటిపీచులా ఉంది. కళ్ళు లోతుగా ఉన్నాయి. పది రోజులయి గియ్యని గడ్డం కలుపు మొక్కలు తియ్యని వరిపైరులా ఉంది. భుజం మీద తడి తువ్వాలు. పక్కన బేగులోంచి బైటకి కనిపిస్తోన్న బాబు ఉచ్చబొంతలూ. 'నిజమే తప్పు ఆమెదికాదు' అనుకున్నాడు.

ఎట్టకేలకు కొండకి చేరుకున్నారు.

అనంతలక్ష్మి బాబుని మెట్లమీద దించి మోకరిల్లి నమస్సులర్పించింది. ఆమెను అనుకరించాడు ఆనందరావు. ఆ తరువాత కాటేజికి డబ్బులు కట్టి - రూం తాళాలందుకొని సామాన్లందులో పడేసుకున్నాడు. కళ్యాణకట్టకు బయలుదేరాడు తలనీలాలు అర్పించుకోడానికి.

"ఏమండీ! నేనిక్కడ బాబునెత్తుకుని కూర్చుంటాను. మీరే గళ్ళతువ్వాలు కట్టుకుని వెళ్ళండి. ఓ అయిదో, పదో పట్టుకెళ్ళండి. తలనీలాలు తియ్యగానే వాడికిచ్చెయ్యండి. డబ్బులడిగితే ఇవ్వననకండి. కోపంతో వాడు కత్తి విసిరితే చికాకు" అంది.

"జాగర్త కూర్చో" అని ముందుకెళ్తోన్న ఆనందరావుకి ఎదురుగా వస్తోన్న గుళ్ళతో ఉన్నాళ్ళందరూ ఒక రకంగానే కనిపించారు. అప్పుడు డౌటొచ్చింది. కొంపతీసి 'నేనని భ్రమించి అనంతలక్ష్మి ఎవరితోనో నడిచేదు కదా!' అనుకుని వెనుదిరిగి - "లక్ష్మీ! నేనొచ్చి మూడుసార్లు పిలిచేదాకా ఎవరితోనూ వెళ్ళకు" అన్నాడు.

"మూడుసార్లు పిలవటమెందుకండీ. అయినా ఎవరితోనో నేనెందుకెళ్తానూ?" అంది సాగదీస్తూ.

"అదికాదే. గుళ్ళలో అందరూ ఒకలానే కనిపించటంలేదూ? అందుకే నేను పిలిచేదాక వెళ్ళమాకు" అన్నాడు ముందుకు కదుల్తూ.

"మీ ఇల్లు బంగారంగానూ!" అని అనంతలక్ష్మి పకపకా నవ్వింది. తలనీలా లర్పించుకుని - స్నానం చేసి చెట్టుకింద చూస్తే - అనంతలక్ష్మి అక్కడే ఉంది. అన్నట్లే మూడుసార్లు పిలిచాడు. ఆనందరావు వచ్చాక - "నేను బొక్కబోర్లా ప్రదక్షిణలు చేసుకోవాలి. మీరు బాబునెత్తుకుని కూర్చోండి. జాగర్త" అని చెప్పి వెళ్ళింది.

గంటపోయాక నిద్రపోతున్న ఆనందరావుని లేపి - "ఏమండీ! లెండి. దర్శనానికి తొమ్మిది గంటల వ్యవధి ఉంది. పాపనాశనం - ఆకాశగంగా తిరిగొచ్చేద్దాం" అని అంటుంటే -

"నిద్దరొస్తోంది"

"మీ నిద్దర బంగారంగానూ! లేవండి, లేవండి" అందామె.

లైన్లో నిల్చున్న బస్సెక్కారిద్దరూ. బస్సెక్కగానే ఇద్దరూ నిద్రలోనికొరిగారు. బాబు కంకటిల్లిపోయి ఏడుస్తున్నాడు. చుట్టుపక్కల యాత్రికులందరూ "పిల్లాడేడుస్తున్నాడు. ఏంటా మొద్దునిద్రా? మా చెవ్వులు చిల్లులు పడుతున్నాయి"అని కేకలేస్తోంటే-

ఆనందరావు లేచి "లక్ష్మీ! లక్ష్మీ! బాబు ఏడుస్తున్నాడు. పాలివ్వు" అని జబ్బలు పట్టుకు కుదిపాడు. తలనివాల్చి నిద్రపోతున్నావిడ "లక్ష్మియా? లక్ష్మి ఎవరు?" అని తెలివి తెచ్చుకుని చూసే సరికి -

"ఎ... ఎవరు మీరు" అంది కంగారు పడిపోతూ.

"నువ్వు. అనంతలక్ష్మి కాదా?"

ఆమె ఏడుపు లంకించటం మొదలుపెట్టింది. "మా ఆయనేరి... మా పాపెక్కడ?"

"అయ్యో... అనంతం! నిద్రలో లేపితే నువ్వనుకున్నా. ఎక్కడుండిపోయింది నా అనంతం?.... లక్ష్మీ!" ఆనందరావు చిందులు వేసాడు. బస్సులో అందరికీ పరిస్థితి అర్థం అయ్యేసరికి అర్ధగంట పట్టింది.

"సరే. బాగుంది వరస. ఏం మునిగిపోయిందిలేదు" అని బస్సును ఆపించి - తప్పిపోయిన అనంతలక్ష్మి గురించి



ఆనందరావూ - ఆమె భర్త గురించి ప్రక్కామెను - పోలీసులకు చెప్పి, కొండమీద ఎనౌన్సు చేయించారు. పావుగంటలో పదిసార్లు ఎనౌన్సుమెంట్లు విన్న అనంతలక్ష్మి - అప్పుడే ప్రదక్షిణలు పూర్తిచేసుకుని ఆఫీసు వైపు పరుగుతీసింది.

అనంతలక్ష్మి సుదర్శన కాటేజ దగ్గరే ఉంటున్నట్లు భర్త పక్కనే ఉన్న ఆమె భర్త గుడి మెట్ల దగ్గరే ఉంటున్నట్లు తిరిగి ఎనౌన్సుమెంటు ఇవ్వటం జరిగింది. అర్ధగంట తరువాత రెండు జంటలూ సురక్షితంగా కలుసుకున్నారు. ఆనందరావూ - అవతలివ్యక్తి రంగూ - పొడవుల్లోనూ సమానంగా ఉండటం చేత - తలజుట్టు - మీసం తీయించటం చేత ఒకర్నొకరు పోల్చుకోలేక పోవటం సమంజసమే అనిపించింది చూసిన అందరికీ.

అందరూ రెండు జంటలకీ జాగర్తలు చెప్పారు. అందరూ వీళ్ళ గురించి చెప్పుకుంటూ కడుపు చెక్కలయ్యేలా నవ్వుకున్నారు.

మొత్తం మీద యాత్ర ముగించుకుని తిరుగు ప్రయాణానికి సన్నద్ధమయ్యారు. రిజర్వేషన్ దొరకలేదు. గుడివాడ వరకూ బస్సు జర్నీ చెయ్యాలనుకున్నారు. టిక్కట్లు తీసి బస్సెక్కారు.

బస్సు కొంత దూరం వెళ్తోంది.

బస్సులో కూర్చున్న అందరూ ముక్కులు మూసుకుంటున్నారు.

దుర్గంధం!

ఎక్కణ్ణించో?

"ఏమిటీ?.... ఈ కంపేమిటీ?" ఒక్కొక్కరూ అనుకోసాగారు. ఆనందరావు పక్కనే కూర్చున్న ఒకాయన ఆ దుర్గంధాన్ని ఇముడ్చుకోలేక వస్తోన్న 'వాంతి'ని ఆపుకునేందుకు - నోటికడ్డంగా చేతినుంచుకుని -, చివాలున లేచి నించున్నాడు.

నించున్నాడే గాని - వాంతిని ఆపుకోలేక పోయాడు.

భళ్ళున వాంతు చేసుకున్నాడు. సరిగ్గా ఆనందరావు గుండంతా కరాబయింది. అందరూ ముఖాలు చిట్లించారు. "చీ..." అంటూ అనంతలక్ష్మి లేచింది బాబును ఎత్తుకుని. వాంతి చేసుకున్న వ్యక్తి భార్య భయపడిపోయి - తువ్వాలు తీసి - ఆనందరావు తలను తుడిచింది. ఆనందరావు ఏడుపు ముఖం పెట్టాడు. ఆమె ఆనందరావుని తీసుకెళ్ళి - నీళ్ళతో తలకడిగి - డెట్టాలుతో తుడించింది.

"అసలింతకీ ఈ కంపేమిటీ? డ్రైవర్‌గారూ, బస్సాపండీ... కొంపతీసి బస్సులో ఏదన్నా శవం ఉందేమో?" అన్న సందేహాన్ని వ్యక్తం చేసారందరూ. ఎక్కడా ఏంలేదు. బేగ్‌లు తనిఖీ చేసారు. అనంతలక్ష్మి బిగ్‌షాపర్‌లోంచి బట్టలు తీస్తోంటే - మళ్ళీ వక్కాయన వాంతు చేసుకోబోయి తమాయించుకున్నాడు.

బిగ్‌షాపర్‌లోంచి - మొన్న ప్రదక్షిణలు చేసి - ఆరెయ్యకుండా అనంతలక్ష్మి దాచిన తడి చీరకంపు అది! ఆనందరావుకీ కడుపులో తిప్పింది. "ఏమండీ! ఇందాకట్నుంచీ గోలచేస్తోంటే పట్టించుకోరేం? ఆ చీరవతలకి విసిరేయండి!' అన్నారందరూ కోపంగా ముక్కులూ... నోళ్ళూ మూసుకుంటూ.

విధిలేక చీర - చీరతో ఓ తువ్వాలు కిటికీలోంచి విసిరేసింది అనంతలక్ష్మి.

ఇంటికొచ్చాక - కొన్నాళ్ళ తరువాత -

"ఏమండీ! మీకో శుభవార్త" అంది అనంతలక్ష్మి.

"ఏంటది?"

"మీకు బాబో... పాపో... త్వరలో" సిగ్గుతో వంకలు తిరుగుతూ అంది.

ఆనందరావు ఆనందపడిన వాడల్లా ఆగిపోయి "ఇదిగోలక్ష్మీ! 'తిరుపతి'లో మళ్ళీ ఏం మొక్కుకోలేదు కదా!" అన్నాడు కంగారు పడిపోతూ.

★ ★ ★

ఆగస్టు 30 శైలేంద్ర జయంతి సందర్భంగా



# శైలేంద్రను హరించివేసిన 'తీస్రీ కసమ్'

శైలేంద్ర అభిమానులందరకూ తెలుసు - 'తీస్రీ కసమ్' సినిమా అతడి పాలిట మృత్యువుగా దాపురించిందని. ఆ సినిమా అతన్ని ఆర్థికంగా దెబ్బతీసిందనడం కంటె మానసికంగా కృంగదీసిందనడం కరక్టు. గొప్ప సినిమా తీశాడన్న ఖ్యాతి దక్కిందనుకుంటే అది కూడా హరించే ప్రయత్నాలు జరుగుతున్నాయిప్పుడు. తాజాగా లభ్యమవుతున్న 'తీస్రీకసమ్' డివిడి పై క్రెడిట్స్ చూడబోతే దాని నిర్మాత అనిల్‌మెహతా అట. ఆ సినిమాకై సర్వశక్తులూ వినియోగించిన శైలేంద్ర పేరు ఎక్కడా కానరాదు.



దరిమిలా క్లాసిక్‌గా పేరు తెచ్చుకున్నా నిర్మాత బతికుండగా ప్రేక్షకుల నిరాదరణకు గురైన సినిమా

శైలేంద్ర 'తీస్రీ కసమ్' సినిమాకై సర్వశక్తులూ ధారపోశాడనడం ఎంతమాత్రం అతిశయోక్తి కాదు. స్వయంగా రచయిత అయినా మరొకరి కథను తీసుకుని సినిమాగా రూపొందించాలని అనుకోవడం తమాషాగా జరిగింది. బిమల్‌రాయ్ యూనిట్‌తో బాటు శైలేంద్ర 'మధుమతి'కై పనిచేసే రోజుల్లో బిమల్‌రాయ్ అసిస్టెంటు బాసుభట్టాచార్య చేతిలో ఓ కథల పుస్తకం చూసి 'ఏమిటయ్యా అంత బాగుంటాయా ఫణీశ్వరనాథ్ రేణు కథలు!?' అని అడిగాడు శైలేంద్ర. బాసు భట్టాచార్య వెంటనే ఆ పుస్తకం శైలేంద్ర చేతిలో పెట్టి "దీనిలో ఉన్న మారే గయే గుల్ఫామ్' కథ చదివి అప్పుడు మాట్లాడండి" అన్నాడు. అదే శైలేంద్ర జీవితాన్ని మార్చేసింది.

శంకర్‌దాస్ కేస్రీలాల్ శైలేంద్రగా రావల్పిండిలో 1923 ఆగస్టు 30 న పుట్టిన శైలేంద్ర బాల్యం మధురాలో గడిచింది. 1947 లో రైల్వేలో ఉద్యోగం బొంబాయి తెచ్చివడేసింది. విప్లవభావాలతో కవిత్వం రాసే శైలేంద్రను ఓ సమావేశంలో 'జల్తా హై పంజాబ్' కవిత చదువుతూండగా చూసి ముగ్ధుడైన రాజ్ కపూర్ అతని వద్దకు వచ్చి ఆ పద్యాన్ని తనకు అమ్మివేయమని, తన సినిమాలకు పాటలు రాయమని కోరాడు. 'ఛీ, అలాటి పని ఎన్నడూ చేయను' అని తిరస్కరించాడు శైలేంద్ర. కానీ కొడుకు పుట్టిన తర్వాత ఖర్చులు పెరిగి, పరిస్థితులకు తలవొగ్గి తనకు తనకు తానుగా రాజ్‌కపూర్ వద్దకు వెళ్లి 'బర్సాత్' కి పాటలు రాయవలసి వచ్చింది.

ఇటువంటి ఆదర్శవాది కాపిటలిస్టు వ్యవస్థలో సినిమా తీయబోతే ఏమవుతుందో చెబుతుంది 'తీస్రీ కసమ్' నిర్మాణగాథ! అసలా సినిమాని 'లో బడ్జెట్'లో తీద్దామనుకున్నారు నిర్మాత శైలేంద్ర, దర్శకుడు బాసూ భట్టాచార్య. పల్లెటూరి హీరోగా మెహమూద్, అతడు మనసుపడిన నాట్యకత్తెగా నూతన్ అనుకున్నారు. కానీ సినిమా కథ వినగానే రాజ్‌కపూర్ శైలేంద్ర వద్దకు వెళ్లి 'ఇంత మంచి పాత్ర ఇంకోళ్లకు పోనిస్తానా? నేనే వేస్తాను.' అన్నాడు. రాజ్‌కపూర్ మాట శైలేంద్ర తోసేయగలడా? సరే అన్నాడు. ఆ సమయంలో నూతన్ గర్భవతి కావడంతో వహీదా రెహమాన్‌ను తీసుకోవలసివచ్చింది. ఇంత ప్రఖ్యాతులయినవారు హీరోహీరోయిన్లుగా ఉండడంతో సినిమా స్వరూపమే మార్చేయబోయారు డిస్ట్రిబ్యూటర్లు. షూటింగ్ స్టార్టవగానే కమ్మర్షియల్‌గా రాజీ వడమని శైలేంద్రపై ఒత్తిడి ప్రారంభమయింది. కానీ కథలో దానికి తావెక్కడ?

కథప్రకారం ఓ ఎద్దుబండి వాడు, ఓ నౌటంకీ (జాతరల్లో డాన్సులు చేసేవారు) అమ్మాయిని బండిలో ఎక్కించుకుని వేరే ఊరు తీసుకెళ్లవలసి వస్తుంది. బండివాడి అమాయకత్వానికి ముచ్చటపడిన ఆమె డాన్సులూ, అవీ వదిలేసి అతన్ని పెళ్లి చేసుకుని ఇల్లాలుగా స్థిరపడి పోదామని ఓ దశలో అనుకుంటుంది. కానీ ఆమెను బజారుమనిషిగానే చూసే వ్యవస్థ కట్టుబాట్లకు జడిసి అతనికి దూరమవుతుంది. ఇవన్నీ అర్థం చేసుకోలేని బండివాడు ఆమె తనను మోసం చేసిందని భావిస్తాడు. నౌటంకీ వాళ్లను ఇకపై బండి ఎక్కించుకోకూడదని ఒట్టు వేసుకుంటాడు.

కథంతా గ్రామీణవాతావరణంలోనే నడుస్తుంది కాబట్టి ఉత్తరప్రదేశ్‌లో షూటింగు తీద్దామనుకున్నాడు శైలేంద్ర. కానీ ఆయన బావమరిది అడ్డు తగిలాడు. 'అక్కడ బందిపోట్ల సమస్య ఉంది. మధ్యప్రదేశ్‌లో సాగర్ జిల్లాలో బీనా లో తీద్దాం. అక్కడ నాకు చాలా పలుకుబడి ఉంది.' అన్నాడా మహానుభావుడు! అతనే ప్రొడక్షన్ కంట్రోలర్! ఎంత గొప్ప కంట్రోలర్



శైలేంద్రను బిమల్‌రాయ్ ఆగ్రహానికి గురిచేసిన డైరక్టరు బాసూ భట్టాచార్య

అంటే చివర్లో బిల్స్ చూడబోతే హీరోకి 17 (అక్షరాలా పదిహేడు) కాస్ట్‌లీ సూట్లు కుట్టించినట్టుంది. హీరో చూడబోతే సినిమా మొత్తం అంతా పంచె కట్టుకునే తిరుగుతాడు. (డ్రీమ్ సీక్వెన్సులు లేవు లెండి). ఇదీ అతని నిర్వాకం.

అంతేకాదు, ఈ సినిమాకోసం ఓ జత ఎద్దులు కొనిపించారు శైలేంద్ర చేత! ఎందుకురా అంటే 'కంటిన్యుటీ' కోసంట! అద్దెకు తెస్తే ఎద్దులు మారిపోతే కంటిన్యుటీ దెబ్బతింటుందట!

అసలు బొంబాయి శివార్లలో తీసేస్తే పోయేదానికి మధ్యప్రదేశ్ దాకా డప్పు, డవాలుతో వెళ్లడం తుగ్లక్ చేయాల్సిన పని. మరి శైలేంద్ర బావమరిది ఆ పని ఎందుకు చేశాడయ్యా అంటే ఆ ఊళ్లో అతని ప్రియురాలు ఉందిట. ఆమె ఎదుట సినిమా షూటింగు అంటూ కాస్త హంగామా చేస్తే మురిసిపోతుందని ఇతని ఆశ! అయినవాళ్లే ఇలా ఏడిస్తే ఇక సినిమా గతేమవుతుంది? దానికి తోడు శైలేంద్ర గ్రహాలు కూడా బాగాలేవనాలి.

1962లో ఫేమస్ స్టూడియోలో 'సజన్‌రే ఝూట్ మత్‌బోలో' పాటతో రికార్డింగు స్టార్ట్ చేయబోతే అవేళ ఏసీ పాడయి కూచుంది. స్టూడియోను చల్లబరచడానికి బోల్డంత ఐసు తెప్పించి, ఫాన్లు వేసి పెట్టవలసివచ్చింది. సినిమా తీయడానికి నాలుగేళ్లు పట్టింది! రాజకపూర్ 'సంగమ్' తీస్తూ దీన్ని వెనకబెట్టాడని అంటారు కానీ అది నిజం కాదంటారు శైలేంద్ర కుమారులు. సినిమా పూర్తయేసరికి దాని ముగింపు విషాదాంతంగా ఉండడం నచ్చలేదు చాలామందికి. 'హీరో, హీరోయిన్లని కలపకపోతే లాభం లేదు, రెండ్రోజులు కూడా ఆడదు' అన్నారు శైలేంద్ర హితైషులు. 'ముగింపు అలా ఉండడం బట్టే నాకు కథ నచ్చింది. అది మారిస్తే సినిమా తీయడమే వేస్టు' అని శైలేంద్ర వాదించాడు.




నిర్మాతగా వేరేవారి పేరు చూపుతున్న డివిడి

1966 సెప్టెంబరులో సినిమా మొదటగా ఢిల్లీ-యూపీ సర్క్యూట్‌లో విడుదల చేశారు. కానీ రిలీజ్ సమయంలో శైలేంద్ర అక్కడ ఉండడానికి వీలులేకపోయింది. ఓ డిస్ట్రిబ్యూటర్‌కు గ్యారంటీ ఇచ్చి అనవసరంగా లీగల్ ప్రాబ్లెమ్స్‌లో ఇరుక్కున్నాడు శైలేంద్ర. అందువల్ల 'బయటకనబడితే అరెస్టు చేయవచ్చేమో, మీరు అటువైపుకు వెళ్లకండి' అని సలహా ఇచ్చాడు శైలేంద్ర లాయరు. నాలుగేళ్లపాటు అష్టకష్టాలు పడి తొలిసారిగా సినిమా తీస్తే దాని ప్రారంభోత్సవానికి కూడా వెళ్లడానికి లేకపోయిందే అని ఎంతో బాధపడ్డాడు శైలేంద్ర.

కానీ సినిమా రిలీజయిన తర్వాత పడ్డ బాధతో పోలిస్తే ఇది చిన్నదే! రిలీజయిన మూడోరోజునే థియేటర్స్‌లోంచి సినిమా తీసేశారు. అంత ఘోరంగా ఫ్లాపయింది. శైలేంద్ర విలవిలలాడిపోయేడు. ఆర్థికపరంగా కనక చూస్తే శైలేంద్ర ఆ నష్టాన్ని ఏడాదిలోపే పూడ్చుకోగలిగేవాడు. గేయరచయితగా విపరీతంగా సంపాదిస్తున్న రోజులవి! కానీ తన డ్రీమ్ ప్రాజెక్టు ప్రేక్షకుల నిరాదరణకు గురయిందనే బాధ అతన్ని తొలిచివేసింది. చేతిలో ఉన్న బ్యానర్లకు పాటలు రాసే ఉత్సాహం కూడా పోయింది.

విజయ్ ఆనంద్ 'జ్యూయల్ థీఫ్' తీస్తున్నాడు అప్పుడు. 'గైడ్'లో అద్భుతమైన పాటలు రాసిన శైలేంద్ర చేతనే అన్ని పాటలూ రాయించాలని రోజూ వచ్చేవాడు. శైలేంద్ర మొహం చాటేసేవాడు. చివరికి 'రులాకే గయా సప్‌నా మేరా' (అతని మానసిక స్థితిని ప్రతిబింబించే పాట) ఒక్కటీ రాసి వదలిపెట్టమన్నాడు.

సినిమాకి దర్శకత్వం నెరపిన బాసూభట్టాచార్య తన గురువు బిమల్‌రాయ్ కూతురు రింకీతో పారిపోయి పెళ్లిచేసుకున్నాడు. ఒళ్లు మండిపోయిన బిమల్‌రాయ్ అత్త మీద కోపం దుత్త మీద చూపినట్టు అల్లుడి మీది కోపం అతనికి ఛాన్సిచ్చిన శైలేంద్ర మీదకు మళ్లించాడు. 'బందిని' పాటలు రాసే పని గుల్జార్ కి అప్పచెప్పాడు. తర్వాత చల్లబడి శైలేంద్రను పిలిపించాడనుకోండి.

తన సినిమా దెబ్బతినడంతో జీవితేచ్ఛ నశించిన శైలేంద్ర డిసెంబరు 14 న తనువు చాలించాడు. అతని మరణం తర్వాత 1967లో బొంబాయిలో రిలీజయిన 'తీస్రీ కసమ్'ను జనాలు ఆదరించారు. అప్సరా థియేటర్‌లో ఐదు వారాలాడింది. 1967 మాస్కో ఫెస్టివల్‌కు ఎంపికయింది. ప్రెసిడెంటు గోల్డ్ మెడల్ గెలుచుకుంది. నేటి ప్రధానమంత్రి వాజపేయికి ఇష్టమైన సినిమాల్లో 'తీస్రీ కసమ్' ఒకటి. కానీ ఇవన్నీ చూడడానికి నోచుకోలేదు శైలేంద్ర.

సంగీతపరంగా, అభినయపరంగా కలకాలం గుర్తుంచుకోదగిన సినిమా - 'తీస్రీ కసమ్'. అదేవిధంగా వ్యాపారకళ తెలియని కళాకారుడు చిత్రనిర్మాణం జోలికి పోతే దెబ్బతింటాడన్న పాఠం కూడా నేర్పుతుంది ఈ సినిమా.

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**




వీనుల విందు, కన్నుల పండుగ, మనసుకి తృప్తి.... ఇవన్నీ విజయావారి చిత్రాలు చూసిన తరువాత కలిగే భావాలు. 1959లో విడుదలైన విజయావారి 'అప్పుచేసి పప్పుకూడు' చిత్రంలోని పాటలు కూడా అదే అనుభూతికి తిరిగి బెపోసనపడతాయి. ఈ చిత్రంలోని 'కొన్ని' పాటలలో ఓ ప్రత్యేకత ఉంది. సాహిత్యాన్ని పక్కన పెట్టేసి పాటను మాత్రం ఆలపించుకుంటూ పోతే పల్లవికి, చరణాలకు ట్యూన్‌లో తేడా పెద్దగా ఉండదు. అయినా ఎక్కడా విసుగు చెందని రీతిలో ఆ పాటలున్నాయంటే అందుకు కారణం, అసలు బలం ఏమిటన్నది నిజాయితీగా అంతర్ముఖులై ఎవరికివారు తమని తాము ప్రశ్నించుకుంటే దొరుకుతుందే తప్ప వాదోపవాదాల వల్ల లభించదు. ఎస్.రాజేశ్వరరావు సంగీతాన్ని సమకూర్చగా పింగళి నాగేంద్రరావు రాశారా పాటలని. నాగిరెడ్డి, చక్రపాణి ఈ చిత్రానికి నిర్మాతలు కాగా జాతీయ స్థాయిలో తెలుగువారు గర్వించదగ్గ మహామనీషి ఎల్.వి.ప్రసాద్ (అక్కినేని లక్ష్మీ వరప్రసాద్) దర్శకుడు.

అరవై నాలుగు కళలలో సంగీత సాహిత్యాలకు అగ్ర తాంబూలం ఇచ్చారు పెద్దలు. అలాగే భారీ తారాగణానికి దీటుగా పాటలు ఉండేలా సంగీత సాహిత్యాల విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధను తీసుకొంటూ అది తమ పరువు ప్రతిష్టలకు సంబంధించిన సవాల్‌గా బ్యానర్‌కొక విలువను సంపాదించి పెట్టేవారు ఆ రోజుల్లో. అటువంటి ప్రాశస్త్యాన్ని కలిగిన విజయావారు నిర్మించిన చిత్రమే




ఆ చిత్రంలోని పాటలలో ఓ అయిదు ఈ సంచికలో...

అప్పుచేసి పప్పుకూడు తినరా ఓ నరుడా
గొప్పనీతి వాక్యమిదే వినరా పామరుడా
దొంగతనము తప్పురా దోపిడీలు ముప్పురా
అందినంత అప్పుచేసి మీసం మెలితిప్పరా ॥అప్పు॥
ఉన్నవారు లేనివారు రెండే రెండు జాతులురా
ఉన్నచోట తెచ్చుకొనుట లేనివారి హక్కురా ॥అప్పు॥
వేలిముద్ర వేయరా సంతకాలు చేయరా
అంతగాను కోర్టుకీడిస్తే ఐపి బాంబుందిరా ॥అప్పు॥
రూపాయె దైవమురా రూపాయే లోకమురా
రూకలేని వాడు భువిని కాసుకు కొరకాడురా ॥అప్పు॥




ఈ పాట టైటిల్స్ చూపిస్తుండగా వస్తుంది. ఘంటసాల ప్రధాన గాయకుడుగా సాగిన ఈ నేపథ్య బృందగీతాన్ని హరికాంభోజి రాగచ్ఛాయలలో స్వరపరిచారు. వ్యంగ్య వైభవంతో రాసిన ఈ పాట సాహిత్యంలో గల అర్థాన్ని, పరమార్థాన్ని గ్రహిస్తూ మరోసారి మననం చేసుకుంటూ అవలోకించగలిస్తే - ఈ నలభై నాలుగేళ్ళుగా అర్థం విషయంలోనూ, స్వార్థం విషయంలోనూ మనలో ఏ మార్పూ రాలేదన్న విషయాన్ని - చీమ కుట్టినట్టుగా కూడా ఫీలవనంత మంద మనస్కులుగా ఎలా మారిపోయామా అనే బాధ కలుగుతుంది.

మంజరి : చివురుల పూవుల సింగారముతో తీవెలు సొంపును గనలేదూ
ముసిముసి నవ్వుల గిలిగింతలతో వసంత ఋతువా రానేలేదూ -
కాలం కాని కాలంలో కూయిల కూత లెందుకనో
తరుణం కాని తరుణంలో నా మది యీ గుబులెందుకనో ॥కాలం కాని॥
ఉష : వలపులు మీటగ తీయని పాటలు హృదయ వీణపై పలికెనుగా
ప్రియతము గాంచిన ఆనందములో మనసే వసంత ఋతువాయెనుగా
కాలం కాని కాలంలో కూయిల కూతలందుకనే
తరుణం కాని తరుణంలో నీమది ఆ గుబులందుకనే ॥కాలం కాని॥
మంజరి : తళుకు బెళుకుల తారామణులతో శారదరాత్రులు రాలేదూ
ఆకాశంలో పకపకలాడుతు రాకా చంద్రుడా రానే లేదూ -
కాలం కాని కాలంలో చల్లని వెన్నెల ఎందుకనో
తరుణం కాని తరుణంలో నా మది యీ గుబులెందుకనో ॥కాలం కాని॥
ఉష : తలచిన తలపులు ఫలించగలవని బులబాటము బలమాయెనుగా
పగటికలలు గను కన్యామణులకు ప్రియుడే రాకా చంద్రుడుగా
కాలం కాని కాలంలో చల్లని వెన్నెల అందుకనే
తరుణం కాని తరుణంలో నీ మది ఆ గుబులందుకనే ॥కాలం కాని॥



ఈ పాటను పి.లీల, పి.సుశీల పాడగా సావిత్రి, గిరిజ అభినయించారు. పాట చివర్లో యస్వీరంగారావు, రమణారెడ్డి కూడా కనిపిస్తారు. భీంప్లాస్ రాగం అంటే ఎలా వుంటుందని తెలుసుకోవాలనుకునే వారికి ఈ పాట ఒక మంచి ఉదహరణ. అంతే కాదు..... ఈ భీంప్లాస్ రాగంలో రాజేశ్వరరావు గారి శైలిని ఆకళింపు చేసుకోడానికి కూడా పనికొస్తుందీపాట. కావాలంటే చరణాలలోని తొలి పంక్తులను ఆలాపించుకుంటూ రాగఝరీ ప్రపంచంలో కాస్సేపు నిమగ్న మవడానికి ప్రయత్నించండి.... 'చదువుకున్న అమ్మాయిలు' సినిమాలోని 'ఒకటే హృదయము కోసము' పాట స్ఫురిస్తుంది. ఇంకా కాస్త వెనక్కి వెళ్ళగలిగితే రాజేశ్వరరావు గారి ప్రైవేట్ రికార్డు 'పాట పాడుమా కృష్ణా... పలుకు తేనెలొలుకునటుల' అనే పాట స్మృతి పథంలో సాక్షాత్కరిస్తుంది. ఈ రెండు అనుభవాలను పొందగలిగితే భీంప్లాస్ రాగం మీద అవగాహన కొంత వచ్చేసినట్టే... ఇక- సాహిత్య పరంగా చూసుకుంటే- యుక్త వయసు వచ్చిన ఇద్దరమ్మాయిల మనోభావాలు... ఆ మనోభావాల స్వభావాలు... వీటిని భాషలోకి అనువదించాల్సి వస్తే - అదీ రాగ తాళాలకు కట్టుబడే ఒక పాట రూపంలో చెప్పాల్సివస్తే - ఎలా రాయాలి అనే కోణం నుంచి ఆలోచిస్తే - ఈ పాటలో రచయితగా పింగళి నాగేంద్రరావు చూపిన సంస్కారానికి హృదయం పులకించిపోతుంది. తాళం, లయ ప్రసక్తి వచ్చింది కనుక ఈ పాటలో గమనించవలసిన విషయాలలో వాటి గురించి కూడా చెప్పాలి. ఒక లయ, ఒక తూగు పాట మొత్తం పరుచుకుని వున్నా, తాళం మాత్రం ఒక్క పల్లవి వచ్చినప్పుడు మాత్రమే వుంటుంది.

భజ : ఓ మరదలా! నా మదిలో పొంగి పొరలే ప్రేమ వరదలా!
నీరూ, పాలూ కలిసి ఒకటై నటులే నీవూ, నేనూ ఒకటేగదా - ఓ పంచవన్నెల చిలకా
ఓ పంచవన్నెల చిలకా! నీకెందుకింత అలకా! ॥ఓ పంచ॥
మాటాడవేమే, మాటాడవేమే నీ నోటి ముత్యాలొలకా! ॥ఓ పంచ॥
ఉష : ఓహెూ! బావా! మార్చుకో నీ వంకరటింకర దోవా!
ఊరికే, నీవూ నేనూ ఒకటే ననుకుంటే ఒప్పుతుందా ఈ లోకం... ఓ కొంటె బావగారూ
ఓ కొంటె బావగారూ, మనకెందుకింక పోరూ -
మా నాన్నగారు చూస్తే, మా నాన్నగారు చూస్తే మీదుమ్ము దులుపుతారు ॥ఓ కొంటె॥
భజ : సీమ టపాకాయలాగ, చిటాపటా లాడేవ్ ॥సీమ॥
ప్రేముందా లేదా ఓ మరదలా నామీదా ॥పంచ వన్నెల॥
ఉష : మరదలినైతే మాత్రం, మరీ అంత చనువా ॥మరదలి॥
మర్యాద కాదూ నీ బావమరిది చొరవా ॥ఓ కొంటె॥



ఈ పాటలను ఘంటసాల, స్వర్ణలత పాడగా రేలంగి, గిరిజ అభినయించారు. ఒక హాస్య జంటకు యుగళగీతం రాయాల్సి వస్తే ఎటువంటి పద ప్రయోగాలు చెయ్యొచ్చు, సంస్కారం సరిహద్దులు దాటకుండా భాషని భావాలకు ఎంతవరకు సహకరింప చేయవచ్చు అనే అంశంపై ఎప్పటికప్పుడు ధోరణులు మారుతూవున్నా కొన్నిటినైనా ప్రామాణికంగా తీసుకోక తప్పదు. అటువంటి ప్రామాణిక గీతాలలో ఈ పాట కూడా ఒకటి. కావాలంటే ఉన్న రెండు చరణాలలో స్త్రీ పాత్రకి రాసిన వాక్యాలను గమనించండి. ఇదే భావాలకి తర్వాతి రోజులలో వచ్చిన సాహిత్యం ఎటువంటి మార్పులకు గురి అయిందో బేరీజు వేసుకోండి చాలు. ఒక మంచి పాట పుట్టాలన్నా, పాటల ద్వారా సంస్కారం పెరగాలన్నా, పెంచుకోవాలన్నా ఈ రకమైన 'మనోవికాస వైజ్ఞానిక వ్యాయామం' తప్పదుమరి.

ఇక స్వరరచన పరంగా చూసుకుంటే ఈ పాట పీలూ రాగంపై ఎక్కువగా ఆధారపడిందని చెప్పుకోవాలి. ఈ రాగంలో వచ్చిన పాటల గురించి తెలుసుకోవాలంటే- 'ప్రభు గిరిధారి శౌరీ రావయా' (పరువు - ప్రతిష్ఠ), 'ఆదిలక్ష్మి వంటి అత్తగారివమ్మా' (జగదేకవీరుని కథ), 'నీకై వేచితినయ్యా ఓ ఏకాంత రామయ్యా' (శ్రీకృష్ణార్జున యుద్ధం) పాటలను అధ్యయనం చేయాల్సి వుంటుంది. ఉదహరించిన పాటల బట్టి రాగం పోకడను అవగాహన చేసుకోగలిస్తే - అటువంటి రాగాన్ని- ఇంత హాస్యస్ఫోరకమైన గీతానికి వాడడంలో రాజేశ్వరరావు ప్రజ్ఞ తెలుస్తుంది. చరణాలలో గాని, ఇంటర్‌టూడ్స్‌లో గాని - ఎక్కడైనా రావోయి చందమామా (మిస్సమ్మ) పాట గుర్తుకు రావడం సబబు. అందుకు కారణం ఏమిటంటే రావోయి చందమామ పాటకి బేసికల్‌గా భీంప్లాస్ రాగం ఆధారమే అయినా చరణాలలో స్వతంత్ర సంచారం చేశారు రాజేశ్వరరావు. అలా స్వతంత్రంగా చేసిన సంచారంలో పడిన స్వరాలు ఈ పీలూ రాగంలో కూడా ఉన్నాయి. 'చెవులుండే మనసుకే ఇనిపిస్తుందా ఇదీ' అని ఆత్రేయగారన్నట్టు- మంచి పాట ఏదైనా సరే - కాస్త లోతుగా వెళ్ళగలిస్తే- ఎంతో విషయాలు నేర్పుతుంది మనకి.

మంజరి : ఎచటి నుండి వీచెనో ఈ చల్లని గాలి ॥ఎచటి॥
తీవెలపై ఊగుతూ పూవులపై తూగుతూ ॥తీవె॥
ప్రకృతి నెల్ల హాయిగా ॥ప్రకృతి॥
తీయగా మాయగా పరవశింప జేయుచు
రాజా : ఎచటి నుండి వీచెనో ఈ చల్లని గాలి
జాబిలితో ఆడుతూ వెన్నెలతో పాడుతూ ॥జాబిలి॥
మనసు మీద హాయిగా.. ॥మనసు॥
తీయగా మాయగా మత్తుమందు జల్లుతూ
మంజరి : ఎచటినుండి వీచెనో ఈ చల్లని గాలి
హృదయవీణ మీటుతూ ప్రేమగీతి పాడుతూ ॥హృదయ॥
ప్రకృతినెల్ల హాయిగా... ॥ప్రకృతి॥
తీయగా మాయగా పరవశింపజేయుచు ॥ఎచటి॥



ఈ పాట ఈ రోజుకి కూడా తీయగా, మాయ(లా)గ, మత్తుమందు జల్లుతూ పరవశింపజేస్తూ ఉంటుంది. ఘంటసాల, లీల పాడిన ఈ పాటను ఎన్.టి.ఆర్., సావిత్రి అభినయించారు. మోహనరాగంలో తిశ్రగతిలో సాగిన ఈ పాట స్వరరచనలో మాధుర్యం కోసం నిషేధం ('ని' అనే స్వరం)ని కలుపుకున్నా అలా వచ్చిన స్వరాల నడక 'హంసధ్వని' రాగంలా ధ్వనించకుండా 'సినీమోహన' అని అనుకునేలా ఉండడం ఓ ప్రత్యేకతగా చెప్పుకోవాలి. (ఇటువంటి అనుభవాల్ని దృష్టిలో పెట్టుకొబట్టే 'మహామంత్రి తిమ్మరుసు' చిత్రంలో మోహనరాగాన్ని వర్ణించవలసిన 'మోహనరాగమహా' అనే పాటలో చిత్రసీమలో వెలయగజేసి దివ్యగానమున జీవముపోసి' అనే వాక్యాలను పింగళి నాగేంద్రరావు గారు నర్మగర్భంగా రాసేరేమోనని కొందరు ఆత్మీయంగా భాష్యం చెబుతూ ఉంటారు కూడా) 'ఎచటి నుండి వీచెనో' పాటలో ఫ్లూట్, పియానో మాత్రమే ప్రధానంగా వినిపిస్తాయి. తెరపై కనిపించే హీరో హీరోయిన్లకి డ్రెస్ ఛేంజ్ లేదు. లొకేషన్ ఛేంజ్ లేదు. మూమెంట్ విషయంలో కూడా ఎడంపక్క ఎన్టిఆర్ గానీ కుడిపక్క సావిత్రి గాని ఒక్క అడుగు కూడా ముందుకు కదలడం ఉండదు. వినిపించే వాద్యాలు కూడా రెండే. మరి ఆ పాటని ఇవాల్టికీ వినడానికే కాక చూడ్డానిక్కూడా ఇష్టపడుతున్నారంటే అందుకు కారణం ఏమిటన్నది తిరిగి ఎవరికి వారు తమలోకి తాము తొంగిచూసుకొని అర్థం చేసుకోవలసిందే!

మంజరి; సుందరాంగులను చూసిన వేళల
కొందరు ముచ్చట పడనేలా
కొందరు పిచ్చను పడనేలా ॥సుంద॥
రఘు : అందము ప్రాయము ఐశ్వర్యము గల
సుందరి దొరుకుటె అరుదుకదా ॥అందము॥
ముందుగ ఎవరిని వరించునోయని
తొందరలో మతిపోవు కదా ॥సుంద॥
రాజా: హృదయమునందలి ప్రేమగీతమే
మధురముగా వినిపించు కదా
మందహాసమున మనసును దెలిపే
ఇందువదన కను విందు కదా
మంజరి :ప్రేమ పరీక్షలు జరిగే వేళల
కొందరు పరవశ పడనేలా
కొందరు కలవర పడనేల
రఘు: యువతి చెంత పర పురుషుడు నిలిచిన
భావావేశము కలుగు కదా ॥యువతి॥
ప్రేమ పందెమును గెలిచే వరకు
నా మది కలవర పడును కదా ॥ప్రేమ పరీక్షలు॥
రాజా: కోయిల పలుకుల కోమలి గాంచిన
తీయని తలపులు కలుగు కదా ॥కోయిల॥
వరము లొసంగే ప్రేమదేవి గన
పరవశమే మది కలుగు కదా ॥సుంద॥



ఈ పాట ఆరభి రాగంలో చతురస్ర రీతిలో మలచబడింది. లీల, ఎం.ఎ.రాజా, ఘంటసాల ఆలపించగా సావిత్రి, జగ్గయ్య, ఎన్.టి.ఆర్. అభినయించారు. ఈ పాటను వినగానే 'ఇది విజయావారి సినిమాలోది కదూ?' అని ఓ మోస్తరుగా అడపాదడపా సినిమాలు చూసే వాళ్ళు కూడా ఇట్టే చెప్పేస్తారు. అందుక్కారణం - 'మిస్సమ్మ' చిత్రంలో ఇదే రాజేశ్వరరావుగారి చేతులమీదుగా వచ్చిన 'బృందావన మది అందరిది' పాటే. పక్కపక్కన పెట్టిచూస్తే ఈ రెండు పాటలూ అక్కచెల్లెళ్ళలా ఉంటాయి. చాలాకాలం గ్యాప్ తీసుకుని విజయావారు నిర్మించిన 'రాజేశ్వరీ విలాస్ కాఫీ క్లబ్' సినిమాలో పెండ్యాల సంగీతంలో వచ్చిన 'నా పేరు బికారీ నాదారి ఎడారి' పాట, ఆ తర్వాత ఇంకొంచెం గ్యాప్ తీసుకుని నిర్మించిన 'బృందావనం', 'భైరవద్వీపం' సినిమాలలో మాధవపెద్ది సురేష్ సంగీతంలో వచ్చిన ఆ రోజు నా రాజు చిరునవ్వు చూసి అనుకున్నా ఏదో నవ్వని' పాట, 'ఘాటైన ప్రేమనటన' పాట ఇవన్నీ ఆ రెండు పాటల ప్రేరణతో పుట్టినవే. విజయా సంస్థతో సన్నిహిత సంబంధాలు ఉన్న దర్శకుడు సింగీతం శ్రీనివాసరావుగారు ఓ సారి ఓ టీవీ సీరియల్‌కి సంగీత దర్శకత్వాన్ని వహించవలసి వచ్చినప్పుడు 'మా విజయావారి రాగాన్ని వాడుకుందామా?' అంటూ ఓ చరణాన్ని ఆ రాగంలో ట్యూన్ చేశారు కూడా. త్రికోణ ప్రేమలో కలిగే హృదయ స్పందనలను వర్ణించే గీతాలలో ఇంత సంస్కారంగా ఇంత చమత్కారంగా మరోపాట రాలేదేమోనన్నంత ఉదాత్తంగా సాహిత్య సుగంధాలను పాట మొత్తం పరచిన పింగళివారి పాళీని తల్చుకొని మరీ మురిసిపోక తప్పదు.

మిగిలిన మరికొన్ని పాటల గురించి వచ్చే సంచికలో...


భీమనేని రోషితాసాయి సమర్పించు
గుడ్‌విల్ సినిమా
2
వ వారం
దొంగోడు
మీసం మెలేసాడా అంతే..!
DIGITAL dts SOUND
భీమనేని శ్రీనివాసరావు
విద్యాసాగర్ రమణరాజు మరుధూరి రాజా గౌతంరాజు సీతారామశాస్త్రి చంద్రబోస్ భాషశ్రీ
Designed by : AELAY


a Y. V. S. CHOWDARY film
యలమంచిలి గీత సమర్పించు
బొమ్మరిల్లు వారి
సీతయ్య
ఎవ్వరి మాటా వినడు!
DIGITAL dts SOUND
యం.యం.కీరవాణి
వై.వి.ఎస్.చౌదరి
కొమ్మినేని వెంకటేశ్వరరావు
పోసాని కృష్ణమురళి - డా॥సి.నారాయణరెడ్డి - చంద్రబోస్ - మధు.ఎ.నాయుడు - జె.శ్రీను - యమ్.కుమార్ - రాజు - కోటగిరి వెంకటేశ్వరరావు - దోనవల్లి రామమోహనరావు - కాకర్ల శ్రీనివాసరావు